శ్రీ

# బుద్ధబోధసుధ

శ్రీరామా.

—.0.—

(నాంది)

అన్యులదుఃఖము ల్స్వమహితార్తులుగాఁ దలపోసి లోకసా
మాన్యదురంతదుష్కృతుల * మాపఁగఁ గంకణ మూని భూతకా
రుణ్యజితేంద్రియత్వముల * ప్రోజ్జ్వలమైనవిశుద్ధబుద్ధచై
తన్యమగణ్యపుణ్యగుణ * ధన్యులఁ జేసెడుఁగాత మిమ్ములన్.

(నాంద్యంతమున)

సూ.—బావా! పారిపార్శ్వకా!

పా.—(ప్రవేశించి) చిత్తము.

సూ.—ఈ మన మాడఁబోవు పానుగంటి లక్ష్మీనృసింహారావు "బుద్ధబోధసుధ" యనుపదవనాటకము మిక్కిలి విచిత్రమైనది సుమా!

పా.—ఆతనినాటకము లన్నియు రసవంతములును జిత్రములే. ఇందుఁ జమత్కారవిశేష మేమున్నది?

సూ.—రచనాచమత్కృతిమాట గాదోయి!

పా.—మఱి దేనిమాట?

సూ.—ఇదిగో విను.

గీ. ఆత్మ పూజ్యంబు, పరమాత్మ * యాపగిదినే
పూజ్య, మఖిలంబు శూన్య మే * పూరుషోత్త

మునికి; నాదేవతాంశజ * బుద్ధబోధ
నంబుఁ బ్రకటించు నయ్యా! యీ * నాటకంబు.

పా—నాటకవైచిత్ర్యమున కేమిగాని మీమాటలసందర్భ మత్యాశ్చ ర్యకరముగఁ గాన్పించుచున్నది.

గీ. ఉన్నదంతయు లేదంచు * నుర్విఁ జాటి
నతనిఁ బురుషోత్తముఁడుగఁ బ * ల్కితివి; దైవ
జలదఝంఝూనిలంబు బయి * మెలఁగినట్టి
వాని నంటివి బుద్ధదే * వం బటంచు.

సూ—అలాగుననా!

సీ. సకలభోగములకా * స్పదమౌ మహారాజ
వంశంబునందు ను * ద్భవము నొంది
సదమలరూపాభి * జాత్యమానితగుణ
శీలయౌ నెలనాఁగఁ * జెట్టవట్టి
బాలసూర్యప్రభా * పటలి మించినమంజు
తనుకాంతి గలముద్దుఁ * దనయుఁ గాంచి
సంయమికేని యౌ * నలుగొల్పు పరివార
విత్తరాజ్యాదిసం * పత్తిఁ బడసి

గీ. వీని నన్నింటి దుఃఖాత్మ * విభవములుగ
నెంచి, తృణములయట్లు వ * ర్జించి పోయె
బుద్ధదేవుండు; వానిని * బూరుషోత్త
ముఁడని చెప్పిన నాశ్చర్య * మగుదె సఖుఁడ

పా—వైభవములమధ్యమున నుండి వానినెల్ల నొక్కత్రుటిలోఁ ద్యజి యించి సన్యాసియై పోవుటచే ననన్యసామాన్యధైర్య వైరాగ్య సంపన్నుఁ డగుబుద్ధునిఁ బురుషోత్తముఁ డంటిరి సరియే! కాని వ

టోత్తమా! ఆయన దైవముగూడ నెట్లగును? ఆతఁడే దైవ మైన
యెడల దైవము లేఁడని చెప్పి యాత్మహత్యఁ గావించుకొను
నా? ఇదిపెద్దయసందర్భపుఁ బుట్టినిమునుకగా నున్నది.

సూ—ఏమియు నసందర్భము లేదు!

ఉ. ఆఁకటి, దప్పిని న్నిదుర * నన్నిఁటి బట్టి వధించి, యాత్మబా
ధాకరమౌ పరోపకృతి * ధర్మముగాఁ గొని చేసె దానిచే
లోకము సౌఖ్యమందు నని; * లోకహితార్థము బుద్ధుఁ డాత్మహ
త్యాకరణైకదీక్షుఁడని * యన్నను నీవనవచ్చు భావుకా!

గీ. పరులదుఃఖంబుఁ జల్లార్చ * తలఁచి భిన్న
మౌనహంభావమును మాపి * యాత్మ దోర్చి
తాను సర్వాత్మకుండయి * తరణమార్గ
మును గఱపె బుద్ధుఁ డవతార * పూరుషుండు.

భిన్నాత్మబుద్ధినాశనము పరశ్రేయోదాయకము. లోకమంత
యుఁ దానే యనుకొనుట యవతారమహాపురుషలక్షణము. ఇ
ట్టిలక్షణము బుద్ధునియందుఁ గాన్పించుచున్నది. కావున నతఁడు
కేవలదైవస్వరూపుఁ డగుమహాపురుషుఁడు.

పా—అయ్యయ్యో! నాస్తికమత మనుప్రతీతిగల బౌద్ధమతమును స్థా
పించినవాఁడు "మహాపురుషుఁడు" ను రామకృష్ణాదులవలె "అ
వతారపురుషుఁడును" అని చెప్పెద వేమి?

సూ—ప్రతీతిప్రమాణముఁ దప్పుగావున నడిగెదను—జనసామాన్యము దే
నిని శ్రీమహావిష్ణునవతారములలోఁ దొమ్మిదవదిగఁ బరిగణించు
చున్నది?

పా—రామ రామ! ఆబుద్ధుఁ డీబుద్ధుఁడేనా?

సూ—నీవు నీవును నేను నేను నయినట్లే! లోకము వ్యత్యస్తమై కన్నుఁ
దప్పినప్పు డస్మదాదులు దాని సవరింపఁజాలరు. మనలోపములు

నే దిద్దికొన లేనివారము ప్రపంచము నంతయు నెట్లు దిద్ద సమర్థ
లైదము? తత్తదవసరములయం దాదుర్గ్రాహ్యతత్త్వమే యొక
మహాపురుషరూపమున నవతరించి, పాడయినలోకమును దిరుగఁ
జక్కఁబఱచి నిర్యాణముఁ జెందును. "ధర్మసంస్థాపనార్థాయ
సంభవామియుగేయుగే" యనుగీతావాక్యము నెమ్మరునేకుఁ దె
చ్చికొనుము.

పా—అట్లే కానిండు. బుద్ధుఁడు దైవావతారమే యైనయెడల, వేదప్రా
మాణ్య మేల నిరసించెను? దైవాస్తికత నేల నిరాకరించెను?

పూ—నాకుఁ దోఁచినట్లు చెప్పెదను విను.

కర్మపాషండులై, ఛాందసులై, వేదరహస్యము సత్యముగఁ దెలి
[illegible]లక. విహితకర్మములని వృధావ్యాపారము లేకాక
హింసాకృత్యములఁ గోట్లకొలఁదిఁ జేయుచు, సవనశాలలనెత్తురు
వఱదలఁ దడుపుచు, మేదోమాంసమేదురములఁ • గావించుచు,
స్వర్గభోగాదిస్వసుఖాభిరతులై, నిర్దయహృదయులై, నీతిబాహ్యు
లై, దురహంకారభాజనులై, యసత్కార్యలంపటులై, యైకమ
త్యభంజకంబు లగుమతముల నెన్నెన్నియో కల్పించుకొని, యిం
టఁ బొట్టకొక్కప్రాయి పెట్టుకొని, మాంసనివేదనసురాపానాది
నికృష్టాచారంబులపాల్పడి, దేశక్షోభంబుగావించుచు, దేవునిపే
రు నాత్మపేరు పెట్టుకొని, వేదము నడ్డచేసికొని, జనులుపాడగు
చుండఁగా, శ్రీమద్భగవద్గీతావాక్యానుసారముగ, దయామయుఁ
డైన యాభగవంతుఁడు బుద్ధరూపమున నవతరించి—

గీ. రోగకీలక మెఱిఁగి యా • రోగ్యమిచ్చు
ఘనభిషఙ్మణిపోల్కి సం • ఘస్థమైన
బహుదురాచారములఁ గూల్చెఁ • బ్రజకుభూత
దయయుఁ దృష్టావిముక్తిబో • ధంబు సేసి

పా—బాగుగనే యున్నది. కాని యంతటిమహాత్ముఁడు పరమపావన
మైన వేదంబును, దత్ప్రతిపాద్యమైన పరమాత్మను నేలకొట్టిపా
ఆవేయ వలయును?

సూ—గీ ఐహికాముష్మికార్థంబు ♦ లందు నెక్క
ముఖ్యమైన రహస్యంబు ♦ పొడవడుఁ జుమి;
కార్యయోగ్యత, దోషసం ♦ క్రాంత సాధ
నములఁ గూడను జేయు యో ♦ గ్యముల పగిది.

అందుచేతనే బుద్ధుని వేదప్రామాణ్యగర్హణము గర్హ్యముగా
లేను. మధుమేహపీడితునకు మధురపదార్థపరిత్యాగ మవశ్యక
ర్తవ్యమైనట్లు వేదవిపరీతగ్రహణజన్యజడత్వబాధాక్రాంతులౌ
నాకాలపుఁబ్రజకు శ్రుతిప్రమాణ మగ్రాహ్యముగాఁ జేయవలసి
వచ్చెను.

పా.—అంతటితోఁ నాఁగకుండ, సర్వచరాచర సృష్టిమూలమైన భగవం
తుఁడే యూడిపోయెనే?

సూ—వేదమునకు వచ్చినచిక్కు వేదాధారునకుఁ గూడ నాకారణము
చేతనే రావలసి వచ్చెను. ఐనను బుద్ధాచార్యుఁడు కేవలనిరీశ్వ
రవాది కాఁడుసుమా! ఏదియో యొక్కదుర్జ్ఞేయమైన మూలశ
క్తి యున్న దనియు, నదియే ‚‚ధర్మకాయ’’మనియు, నిర్వాణప్రా
ప్తి యైన జీవుఁడు ధర్మకాయ మగుటయే యనియు, నిట్టివాక్య
ము లతనిబోధంబులం దచ్చటచ్చటఁ గన్పట్టుచున్నవి. సోద్దిష్ట
ప్రయోజననిరోధనకర మని, దానింగూర్చి నొక్కి చెప్పుటమాత్ర
ము లేదు.

పా.—అటయిన ‚‚దుఃఖ, క్షణిక, స్వలక్షణ, శూన్య’’ సంకులమైనబు
ద్ధమత మార్గమతావలంబులకు సమాదరణీయ మనియే మీ
యభిప్రాయమా?

సూ.—సీ. జన్మ మొక్కటి గాదు ♦ చాలజన్మము లంట,
ఏకమే కద యందు ♦ నిందుఁ గూడ
సంసార మన దుఃఖ ♦ జలరాశి యని యుందు,
ఏకమే కద యందు ♦ నిందుఁ గూడ
దృష్టపోకార్వ్య ము ♦ క్తికి సాధనం బంట,
ఏకమే కద యందు ♦ నిందుఁ గూడ
సత్ప్రవర్తనము ౹శే ♦ ష్ఠం బంచు బోధించు,
ఏకమే కద యందు ♦ నిందుఁ గూడ.

గీ. దుఃఖమోక్షంబె మోక్ష మం ♦ దురుగదా! యు
భయమతములందు; నెంచి యి ♦ వ్వానినెల్లఁ
దారతమ్యంబుఁ జెప్పు బు ♦ ద్ధమతసార
మునకు వేదాంతబోధన ♦ మునకు నీవె!

పా.—అదేమి పాపమో కాని మీమాటలు నాతల కెక్కకున్నవి. దైవసహితమగుమత మార్షమతము; దైవరహిత మగుమతము బుద్ధమతము. మీరెన్ని గుంటచిక్కులు పెట్టినను వీనికి రెంటికి సామరస్యము గనఁబడదు.

సూ.—ఇటువిను మిత్రమా! వేదమతము వారు దైవముగలఁ డందురు. బుద్ధమతమువారును వేఱుపేరు పెట్టిరిగాని యట్టితత్త్వమొండు గలదనియే చెప్పుచున్నారు. ఆతత్త్వమిట్టిదనిమాత్రము వీరును వారున్నుఁ గూడ విస్పష్టముగఁ జెప్పఁజాలరు. ముక్త్యనంతరము జీవులు ప్రత్యక్షానుభవమునఁ గాంచఁదగినది గాని, తత్స్వరూప మిదమిద్ధమని నిర్వచించుటకుఁ గాని బోధించుటకుఁగాని, యెవ్వరికి శక్యము గాదు. ఈరహస్య మెఱింగియే శ్రీబుద్ధాచార్యుఁడు దాని విషయమున మూకీభావమును వహించినాఁడు. దాని గూర్చి తల పగులఁగొట్టుకొనఁగూడ దనియుఁగూడఁ గొన్నిపట్లఁ జెప్పి నాఁడు.

పా—వేదాంతులుగూడ బ్రహ్మనిరూపణము చేయనే లేదా?

సూ—చేయనట్లే చేసినారు—"నేతి నేతి" వాక్యముల—అదియుఁగా కాతఁ డవాఙ్మానసగమ్యుఁ డని పెక్కుతావులఁ జెప్పఁబడి యున్నది. "యతో వాచో నివర్తంతే, అప్రాప్యమనసాసహ" మొదలగు శ్రుతిభాగములుగూడ నట్లే ఘోషించుచున్నవి. వేఱుగాఁ జెప్పిన నేట్లుపొసఁగును?

సీ. మేయ మగుమానసముచే న ♦ మేయు దేవుఁ
దెలిసికొనఁ జూచువాఁడు వెం ♦ గలియె సుమ్ము
కుంచమును దెచ్చియెంత య ♦ త్నించి యేని
గిద్దలోపల నెవఁ డిటె ♦ కింపఁగలఁడు?.

కం. జ్ఞానాదిసాధనంబుల
మానసమిం దగ్గపటసొ ♦ మానము చేయం
గానగు, నగును బ్రహ్మము
మానవుఁ; డింకేట్లు లద్ది ♦ మననునఁ జిక్కున్

ఈవాక్యములే కాకపోయిన, నేతదర్థబోధకము లగువాక్యములు బౌద్ధమతమునందునుఁ గాన్పించుచున్నవి.

పా—బావా! ఈశ్వరోపాసకులమానసికప్రార్థనములుగూడ ననుపయుక్తములేనా?

సూ—ఆ! బౌద్ధమతమునఁ నట్లే. జ్ఞానసాధనములుగ నంగీకరింపఁబడినవి గాని యార్షమతసిద్ధాంతదృష్టిచేఁగూడఁ బ్రతిమార్చనలువలె న వియు నల్పజ్ఞకృత్యములే.

పా—ఆర్యా! బౌద్ధులు సేశ్వరవాదులుగారు కాని లోకాయతికులవలె "ఋణంకృత్వా ఘృతంపిబే"త్తనియు "ఘృతంపీత్వాఘటం త్యజే" త్తనియుఁ జెప్పెడివారు గారుకదా! నీతి, భూతదయా,

వైరాగ్యప్రధాన మైనమతముగదా వారిది! అట్టిచో నాత్మదైవ ములు మఱికిక్కియో తత్సమానములో యైనప్పుడు, స్వసుఖప రాఙ్ముఖత్వమునకును, సత్ప్రవర్తనమునకును గత్యాధారము లెక్కడ?

సూ—భావా! బాగుగఁ గనిపట్టితివి. ఈకారణముచేతనే తొలుత నీ నాటకము విచిత్రమైన దని చెప్పితిని. ఆవైచిత్ర్య మిద్దియే సుమా! ఇట్టిగగన సాధ్యంబగుమతముతో బుద్ధదేవుఁడు సంఘమునెల్ల నెట్లు సన్మార్గములకుఁ ద్రిప్పినాఁడో చూడుము. ఈ యొక్కటియే యాతనిదైవత్వమును స్థాపింపఁగలదని నాయభిప్రాయము. ఆయన—

ఆ. గీ. అతులదివ్యతేజ, ♦ మమలచారిత్రం, బ
మేయభూతదయ, య ♦ మేయశాంతి,
పరజనోపకార ♦ వైరాగ్యసంపత్తి,
యును వహించి జనుల ♦ నుద్ధరించె.

ఆ. గీ. పరుసవేది సంటు ♦ కటియినుమంతయు
బసిఁడిముద్ద యైన ♦ పగిదిఁగానె
యెంతదుష్టచిత్తుఁ ♦ డేని బుద్ధునిఁ జేరి
యకలుషాంతరంగుఁ ♦ డయ్యెఁ గాదె!

దీనికిఁ బ్రాణములు మానుషాశియు నమితసురాపాయియు నగు „అలపకుఁడు„ ను దార్లుగొట్టి దోఁచికొనిబ్రదుకు „అంగుళి మాలుఁడు„ ను. ఇంకొక్కమాట విను పారిపార్శ్వకా! బౌద్ధమతావలంబకు లీప్రపంచమునం దిప్పుడు రమారమి మూఁడవ వం తున్నారఁట.

పా—ఆర్యా! యిప్పుడు మీమాటలు నాకు నచ్చినవి. నిశ్చయముగా నీనాటకము పవిత్రగ్రంథ మని నాకుఁ దోఁచుచున్నది.

శ్రీ

# బుద్ధబోధసుధ

## ప్రథమాంకము.

[ప్రదేశము. ఉరుబిల్వామహారణ్యము.]

(ప్రవేశము. బుద్ధుడు సన్న్యాసిరూపధరుఁడు. కౌండిన్యుఁడను శిష్యుఁడు.)

కౌం—దేవా! ఏమంటిరి?

బుద్ధు—కౌండిన్యా! చూచితివా? నాకు మాటలాడుశక్తితగ్గినది. నీకు వినుశక్తి తగ్గినది. మఱియొకమారుచెప్పెదను. వినుము. ఇఁక నవి యేవియు నక్కఱలేదు.

కౌం—ఏల?

బుద్ధు—నిరుపయోజనములగుటచే—

కౌం—ఆఱుసంవత్సరములనుండి తదేకదీక్షగాఁ జేయుచున్న నిష్ఠుర యోగాభ్యాసనిష్ఠానుష్ఠాన బంధములనిప్పుడుత్యజింపఁ దలఁచితిరా?

బుద్ధు—ఆఱుసంవత్సరములయనుబంధమేమి? అధికమా! పదునాఱుసంవత్సరముల భార్యానుబంధమును బరిత్యజింపఁ లేదా? ముప్పదియైదుసంవత్సరముల మాతాపితృదేవతానుబంధమును దెగ గోసికొనలేదా? అసంఖ్యాకసంవత్సరాగతవైభవసమగ్రతాను

బంధమును ద్రెంపుకొనలేదా? అన్నిటికంటె నధికమగు నాలుజా
మేల పుత్త్రిని బంధమును బాపుకొనలేదా? బంధవైరాగ్యాదా
ర్థ్యములతోఁ బనియేమున్నది?

కౌం—ఇట్టిసంగపరిత్యాగము యోగాభ్యాసము కొఱకేకాదా?

బుద్ధ—కాదు.

కౌం—సిద్ధార్థదేవా! మఱిదేనికొఱకు?

బుద్ధ—అసిద్ధార్థుడనైన నన్నట్లుపిలువకుము. అది చిత్తశాంతికొఱకు—
యోగాభ్యాసమువలన నదిలభింపనప్పుడు దానిని వ్యజయించుట
తప్పగునా?

గీ. మందుపనిసేయనప్పుడు ♦ మానఁదగదె?
చెవికిబెట్టిరానపుడుత్య ♦ జింపఁదగదె?
చట్టమువిరుద్ధమైనపుడు ♦ నెట్టఁదగదె?
బాటతప్పైనయప్పుడు ♦ వదలఁదగదె?

కౌం—ఏమిస్వామి! యోగాభ్యాసముకూడ ముక్తికి దుష్పథమనుచు
న్నారే?

బుద్ధ—అదియొకరీతి ముక్తికిసాధనమే యగును.

కౌం—అదెట్టిది?

బుద్ధ—దేహదార్ఢ్యముక్తికి, చిత్తసౌఖ్యముక్తికి, ప్రాణవాయుము కికి

సీ. కనుమూసి సీటము ♦ న్గఁగ ముక్తి యైనచో
మనకంటెఁ గొక్కెర ♦ ఘనతరంబు
నేలతొఱ్ఱలలోన ♦ నివసింపఁగా ముక్తి
యైన నెండ్రికచాల ♦ నధికమగును
తలక్రిందుగనుబ్రేలి ♦ తపియింపఁగాముక్తి
యైన గబ్బిలముమ ♦ హత్తరంబు
చిరకాలముపవాస ♦ సేవముక్తియయిన
నుత్తరధ్రువకిటి ♦ యురుతరంబు

పవనభు క్తిముక్తి యయినఁ ♦ బాముగొప్ప
శ్వాసమును బలాత్కృతిబిగ్గఁ ♦ బట్ట ముక్తి
యయిన యజ్ఞపశువుమేటి ♦ యాకుఁదినఁగ
ముక్తి యగునెడగొంగళి ♦ పురుగుమెఱుఁగు.

కౌం — దేవా! వేదశాస్త్రములు యోగాభ్యాసాదుల ప్రాశస్త్యమును గూర్చి సహస్రముఖముల ఘోషించుచుండ —

బుద్ధు — వేదశాస్త్రములు నేనుగూడ శ్రద్ధతోఁ జదివితినా?

కౌం — చదువకేమి?

బుద్ధు — పరమనిష్ఠురముగ నిధిధ్యాసధారణాదుల నభ్యసించి నిరాఘాట దీక్షాపాటవమున ననుష్ఠించుచుంటినా?

కౌం — అయ్యో సందేహమేమి?

బుద్ధు — నా వేదశాస్త్రజ్ఞానమునుగూర్చి నీకు సందేహము లేదు. నా యోగానుష్ఠాన నైష్ఠుర్యమును గూర్చి సందేహము లేదు. కాని యీ నాయభిప్రాయయాథార్థ్యమునుగూర్చి మాత్రమే సందేహమా!

కౌం — కాని యింకఁ గొంతకాలము దీనినే యనుష్ఠించునెడల —

బుద్ధు — ఇంక నెంతకాలము! ఒడలుమంటలెత్తి, చెవులఁ బెద్దహోరు పుట్టి, కనులు చీఁకటులు గ్రమ్మి, బ్రహ్మరంధ్రమునఁ బోటుపుట్టి యస్థిమాంసము లేకనై, నాల్కవెనుకకీడ్చుకొనిపోయి, హృదయకోశము దడదడలాడి, గుండెలు బరువెక్కి, యూపిరి స్తంభించి, కాళ్లు మెలికలుపడి, నాల్గుదినములక్రిందట నేకదా తలయు త్రెవ్రాల్చి నేలపైఁ జాఁపచుట్టగఁబడిపోయితిని! నేను మరణించితినని మీరు నిశ్చయపఱుచుకొంటిమని చెప్పితిరి కాదా? మరణించునెడల నాత్మహత్యను బుద్ధిపూర్వకముగఁ జేసియుందునే! మరణింపక యింక బ్రదికియుండుటచేత మఱల నీదుర్యోగాభ్యాసమే చేయుమనుచున్నావా?

గీ. చచ్చుటయె యోగఫలమైన ♦ జలమునందుమ
శ్వాసము గుదించి జనమును ♦ జరుపనేల?
చాఁపజాలిని మెడకు ము ♦ స్త్రాబుఁ జేసి
కొనుచు లోఁతుగాఁదనుఁద్రోచు ♦ కొనఁగరాదె?

గీ. పంచవహ్నులనడుమఁ దం ♦ పటినిదన్ను
వేసికొనిమెల్లకుములుచు ♦ వేఁగనేల?
తలగడగనెక్కుకొఱకచ్చుఁ ♦ దాపుకొనుచు
నెత్తిగిలిపెద్దనిద్దుర ♦ నొందరాదె?

గీ. గొంతుదనుకను బూడ్చించు ♦ కొనుచు మిడుక
నేల? యిలకుఁలోఁతునఁగలఁ ♦ వే? శిరంబు
సలువుకొనినపాపం బేమి? ♦ సంప్రపూర్ణ
సిద్ధికిఁకఁ గొంత దిగువవేఁ ♦ చేయరాదె?

కౌం—ఇట్టి కర్కశయోగాభ్యాసములు మీరొనర్చియు నిట్లువానిని నిరసింతురా?

బుద్ధు—గీ. తిననివానికి రుచియెట్లు ♦ తెల్లమగును?
దిగనివానికి లోఁతెట్లు ♦ తెలియఁగలదు?
కననివానికిరూపెట్లు ♦ గ్రాహ్యమగును?
పడనివానికి బాధయే ♦ పగిదిఁదెలియు?

గీ. చదువువానికిఁ గాకయే ♦ సరణిఁదెలియు?
కావ్యగత్భష్టగుణదోష ♦ గణము; మఱియుఁ
గర్తకేకాకపరునికే ♦ కరణిఁదెలియు?
కర్మసవ్యాపసవ్యతా ♦ మర్మకలన.

గీ. చెఱువునీటికి మఱుగ్గొయ్యె ♦ కరణిగాఁగఁ
గుక్షిపూర్ణత్వగరిమకుఁ ♦ గొంతువలెను
సంపదకుఁగృషిరీతిగ ♦ జ్ఞానమునకు
ననుభవమెముఖ్యసాధన ♦ మగునుగాదె!

కాం— ఈవేదవిహిత యోగానుష్ఠానములు మీరొక్కరే యాచరింప లేదు. చిరకాలమునుండి యనేకులు మహాదీక్షతోఁ జేసినారు. ఇప్పటికినిఁ నేకులు సేయుచున్నారు. వారందఱియనుభవ మొక రీతిగనుండ మీయనుభవమిట్లు విపరీతముగనుండనేల? వారంద ఱు దురభిప్రాయపడినవారై మీరొక్కరు మాత్రము యథా ర్థగ్రాహులైయుందురా?

బుద్ధ—చిరకాలనుండి చేయుచుంటచే విశేషమున్నదా?

గీ. ఊరుఁగాయలు ప్రాఁతవై ♦ యున్నఁగొన్ని
పథ్యవస్తువులగుఁ ద్రాక్ష ♦ పండ్లసార
మెంతముదిసినదుర్గుణ ♦ హీనమంత్రు;
పుచ్చుకొలఁది రేవల్చిన్ని ♦ పొలుపుఁగాంచు.

గీ. వయసు ముదిరిన మనుజుని ♦ పడియడంగు;
సర్పవిష వేగమునుగొంత ♦ శాంతినొందుఁ;
గాని తప్పెంతప్రాఁతది ♦ యైనఁగాని
తప్పుగనెయుండునింతైన ♦ నొప్పుగాదు.

అనేకులిట్లాచరించుచున్నారంటివి. అదియుఁగూడ సహజము కాదు.

గీ. తోఁచకొకమేఁక గుహలోన ♦ దూఱ దాని
తోఁకఁగైకొని గుహఁజేరు ♦ మేఁకలన్ని;
కాక మొక్కటెనీట ము ♦ న్గంగ దానిఁ
గాంచి వేనవేల్ స్నానదీ ♦ క్షలను నెఱపు.

గీ. ఖరమొకండు బూడిదెలోనఁ ♦ బొరలదాని
చెలువుభస్మరేఖాసము ♦ జ్జ్వలములగును;
గడుపుపీకుననక్క యొ ♦ క్కటియఱవఁగ
గ్రామమంతయు నోంకార ♦ ధ్వాన మగును.

గీ. యోచనము సేయు వాఁడొక్కఁ ♦ డాచరించు
వార నేకులు; పొరపాటు ♦ వాఁడు పడినఁ
గోటులకొలఁదిఁ గుజనుల ♦ గుదు; రొకనిప్ర
మాదమఖిల జీవనగతి ♦ భేదకంబు.

గీ. ఎంపఱో యజ్ఞమనుజుల ♦ నెవఁడొ యొకఁడు
విజ్ఞుఁ డుండుట యేమియు ♦ వింత కాదు;
తరణి తిరుగునని జనులం ♦ దఱు వచింప
నవని చలియించునని యొక్కఁ ♦ డనియెఁ గాదె?

గీ. గులకఱాళ్లెందు; వజ్రాలు ♦ కొలఁది; యబ్ధి
నాలుచిప్పలు కోట్లు ము ♦ త్యంపుఁ జిప్ప
లరుదు; జనులలోపల మూఢు ♦ లధికసంఖ్యఁ
జెలఁగియుందురు బుద్ధిమం ♦ తులు కొలంది.

కాం—హరి హరీ! ఎట్టిమాటలాడుచున్నారు! యోగాభ్యాసపరులం
దఱు వివేకహీనులేనా? అయ్యయ్యో! పతంజల్యాదివేదర్షులం
దఱు మూఢులేనా?

బుద్ధ—

గీ. జనుని మిత్రకోటిని బట్టి ♦ జనుని గుణము,
బాలుర నడతచే గురు ♦ ప్రవరు నీతి,
ప్రజలయనురాగమున రాజు ♦ పాలనగతి
వైదికుల బట్టి ఋషిబుద్ధి ♦ పరిగణింత్రు.

గీ. ఆగమజ్ఞుల కుమతంబు ♦ ననుసరించి
జనులు క్రూరులు భ్రష్టులు ♦ జడులు నైరి;
తప్పుదీపముఁ గని దారిఁ ♦ దప్పినావి
కులుసుడిఁ బడి ఱాలను బడి ♦ కూలునట్లు.

కాం—అయ్యా! బ్రహ్మముఖోద్ధితములగు వేదముల నేదూఱుచున్నారే?

బుద్ధ—సుఖమున్న బ్రహ్మ బుద్ధిలేని బ్రాహ్మణునికంటె ఘనుఁడని నీ యభిప్రాయమా?

కౌం—అయ్యా! నేఁబోయెదను. నాకిఁక సెలవిండు.

బుద్ధ—వెడలి నేల? ఇచ్చటనే యుండరాదా?

కౌం—నన్ను నిరోధింపకుఁడు. సెలవిండు.

బుద్ధ—మాతాపితలకు సెలవిచ్చితినా? భార్యాపుత్రులకు సెలవిచ్చితినా? రాజ్యమునకు సెలవిచ్చితినా? గార్హస్థ్యమునకు సెలవిచ్చితినా? యోగానుష్ఠానమునకు సెలవిచ్చితినా? వేదాధిక్యమునకు సెలవిచ్చితినా? బ్రాహ్మణాగ్రగణ్యత్వమునకు సెలవిచ్చితినా? బ్రహ్మాత్మతత్వమునకు సెలవిచ్చితినా? నీకుమాత్రము సెలవీయలేకుందునా? నేఁజెప్పునదేదో యింకఁగొంచెము వినుము.

కౌం—సర్వార్షమతనిరాకరణము సెలవిచ్చియే యున్నారు. ఇంకఁ జెప్పఁ దలఁచినదేమున్నది? ఆర్యమతావలంబకుల నందఱ నొకసారి గొంతుకలఁ గోసి చంపవలసియున్నదని యింక నుపన్యసింపఁ దలఁచితిరా?

బుద్ధ—అదిపూర్వమున వేదర్షులు చేసినపనియే. జనులట్లుచచ్చుట కొఱకే యుపవాసములు, యాగములు, ఆసనములు, ముద్రలు యోగములు—

కౌం—అదేపనిగ నట్టిపవిత్రాభ్యాసముల దూఱుట కేల? ఎందఱో యోగాభ్యాస మొనర్చి కృతార్థులైరి కాని, యింతకాల మొనర్చి బాధపడలేక పరిత్యజించి భ్రష్టత నొందినవారి నొక్క మిమ్మే చూడవలసి వచ్చెను.

బుద్ధ—మంచిమార్గమును నేను గనిపెట్టుట, దానిని నీవవలంబించుట కొలఁదికాలములో సిద్ధింపవచ్చునుగాన నే నీరీతి భ్రష్టత నొందితిని. నీవీరీతిచూడవలసివచ్చెను. నా భ్రష్టత యెట్టిదో కనిపెట్టితి

వా? చేయుచున్న పని తప్పని గ్రహించి దానిని వదలివేయుట
ఇది భ్రష్టతయో శిష్టతయో. ఇట్టి భ్రష్టుని నీవు నన్నొక్కనిసి
నే యేల చూడవలసివచ్చినదన—

గీ. లేమికధికమైపుణ్యంబు ♦ లేమినొక్క
చుఱుకుపాలు హెచ్చుగగల ♦ సుదతి సేరు
కొనుచు మార్గమునుగట్టు ♦ కొనినవాథు
గృహమునందునవనూతన ♦ గృహిణిచేరి.

గీ. మగనిఁగనిరోస రోసలాడ ♦ మగఁడుమురియు
మిగులఁ గోపింపఁ దలవాంచుఁ ♦ దిగనితిట్లు
తిట్టఁజమ్వును వినన్టు ♦ లట్టియొక్క
శేయుఁదలువుమూఁతకయి పీ ♦ డించుఁద్వారగ.

గీ. కానుకక్కుర్తిచేఁ జౌర్య ♦ కలనఁజేర్చి
జనులదూషణమున దిద్దు ♦ కొనకధైర్య
గరిమకు శరీరలఘిమకుఁ ♦ గన్నగాని
వృత్తివంటిదిలేదని ♦ యెన్ను జనుఁడు.

గీ. భావవేగమునకు నొక్క ♦ పాయుఁద్రావి
ధరను బడి కుక్క, చెవిని మూ ♦ త్రంబువిడువఁ
దనువెఱుఁగకెట్లొలేచి భ ♦ క్తవరుమూర్ఛ
యిద్దిదైవసాక్షాత్కార ♦ మిచ్చు' ననును.

గీ. జనుఁడు బుద్ధిపూర్వకముగఁ ♦ జలువుతప్పు
నొప్పుకొనఁడందులోనేదో ♦ యొప్పుఁజెప్పుఁ;
దనదుతప్పెంత గొప్పదై ♦ తనరునంత
పెద్దతలతిక్కలోఁబడి ♦ వెఱ్ఱినొందు.

గీ. ప్రహారమున కొక్కదుస్తును ♦ వదలువాఁడు
స్వర్ణపాత్రవీటి రసము ♦ వదలు వాఁడు

గొప్పవాఁడని యనిపించు ♦ కొనఁడుసుమ్ము
తప్పవదలెడు నాతఁడే ♦ గొప్పవాఁడు.

సీ. ఇష్టలగుపూవుబోండ్లఁగ్ర ♦ హించువాఁడు
మించురుచ్యవస్తువులఁగ్ర ♦ హించువాఁడు
గొప్పవాఁడని యనిపించు ♦ కొనఁగఁగనునె?
నొప్పుఁగ్రహియించు నాతఁడే ♦ గొప్పవాఁడు.

అట్లుగాక నేను నాతప్పొప్పు కొనుటచే నేనొక్కఁడనై యుంటిని.

కౌం—యోగాభ్యాసమింత కూడనిపనియై యుండునప్పుడు జనులకందఱకు యోగులయందీ గౌరవమేల? ఎవరిమాటయో యేల? మీయోగాభ్యాసపటిమఁగూర్చి లోకమం దిప్పటివఱకెంతకీర్తి యున్నది! మీరుమహాత్ములని మిమ్ముఁ జూచుటకెందఱు వచ్చిరిగారు! మీపాదములకెందఱు సాష్టాంగనమస్కృతులు చేయలేదు? లోకాతీతమగు కీర్తిని సంపాదించినమీరిట్లందురేల?

బుద్ధ—జనులవాడుకలు యథార్థములగునా?

గీ. అమితసుఖయుక్తుఁడనిరాజు ♦ ననరెమనుజు?
లతనికెటనైనసుఖలేశ ♦ మైనఁగలదె?
అందఱకుఁ బ్రభుఁడనిరాజు ♦ ననరెమనుజు?
లతనికంటెను జనభృత్యుఁ ♦ డన్యుఁడెవఁడు?

సీ. పరులసుఖఘనతలఁగూర్చి ♦ నరులువొందు
నూహములువారి యుపరివే ♦ షోజ్జ్వలతల
గలిగియుంటచేతను సరి ♦ కావు; వారి
మనసులను గన జనులకుఁ ♦ గనులులేవు.

గీ. చిన్నబొట్టున్న వాని వీ ♦ క్షింపరెవరు
పెద్దబొట్లున్న వాని భా ♦ వింత్రు జనులు;
పిలువఁగనె పల్కువానిని ♦ బెద్దసేయ
రెంతకయినఁ బల్కనివాని ♦ నెంత్రు జనులు.

గీ. తనువుఁగప్పినవానికి ♦ ఘనత లేదు;
గోచిపాతయుదెస మొల ♦ గొప్పయంద్రు;
నెత్తివెంట్రుకలున్న నో ♦ రెత్తరెవరు
నేలవెంట్రుకలున్న గ ♦ ణింతుజనులు.

గీ. ఇంటఁ గూర్చున్నవాని యో ♦ జింపరెవ్వ
రడవి మిడికెడు వాని నా ♦ హా యటంద్రు;
కాళ్లుతలక్రిందనుండుట ♦ ఘనతకాదు;
కాళ్లుతలపైన నుండుట ♦ గౌరవంబు.

గీ. చాఁపపైఁ బ్రక్కఘనతకు ♦ సంజ్ఞకాదు
శంకుపర్యంకమతిగౌర ♦ వాంక మగును
నిండుకడుపును జనులు గ ♦ ణింపకుండురు
మండుకడుపును భావింతురు ♦ మహితమనుచు.

గీ. ప్రకృతి గతి భిన్నమైన యే ♦ పనియు నైన
గొప్ప దానిగ జను లను ♦ కొనుచు నుండురు
జనుల హృదయంబు లీడ్చెడి ♦ శక్తి యొకటి
కష్టచయ మందు నిరతంబు ♦ కలుగుఁ గాదె?

గీ. అందు లోనఁ గష్టంబు స్వ ♦ యం ప్రదత్త
మైనయప్పుడు చెప్పెడిదేమి? ♦ అజ్ఞజనుల
కీ స్వతను కృంతకులు మహా ♦ మృతులుగాఁగఁ
బరమదైవంబులుగఁ గానఁ ♦ బడుదు రకట!

గీ. కాని పిడికెఁడుయవలకై ♦ గాత్రమంత
ముక్కలుగఁ గోసి కొనియెడు ♦ మొండియైన
పరమకష్ట నిష్ఠుర దుష్ట ♦ వరునికంటె
నీమహాత్మునిదయాధిక్య ♦ మెచటనయ్య!

గీ. పీఠపంచాగ్ని జపములఁ ♦ గాంచిరో
సర్పనాగ్నేయ సంస్తంభ ♦ నలకుసరిమొ?
పీరియనవరతస్నాన ♦ విభ్రమములు
ముక్తిములు దీయు జనునొక్క ♦ ముక్కుకీకె?

గీ. పలుగుపొమ్మరి పలిటీల ♦ పైనయోగి
వగులముద్రలు దిగగుడ్డు ♦ వైవఁదగదె?
మోటగడసాని కాళ్ల ద్రవే ♦ లాటముందు
బసుగుబావని తలక్రింది ♦ బెడఁగులెంత?

గీ. ప్రజలముష్టిని వర్ధిల్లు ♦ బంటవాఁడు;
ప్రజలమూఢత వర్ధిల్లు ♦ బరమయోగి;
జనుల చేమన్గులను బాడ ♦ సంతసించు;
జనుల చేమోడ్పులను యోగి ♦ సంతసించు.

గీ. కాని, వాఁడూర నుంటచే ♦ ఘనత లేదు;
కానునుండుట నీతని ♦ ఘనతయయ్యెఁ;
గడుపుఁబూడ్చుకొంటనతని ♦ ఘనత లేదు;
కడుపుమాడ్చుకొంటనితని ♦ ఘనతయయ్యె.

గీ. పరులకై శ్రమపడియెడు ♦ వాఁడుఘనుఁడు
తన కితరులకయి ఏడున ♦ తండు మధ్య
ముండుతనకయియెపడు న ♦ తండు నీచుఁ
డటులిటులుగాని శ్రమమొందు ♦ నతఁడెవండొ?

కౌం—ఇట్లుపయోగింప కుండిన నట్లయిన నుపయోగింపఁకుండునా?

బుద్ధ—అల్లెట్లు?

కౌం—పరమునకు—

బుద్ధ—తెలియనట్టి, తెలియఁదగనట్టియంశము నేలవచియింతువు? కాని నీవనినట్లే—మాటవరుసకు—పరమున్నదనుకొనినను బాపమునకుఁ బరమెప్పుడైన ఫలముగునా?

కౌం——అయ్యయ్యో! పరమయోగులు పాపాత్ములుకూడనా?

బుద్ధ——కారని యెట్లు చెప్పఁగలను?

గీ. పక్షిగ్రుడ్లను దినునట్టి ♦ వాఁడు పాపి
ప్రాణులను జంపితినువాఁడు ♦ పాపతరుఁడు
ప్రజలనే జంపి తినువాఁడు ♦ పాపతముఁడు
తనదుమాంసమె తినుయోగి ♦ తలఁపుమెవఁడో?

కౌం——నమస్కారము నాకింక సెలవిండు. (పోఁబోవును.)

బుద్ధ——పోయెదవా?

కౌం——యోగాభ్యాసమునఁ బరమపాపాత్ముఁడనగు నేను మీయెదుట నిలువనేల?

బుద్ధ——నేనుగూడ నిదివఱకట్టి వాఁడనే కదా! అట్టిపరమక్రూరపాపకృత్యమున మనకు గురుశిష్యసంబంధ మెటూహించునో, యిఁకముందు జరగఁబోవు మహాలోకోపకారక పుణ్యకృత్యమునఁ గూడ మనమిట్టిసంబంధమున నేయుండఁగూడదా?

కౌం——అయ్యా! సర్వసౌఖ్యసంపూర్ణమైన సంసారము నిట్టెపరిత్యజించినారు. సన్యాసులై సమంజసమగు యోగాభ్యాసమును గర్కశదీక్షచేఁ జలుపుచు దాని నిట్టె రెండుగడియలక్రిందఁ ద్యజించినారు. పండ్రెండు సంవత్సరములైన సంసారము చేసి విసిగితిరి. కొన్ని యాఱుసంవత్సరములైనఁ జూడకుండఁగనే యపవర్గసాధనమగు యోగాభ్యాసమును వదలినారు. ఇట్లుభయభ్రష్టత నొందినారు. ఇట్టి చలచిత్తుల నెవ్వరుచూచియుండరు. ఇంకేదో ముందుమార్గమనుచున్నారేమి! మీకింక ముందు మార్గమున్నట్లు నేననుకొనను. అందులకుఁ వేదశాస్త్రములంగీకరింపవు. ఇఁక మీకున్నది వెనుకదారియే! ఇంత చెడినతరువాత నింక ముప్పేమున్నది? ఇహసుఖమైన బూర్ణముగ ననుభవింపక మిడుక నేల? కపిల

వస్తుప్రకరమునకుఁ జయము చేసి మహానందమున సర్వసౌఖ్యము లను భవింపుడు.

బుద్ధు—(నవ్వుచు) ముందుదారియు వెనుకదారియుఁ గాక నడుమదారి యేదియునుండఁగూడదా? ఒకని కడుపును దినుటచేఁ గడుపునొప్పివచ్చినది. లంఘనము చేసిన శాంతించునని యాహారవర్జన మొనర్చినాఁడు. దానివలన గుణముకపోవుటయేకాక వేడిచేసిమఱికొన్నిబాధలు కలిగినవి. లంఘనమువలన నొప్పి శాంతింపలేదు. కానఁ దిరిగిపోయియుడుకులను మునుపటికంటె నెక్కువగఁ దినవలసినదని నీవాతనికి బోధింప సాహసింపఁ గలవా?

కౌం—సాహసింపలేను.

బుద్ధు—పోనీ! ఏమిబోధించుటకు సాహసింపఁగలవో యూహించి చెప్పుము.

కౌం—లంఘనమునుమాని లఘువగు నాహారము నేదో పుచ్చుకొనుమని చెప్పుదును.

బుద్ధు—అనఁగ—కఠినాహారమునవలన వ్యాధివృద్ధియగుననియు, నిరాహారతవలననుష్ణతావృద్ధియగుననియుఁ దెలిసినది కావున నేకద!

కౌం—ఆ.

బుద్ధు—ఆహారణవృత్తికి మొదటిదియగు నమితాశనము తుదిదగుననశనముకూడ వర్జింపవలసిన వేకదా!

కౌం—ఆ.

బుద్ధు—ఎందుచేత?

కౌం—దుఃఖహేతువులగుట చే—

బుద్ధు—సరే—వానినివర్జించి?

కౌం—మధ్యమార్గమునననుసరింపవలయును.

బుద్ధు—ఎందుచేత?

కౌం—సుఖహేతువగుటచేత—

బుదు—ప్రమాద శూన్యత్వముకల యీమధ్యమార్గముననే జనుడవలం
బించునేని గడుపునొప్పి కానియత్యుష్ణత కానికలిగియుండవుకదా!

కౌం—ఊహు ఉఁ.

బుద్ధ—అటులైనఁ జెప్పెదవినుము.

ఆ. వె. ప్రభువు తలకుమకుట ♦ వహనకష్టంబెంతొ
జడలభారమంత ♦ సంయమికిని
బలికి మిగులతిండి ♦ వలనవేదనయెంతొ
యనశనమునఁ యోగి ♦ కంతబాధ.

ఆ. వె. ధనపురాశిచేన ♦ తనిగుండెబరువెంతొ
తపముపోవుననియి ♦ తనికినంత
హంసతూలమృదుతి ♦ నతని కెంతశ్రమంబొ,
యిలనుఱాలప్రక్క ♦ నితనికంత.

ఆ. వె. ఆశ్రితాళి పీకు ♦ లాటయాతని కెంతొ
వీని కంతమోకపుఁ ♦ బీకులాట
పలువు రబల ళిచ్చు ♦ బాధయాతని కెంతొ
వీనికగ్నిమధ్య ♦ వేధయంత.

ఆ. వె. త్రాగు డెక్కుడగుటఁ ♦ దాపమాతని కెంతొ
యొడనపుడునిలువ ♦ నితనికంత
నోరుతెఱ్ఱవలని ♦ నొప్పియాతని కెంతొ
ముక్కుమూతనితని ♦ మువ్పానంత.

ఆ. వె. తగని స్వేచ్ఛవలని ♦ తెగులాతనికినెంతొ
స్వేచ్ఛలేనియేడు ♦ పితనికంత
కడుపుకాళ్లనంటు ♦ గాసియాతని కెంతొ
వెన్నునంటువెతయు ♦ వీనికంత.

ఆ. వె. సతతరోగబాధ ♦ సతనిదుర్గతియొంతొ
సతతయోగబాధ ♦ నితనికంత
చావుభీతిసతని ♦ సంభ్రమంబెంతయో
బ్రదుకుభీతినితని ♦ పాటునంత

ఆ. వె. సుకముమిగుల హెచ్చి ♦ ప్రకటకష్టంబగు
నదియెతగ్గి కష్ట ♦ మగును మఱల
జనునితనువు కాక ♦ ఘనమాచుమృతి నిచ్చు
నదియెతగ్గి చావు ♦ నందఁజేయు.

ఆ. వె. ఉభయ దిశల గష్ట ♦ ముందుసౌఖ్యమునకు
నదియెనడుమఁజేరి ♦ యగునుసుఖము
బాధసుఖమునొకటి ♦ వస్తునైజమునను
గతినిబట్టి భేధ ♦ కలనకలిగె.

ఆ. వె. ఇష్టసుఖములన్ని ♦ యెటులైనగ్రహియింప
వలయుననెడి మతము ♦ పనికిరాదు;
తడిసియొండిముక్కు ♦ ముడిచి మాడిపోదుమై
మడియుమనెడుమతము ♦ పెడమతంబు.

ఆ. వె. ఏతదుభయమతము ♦ లిరుప్రక్కగుఱ్ఱులై
తోఁపనడిమిదారిఁ ♦ ద్రొక్కవలయు
మెఱక తెలియు నీటి ♦ గుఱుత్తులనడుమను
బాయ తీసివెడలు ♦ పడవపగిది.

అట్టిమధ్యమార్గమేదో లోకోపకారార్థమై కనిపెట్టవలసియున్న
ది. కనిపెట్టుటయు దుస్సాధ్యము కాదనితోచుచున్నది. కానసీ

వుకూడనవృధాశ్రమమందక యోగముచు మాని యాలోచించు
చు నిటనుండరాదా?

కౌం.—తమమాధ్యమిక మార్గముభయభ్రష్టత నొందినవారి కెవరికై
న నక్కఱకు వచ్చునులెండు. నేఁ బోయెదను.

బుద్ధు—నాయనా! నీకింకయాథార్థ్యము పొడకట్టకున్నదని నాకు విచా
రముున్నదినుమా?

కౌం.—కేవల మసంబద్ధమగు నయథార్థము మనసునఁ బట్టుటకంటె య
థార్థముపొడకట్టకుండుట మిగుల విచారకరమగు నాపదగాదు
లెండు. మీగురుత్వమునకు, మీకు, నమస్కారము. (పోవును.)

బుద్ధు—యోగము వదలినట్లే శిష్యుఁడుకూడ వదలినాఁడా?

గీ. సిలుగులఁ జెలఁగియున్నట్టి ♦ చీనపథమె
మంచిదని దానివదలరు ♦ మనుజులెప్పు
దోషరహితంబునైననా ♦ ధుని క పథము
తప్పు తప్పు మూఁడవసారి ♦ తప్పునుమ్మ.

గీ. కనినకారణముగదోష ♦ మనివచింవ
మంచిదే! యట్లుకాకయో ♦ జించకుండ
దప్పనఁగనట్టి తప్పుగ్రొ ♦ త్తదగుబాట
తప్పు కాదు; మూఘులనోటి ♦ తప్పుకాని.

గీ. ప్రాతక్రొత్తయువస్తు వి ♦ భాగమగునె?
కాలగతిభేదకలుగయే ♦ కాని క్రొత్త
నైనయది ప్రాతకాకుండ ♦ నట్లెయున్నె?
ప్రాఁతయది క్రొత్తగాకెట్లు ♦ ప్రాఁతదయ్యె?

గీ. ప్రకృతిశాస్త్రజ్ఞులకుఁ గవి ♦ వరులకుమత
బోద్ధలకు వారితీల్లును ♦ బోల్లుతప్ప
వట్టివాని యజ్ఞానంబు ♦ నపహరింపఁ
బాటుపడుటలుతప్పవు ♦ ప్రాజ్ఞులకును.

అదిగో! సూర్యాస్తమయ సమయమైనది.

గీ. కొండచిలువ మేల్కని యొడ ♦ గ్గొలుకుకొనును;
గొంతుకను నక్కసవరించు ♦ కొనఁగసాగె
ఋషియు ఋషిపత్నిసెలయేటి ♦ కేగినారు
ముచ్చటకు గ్రుడ్లగూబదో ♦ బుచ్చియాడె.

ఏదైవవృక్షచ్ఛాయకుఁ బోయి యచ్చట రాతిరిగడపెదనుగాక!

(బుద్ధుడు నిష్క్రమించును.)

ఇది ప్రథమాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ

## ద్వితీయాంకము.

[ప్రదేశము—గయ—మఱ్ఱిచెట్టుక్రింద.]

(ప్రవేశము—బుద్ధుఁడు.)

బుద్ధ—ఆహా! ఆహా! ఎచ్చటనది లేనితావుకనబడదుగదా!

గీ. తల్లి దిను వింతలగు సూడి ♦ దలఁగఁగల్గు
పులుసు కారంబు చే గర్భ ♦ పోతు మెంత
తల్లడిల్లునో గద! యుష్ణ ♦ తాప్రతప్త
మగుచుఁ గొట్టుకొనుచు నేమి ♦ యగునొ! కట్టి!

గీ. వెలుపలికి వచ్చునపుడు నా ♦ భిద్ధ నాళ
మక్కు ననుజిక్కి యుక్కిరి ♦ బిక్కిరి యయి
చచ్చు నంతకు ముందుగాఁ ♦ జావకున్న
వెలిబడిన వెంటస్థితి భేద ♦ ములను జచ్చు.

గీ. చేటఁ బడినప్డు చాకున్న ♦ శిశువు మొదటి
కార్యమేడుపుఁ తరువాతి ♦ కార్యమేడ్పు

చప్పు వఱనుఁ జేసెను బ్రమేహ ♦ జకతి యేడ్పె
రొమ్ముతోఁ బుట్టి చచ్చెను ♦ నెమ్ముతోడ.

సీ. మందాగ్నిఁ బొందున ♦ మందార్తి నొక్కఁడు
తిమ్మిరిచే స్పర్శ ♦ తెలియఁ డొక్క-
డుబ్బు జబ్బునఁ జాలఁ ♦ దబ్బిబ్బగు నొకండు
పురుష గర్భంబునఁ ♦ బొక్కు నొకఁడు
పక్షవాతమున సాఁ ♦ బాలుచచ్చు నొకండు
చచ్చువాతమునఁ బా ♦ షాణమొకఁడు
కాసగాసిని గుల్లి ♦ కాండ్రించు నొక్కఁడు
పెడశూలచే నోండ్ర ♦ పెట్టు నొక్క-

గీ. ఉబ్బసంబునఁ గప్పలా ♦ గోదిగిపిండు
కొనుచు నెగయూపిరిని గెక్కు ♦ మనుచునడరు
బ్రక్కచేరులు బిగబట్టు ♦ బాధవలన
నఱచుఁ దిర్యఙ్ముఖత గడ్డి ♦ గఱచియొకఁడు.

సీ. పుత్త్రమాదను మొఱ్ఱో ♦ మొఱ్ఱోయను నొకండు;
చెవి గునపపుఁబోటుఁ ♦ జెందు నొకఁడు
కంటిమంటలకుఁ మి ♦ న్నంటి దోరు నొకండు
ముక్కురక్తపుఁగాల్వఁ ♦ బోగులు నొకఁడు
గొంతుపూడ్చుడు పొర ♦ కోఁత నేడ్చు నొకండు
రాచపుండున నొదల్ ♦ రగులు నొక్క-
డాంత్రనాళ స్రవ ♦ ణార్తి నొందు నొకండు
వింటిదొమ్మను మొగ్గ ♦ వేయు నొకఁడు.
బోదకాళ్లసంకెలలను ♦ బొరలు నొకఁడు
మూలరోగముతోఁ జెడ ♦ మూల్గు నొకఁడు.
నక్కమోరునఁ బడఁగూసి ♦ నవయు నొకఁడు
పృష్ఠమున బురుగులుపడఁ ♦ గూలు నొకఁడు

గీ. సతికి నివియన్ని యేకాక ♦ జననకోశ
మధికముగనుంట బుతుశూల ♦ యద్భుతంపు
మూర్ఛ ప్రసవార్తిసూతిక ♦ మొదలుగల్గు
వ్యాధులన్నియు నామెపా ♦ లయ్యె నకట!

గీ. ఆలితలపోటునకు దేవు ♦ లాఁడుమగఁడు
మగనిగోలొటారమునకుఁ ♦ మగువయేఁడ్చు
గొడుకుసన్నిపాతమునకుఁ ♦ గుందుతండ్రి
తండ్రి యంధతావస్థకుఁ ♦ దనయుఁడేఁడ్చు.

ఇంతయేకాక స్త్రీపురుషునకుఁ బురుషుఁడు స్త్రీకిచ్చువ్యాధుల మితములై వానిమహాఘోరఫలము జగత్తున దట్టముగ వ్యాపించి యున్నది. ఇఁదియుగాక —

గీ. 'కాలియుఁడుగునఁ బల్లెరు ♦ కాయపోటి
బ్రహ్మరంధ్రమునకునెక్కు ♦ బ్రక్కనల్లి
కాటులైతెక్కలాడించు ♦ గర్ణములను
దోమమేల్కొల్పులకుఁ జుక్క ♦ తోడసురట.

గీ. కొండ్రివేటునఁ దేల్పట్టె ♦ గుండెగరిస
లఁబడఁజేయును; బాము పై ♦ లవినిజాఱు
నొకవిషాల్పబింకువునోటి ♦ నుండి లుబ్బ
లుబ్బలుగఁ గడవెడు చొరంగ ♦ లుబ్బఁజేయు.

గీ. అటిసినణువైన హృదయాశ ♦ ల్యమగు; వెఱ్ఱి
కుక్కకఱచిన నరుఁడు నా ♦ ల్గు పదములను
పరుగులిడుఁ; గఱచును; మింటి ♦ వంకమోర
వెట్టియేఁడ్చు; నీరుకతన ♦ బిట్టుమొఱుగు.

ఇదికాక —

గీ. ఒక్కభూకంప మెన్నపు ♦ రోత్తమముల
గోటఁబెట్టుపిరాంగవు ♦ బ్రమోఁతి; యగ్ని
శైలకోలాహలము ప్రాణి ♦ జాలసంఘ
దహన సంస్కృతి కపరమం ♦ త్రములరువ్వ.

గీ. కొలఁది మాటికిఁబసవుఁడు ♦ కుక్కనకు నాసఁ
షెండిజనకోట్ల కుత్తుకల్ ♦ జెండికారి
పలలములను రాచ కసాయి ♦ పందలన్నఁ
బెట్టుసంతలు యుద్ధ పృ ♦ థ్వీస్థలములు.

ఇట్టియసంఖ్యాకములగు బాధలు జనులకు సామాన్యముగ సిద్ధించునవై యున్నవి. ఇఁక నొక్కొక్క జనునకు బాల్యయౌవన కౌమారవార్ధకములఁ గలుగు బాధ లెట్టివో కొంచెము యోచింతము. ముందు బాలునియవస్థ—

గీ. పాఠశాల కేగకగాది ♦ ప్రక్కడాఁగు;
సీడ్చుకొని పోవ లబలబ ♦ నేడ్వసాగుఁ
జదువుమనశిరోవ్యథ చేతఁ ♦ జాలమూల్గు;
కొట్టగురుఁడిట్లు త్రాటి యూ ♦ కునుగొణఁగు.

గీ. చదువుకొనకుండఁ దల్లికి ♦ సాయపడుచు
నింటసుఖమున్న చెల్లెలి ♦ వంటియాఁడు
పుట్టువునఁబుట్ట కిటు లేల ♦ పుట్టినాఁడఁ
జదువుఁబోలు మహాపద ♦ జగతి నేది?

గీ. నిశిని బడిలోన నెట్టులో ♦ నిప్పుపుట్టి
పుస్తకములతో బుగ్గియై ♦ పోవరాదె?
మాఁటినోదొమ్మనొగుడుఁకు ♦ మడఁగిపోవ
కేలయీ మొండి బ్రదుకని ♦ బాలుఁడేడ్చు.

గీ. ధనయుతుని బిడ్డ మెడరత్న ♦ దామముఁగని
తనకు లేదని సామాన్యు ♦ తనయుఁ డేడ్చు;
నితరుబుగ్గ గులాబికై ♦ యతఁడు పొగులుఁ
గటికి బీదబిడ్డఁ డుభయ ♦ గతుల కేడ్చు.

గీ. ఆటఁదనకంటె నొకఁడు పై ♦ యాడెననుచు.
మఱిగియాతని దిట్టఁడో ♦ మ్మాని, యటంచు;
విద్దె నొక్కఁడు దనకంటెఁ ♦ బెద్దయనుచుఁ
గుమిలి చెడఁగిట్టు 'పుస్తక ♦ క్రిమి' యటంచు

గీ. తనుఁగని యొకఁడు నవ్వలే ♦ దనుచు నేడ్చుఁ;
దనుగనుచు నితరుం డేడ్వ ♦ ననుచు నేడ్చుఁ;
దనుఁబొగులఁగఁ బరుఁడు నవ్వ ♦ ననుచు నేడ్చు;
నొకఁడు కొంచెమేడ్చెనని మ ♦ ఱొక్కఁ డేడ్చు.

గీ. ఒకఁడు మఱొకఁడని వేఱొక్కఁ ♦ డుడికి యేడ్చు;
నతిముదమున మఱొకఁ డేడ్చు ♦ నితరుఁ డేడ్వ
నొక్కఁ డేడ్చు; నేడ్వఁగ హేతు ♦ వొక్కటైనఁ
గానఁబడరాదని మఱి యొ ♦ కండు నేడ్చు.

ఇఁక యౌవనావస్థనున్న వాఁ డెట్టి కష్టములందునో యించుక యోచింతము.

గీ. ఉవిదప్రక్కలోనికి రాక ♦ యుండునపుడు
సతతకాంతాభిలాష చే ♦ సంభ్రమించుఁ;
గడల ద్రొక్కక దుస్సహ ♦ కష్టమొందు?
విడివడుచుఁ గడునిడుములఁ ♦ గుడిచియేడ్చు.

గీ. క్రొత్తపెండ్లికొమరితతోఁ ♦ గులికి కులికి
మురులుతలముక్కలుగఁ దాప ♦ భరము నొందు
నింద్రధనువు చిత్తమునుండి ♦ యెగిరిపోయి
విసుగు బట్టబయల్గాఁగ ♦ వెతఁదపించు.

గీ. ధనికి నెవనికో మగలంజె ♦ తనమునంతఁ
దనుఁబఱచుకొని యతని సం ♦ తసము కొఱకు
నెన్నొ మాయవేసము లేర్చి ♦ యీగ్గిలఁబడి
యాత్మమాంస విక్రయఫలం ♦ బాత్రిగుడుచు.

గీ. ధనిమఱొకమగ గుడిసెప్రవే ♦ టునుగని నగఁ
దనదు మానాలసనతికై ♦ తాఁదపించు
వింత సాపత్న్య కలహంబు ♦ వృద్ధియగును
జనులు వీరి శ్రోపులసంద ♦ డిని నశింత్రు.

గీ. అట్టినెత్తిపాగాల యి ♦ ల్లాండ్రసదుమఁ
బీఁకులాటలఁ బడలేక ♦ విభుఁడు నేడ్చు
నందఱును మేళముగఁ గూర్చ ♦ నతని యేఁపు
పందఱును గజ్జెఁగట్టఁగ ♦ నందఱేడ్పు.

గీ. కుంజరము బలాత్కృతి చేత ♦ గోలఁబడును;
పక్షి మోసపెట్టఁబడుచు ♦ వలనుబడును
గానికలము బందమెఱఁగి ♦ కట్టుకొనెడు
వాఁడొక జనుండు తక్క నే ♦ ప్రాణిలేదు.

గీ. కానియొకని సొమ్ము హరించి ♦ కాళ్లకినుప
సంకెలలఁ దగిల్చికొను త ♦ స్కరుని కంటె
ఘానిగౌరవమేమి? యు ♦ భయులితరధ
నహరులును సిగ్గుఁడులు నుప ♦ గ్రహులు కారె?

గీ. ఇనుప బంగారు సంకెళ్ల ♦ నేమిభేద
మగును? దినునది దెబ్బయై ♦ యట్టుమాడ్చు
నపుడు కొరడకట్టియబోడి ♦ యైననేమి?
యందమగుకుందనపుఁబొన్ను ♦ యైననేమి?

కాని—

గీ. కారఁగలదొంగ నిర్భీతి ♦ నోరుదెఱచి
యిష్టగతిఁబల్కఁగాఁగల ♦ డితఁడొనోరు
గట్టుకొనవలయుఁ; గనులు ♦ గుట్టుకొనవ
లయును; లిద్దెకొట్టు కొనవ ♦ లయును జెవుల.

గీ. స్వేచ్ఛకై బొండమూరి కృ ♦ శించు, సుఖముఁ
గోరిదుఃఖమొందుఁ మహాధి ♦ కారమూన
పడుచుఁ జచ్చుబొనిస క్రింద ♦ బొనిసయగుఁ
బేరుఁగోరితిట్టులు లెంప ♦ పెట్టులొందు.

గీ. తలఁచిన సుఖంబు దొరుకమి ♦ తల్లడిల్లి
కొనకుదాని గల్పిద్దెనో ♦ 'కులటముద్దు
నో నెమకి కానలేక మొ ♦ త్తోయటంచుఁ
బడసఱచి గొంతుగుండెయుఁ ♦ బగిలిచచ్చు.

ఇఁక గౌమారావస్థవఱకు నిలిచియున్న జనుఁడు సామాన్యము
గ నేవిపత్తుల నొందునో చూతము.

గీ. కంటమందేకు; మందాగ్ని ♦ కడుపునందు;
నింటబిడ్డలగీరుగా ♦ రింటిబైట
వడ్డికై కోఁత; కాళ్లదు ♦ ర్భరవుభవభ
రంపునంకెళ్లమోఁత; లోఁ ♦ బ్రాణకోఁత.

గీ. సంతులేదని యొకఁడేడ్చుఁ; ♦ చాలుబిడ్డ
లంచునొకఁడేడ్చుఁ; బిల్లల ♦ వ్యాధులకయి
యొక్కఁడేడ్చు; శుంఠతకేడ్చు ♦ నొకఁడుదుష్ట
తకు నొకండేడ్చుఁ; గడుపుకోఁ ♦ తకొకఁడేడ్చు.

గీ. సతికెపుడు రోగమని గండ్ర ♦ సంతపించు
నెపుడు రోగపడదటంచు ♦ నేడ్చుబక్క

సతిమడిసెనని సంసారి ♦ వెతను జెందుఁ
జారవదని పెఱుగుల్లిప్రా ♦ జరితపించు.

గీ. పడతిమైనవృదిమ్మయాం ♦ చెడెను నొకఁడు
కందిరీఁగ యను చోకఁడు ♦ కుందుఁ జెందు
వంటకుండ తాఁచిప్పయుం ♦ చెడెను నొకఁడు
సీతకోకచిల్కని వెతఁ ♦ జెందు నొకఁడు.

గీ. వనిత తన్నొప్పు కనిపెట్టు ♦ కొనుచునుండు
ననుచు నొకఁ డేడ్చు నెడమొగి ♦ మును పెడమొగ
మంచ మొక్కఁ డేడ్చును విధి ♦ యఱుఁగుమీఁద
నామె, యింటఁ దానని యొకఁ ♦ డార్తిఁ జెందు.

గీ. ఒడలి బలముడిగిన వెన్కఁ ♦ గడుపు నించు
కొనుట యెట్లని యొకఁ డేడ్చుఁ ♦ గొడుకులు తన
ముల్లె సొనుల బంగారు ♦ గుల్లలకును
వల్లెలకు నిత్తురని వంతఁ ♦ బడు నొకండు

గీ. ధనము లేదని యొకఁ డేడ్చు ♦ తినఁగ లేక
యొక్కఁ డేడ్చు; దాచఁగ లేక ♦ యొక్కఁ డేడ్చు
నీయ లేక యొక్కం డేడ్చు ♦ నింతకంటె
నొకని కెక్కువ గలదని ♦ యొక్కఁ డేడ్చు:

గీ. ధనము తగినంత లేదని ♦ త్యాగి యేడ్చుఁ
బెట్టువానిఁ గాంచి పిసిడి ♦ తిట్టి యేడ్చుఁ
గృపణుఁ గని యర్థి యేడ్చి దు ♦ మ్మెత్తి తిట్టి
నర్థి యర్థ్యంతరుని గాంచి ♦ యార్తిఁ జెందు.

గీ. కొలఁది మెతుకుల కెంగిలా ♦ కులకుఁ జుట్టు
గుక్కలు చెడ మొఱిగి పీకు ♦ కొనుచుఁ గఱచు

కొనునుగాని రాజోచ్ఛిష్ట ♦ మునకుజనులు
ప్రాణములఁ దీసికొందురే ♦ మనఁగవలయు.

గీ. ధనముగలతండ్రిచావలే ♦ దనుచు బడుచు
తనయుఁడు కృశించుఁ బెట్టని ♦ తనయుఁడేల
యనుచు జనకుఁడు శపియించు ♦ ధనపుబాళ్లి
తెగక భ్రాతలు కుత్తుకల్ ♦ దెగుదురకట!

గీ. ధనముపాతఱవేసియు ♦ దానిమీఁద
వనశనముగ నొక్కఁడుపడి ♦ వసటజెందు
సఖునిగదిమూసిసుఖియింప ♦ శక్తి లేక
ద్వారమునఁ గాపుపడియుండు ♦ వేఱొకండు.

గీ. కడుపుకక్కుర్తి గలుగని ♦ కష్టజాల
మభినయమొనర్చి బిడము ♦ హార్తి నేర్చు
సుఖియనెడుకీర్తికై యెన్ని ♦ సొగసులెన్ని
వగనగవులేద్వలేకసం ♦ పన్నుఁడడరు.

గీ. పంటిపోటున కొకఁడేడ్చు ♦ పరునిగతికి
కంటిపోటునకొకఁడేడ్చు ♦ కంతుతుంట
వింటిపోటునకొకఁడేడ్చు ♦ వ్యర్థమైన
పగ జెముడుముంటిపోటున ♦ పొగులునొకఁడు.

గీ. అప్రసపటిమతగ్గినదని ♦ యేడురునొక్క
డాసపీడ హెచ్చగుటనూఁ ♦ గాఁడునొకఁడు.
చోరవపురి పీడెనని గాసిఁ ♦ బోరియునొకఁడు
శంకముప్పిరిగ గిజగి ♦ జబడునొకఁడు.

గీ. చెడితిరిగియుండవాతము ♦ గడనఁజేసి
తుజుఁడొసగినముల్లైయిదని ♦ కుందునొకఁడొ.

తప్పుదారులధనమంత ♦ దగులఁబెట్టి
జన్మశనికోసెఁగొంతని ♦ సాఁగు నొకఁడు.

గీ. పెదవిపైఁగొమ్ముకొఱుకనో ♦ ర్మిజపలేని
కోరలమ్మితనదుపుత్త్రుఁ ♦ గొఱికెనని యు
డరు నొకఁడు; మూత్రియుపదాయి ♦ దొఱుగఁగాని.
వానిచేవినరని బెంగ ♦ పడు నొకండు.

గీ. ఒకఁడుబుద్ధిలేదని యేడ్చు ♦ నొరులుధీర
హితుఁగదన్నెంతురనిమఱి ♦ యింత యేడ్చు;
నొరులుధీమంతులనిమఱి ♦ మఱియు నేడ్చు;
నేడ్చునని యొరులెంతురం ♦ చెప్పుడు నేడ్చు.

గీ. తనయిడుములకేడ్చు నొకఁ; డి ♦ తరులకిడుము
లొనరలేదని చెడనేడ్చు ♦ నొరులకష్ట
ములకునవ్వలేకమతేడ్చు ♦ ముందుగష్ట
చయమువచ్చునేమోయని ♦ చాలనేడ్చు.

ఇఁక వార్ధకావస్థనున్న జనులకష్టము లెట్టివో చూతము.

గీ. బలముడిగిపరాధీనుఁడై ♦ వనరు నొకఁడు;
చేయియెత్తుపుత్త్రులుచావఁ ♦ జెడు నొకండు;
పొట్టకూటికేకఱవుగాఁ ♦ బొక్కు నొకఁడు;
కొడుకులాదరింపరటంచు ♦ మిడుకు నొకఁడు.

గీ. ఆవులింత రాకానిక ♦ న్నారనిద్ర
కలుగదని యేడ్చు నొక్కఁడు ♦ కడుపులోనఁ
ద్రాటియాకుమంటయెకాని ♦ నోటికేది
పోదటంచు నొక్కఁడు నెత్తి ♦ మోదుకొనును.

గీ. కనఁదలఁపె కానికనులు లే ♦ వనుచు నేడ్చు;
వినఁదలఁపె కానిచెవులు లే ♦ వనుచు నేడ్చు;

నమలమతికానిపంక్తుసు ♦ న్న యనియేడ్చు;
లేపమతికానికాళ్ళులు ♦ లేక యేడ్చు.

గీ. కుళ్లుదగ్గునఁగాండ్రించి ♦ కుందు నొక్కఁ
డించుకక ఫమూరఁ జెడగొం ♦ డ్రించు నొకఁడు;
పాడిదయినకాసచేఱంకె ♦ లిడుచు నొక్కఁ
డష్టపడుక క్లైఁగ్రిందుమీఁ ♦ దగు నొకండు.

గీ. కుంపటికినిలోంగనిచలిఁ ♦ గుందు నొకఁడు;
మందునకునుదీఱనిరుజ ♦ మఱుఁగు నొక్కఁ;
డోరిమికినాఁగనినగను ♦ దోరు నొక్కఁ
డేడ్చినసుదీఱన్నిమహార్తి ♦ నేడ్చు నొకఁడు.

గీ. చావురాదని పైకేడ్చుఁ ♦ జత్తువనుచు
లోనుడుకుఁ జత్తువనిఁ యెవఁ ♦ డైన ననిన
నిల్లెగిరిపోవఁగానేడ్చు ♦ నేడ్వ నేల
యనిననీవు చావుమనియెం ♦ తయిన నేడ్చు.

గీ. నాకు నేదియు వలదని ♦ పైకిఁబలికి
నన్నియును లోనఁ గోవలె ♦ ననుచు నేడ్చు
నెదియుఁబోయిన నాకేమి ♦ కొదువయనుచుఁ
బొడుముకాయ బిరడవ్రావ ♦ మొత్తుకొనును.

గీ. తనదువడుచుదాయాదులం ♦ దఱుగతింప
వారిదంతయుఁ దనుజేర ♦ వలయునను చు
నుబ్బునపుఁ బిల్లికూతల ♦ నోక్కుమనుచు
మూలమూల్గులమరిడమ్మ ♦ మ్రొక్కులిడును

గీ. అందఱును దన్నుఁదిట్టుదు ♦ రనుచు నెంచి
యందఱను దాను జెడదిట్టి ♦ యూరిబడును

బట్టతలగోకుపాత్రుని ♦ గొట్టకఱ్ఱ
వెదుకబోయి కుంపటిఁ జేయి ♦ వెట్టియేడ్చు

గీ. చీమలును దోమలిఁగలు ♦ చేరియొడలు
పీకగా బాపుకొనలేక ♦ వెతనుగుమచు
మత్సరక్రోధలోభముల్ ♦ మనసునెపుడు
కొఱుకగా శాంతిపడలేక ♦ మఱిమఱేడ్చు

గీ. తనువునను నెత్తురుపొగరు ♦ తగ్గియున్న
శ్లేష్మపుఁ బొగరుచేఁ గాకఁ ♦ జెందిమఱుఁగు
నరములకు బింకమగుపట్టు ♦ దొరగియున్న
బెంకి మొండిపట్టునబిఱ్ఱ ♦ బిగిసిపొగులు.

గీ. ఎడమప్రక్క సమ్మెటదెబ్బ ♦ వడియఁ జంగఁ
గొలిమితిత్తులఁ బున్నబు ♦ స్సులకుఁబొగులు
నుదరమునవత్తికునుకుచు ♦ నున్న బసఁయు
మంటచేఁ బ్రబిమిదంతయు ♦ మండ నేడ్చు.

గీ. నెత్తిపైనాకురాల్ కారు ♦ నేత్రములను
శ్రావణముభాద్రపదమును ♦ రసనయందు
మండువేసవి; కొసలహే ♦ మంతమాశ
యందునవసంతమైయార్తి ♦ నందునెపుడు.

గీ. దగ్గు తెమలకయొక్కఁడు ♦ త్రొగఁగఁబొర
పడియొకడుకోఫమునఁ గేక ♦ లిడఁగనరము
బెగియొకఁడుపదిదినములు ♦ దిగువప్రక్క
కండచీమలుపీఁకను ♦ కఁడుచచ్చు.

గీ. వృత్తతతితంత్రడియంచేడ్చు ♦ ముసలిమేన
యత్తయూరుఁగాయలుమైల ♦ యయ్యెననుచు

నేఁశ్చతారత్రిపాదియం ♦ చేడ్చుబావః
తత్పతనమీశనవియేష్చు ♦ దాపువాఁడు.

గీ. బాటగంగాధరుఁడుమైల ♦ పడితిననుచుఁ
బ్రాహ్మణునెచావనేలని ♦ పొరుగువారు
ద్వారగముగిసినమన్నమైన ♦ బ్రదుకుదుమని
యందఱునుగుందుఁజెందుదు ♦ రచటనకట!

గీ. ఆర్ద్రవాసస్సులద్వాయ ♦ ప్రాశనములు
మృత్తికాస్నానదీక్షలు ♦ మృతకములును
దర్పణములును బిండప్ర ♦ దానములును
మాసికము లాబ్దికములంచు ♦ మఱియుమఱియు.

గీ. బ్రాహ్మణస్వార్థపరచక్ర ♦ వర్తి రచిత
మంత్రతంత్రరూపకఁబహు ♦ మార్గగోహి
రణ్యాతతిసమాకర్షణ ♦ ప్రస్ఫుటేంద్ర
జాలమునఁ బడికర్తవి ♦ చారమొందు.

సీ. పుడిసెడునీళ్లతోఁ ♦ బిడికెడుతిలలతో
బోడిదొన్నెనుదర్భ ♦ పుడకతోడ
ముళ్లుపెట్టినసూలు ♦ పోఁచతోముకుపొడి
చిటికంతగోమయ ♦ ఘుటికతోడ
బూడిదపండ్లంత ♦ మూడుముద్దలతోడ
లోడలోడ మనునోటి ♦ బుడగతోడ
నెట్టివానిని ముక్తి ♦ కెగరవైచెదుద్విజుల్
గురుతరాఖిలదేశ ♦ గురులుగాఁగ
భరతవర్షదుర్గతియెంతో! ♦ ప్రాణికోటి
పాపమెంతో! బానిసక్రింద ♦ బానిసయగు
పాడుభగవంతు దౌర్భాగ్య ♦ భారమెంతో!
చెప్పననేమి? తలఁపను ♦ జేతఁగాదు.

గీ. అర్భకశిరోదయంబగు ♦ నప్పుడునుమంత్ర
సానికంటె మేషవృషభ ♦ శాస్త్రిముందు
స్త్రీలమూర్ఛకు నైద్యాని ♦ సిపబిండ
కంటెమాంత్రికుఁ గౌరవమె ♦ కావెముందు.

గీ. బుట్టిగేయించవలసి న ♦ ప్పుడును గీత
కత్తికంటెఁ బాచాంగపుఁ ♦ గట్టెముందు;
పెండ్లిలోఁ బన్గులును బూల ♦ చెండ్లకంటెఁ
గుండలగ్నులు కుశలు మూ ♦ కల్లుముందు.

గీ. పతికిఁ బ్రథమగర్భాధాన ♦ సమయమందు
వరునికంటెఁ బురోహిత ♦ వరుఁడుముందు;
విందులన్నిటిలోఁ బెద్ద ♦ పీటలందు
వియ్యమునకంటె ముక్తుల ♦ పెయ్యముందు.

ఆహా! ఇదేమి? అవస్థాచతుష్టయమునందు కష్టముల నాలో చించుచు నిట్టె బ్రాహ్మణాధికమాహాత్మ్యమును గూర్చి యాలోచించు చుంటిని. కడుపులో భూకంపమువలె నున్నది. లోపలియఁలజడియే కాని పైకేది రాకున్నది.

గీ. నోరుచిన్నతలఁపు లొక్క ♦ సారియన్ని
పైకిరానెంచు నైనఁబైఁ ♦ బడదొకటియుఁ;
బొట్టలావునుమెడసన్న ♦ ముగలకుప్పె
కుదిపిబోర్లింపలోమందు ♦ ఘుటికలట్లు.

ఇప్పుడెక్కడ నుంటిని? ఎక్కడఁజూచినదుఃఖమే! ఎక్కడఁజూచినదుఃఖమే! ఈమహాదుఃఖము లూరకే యనుభవించుచు నుండవలసినదేనా? వీనినుండియెన్నఁటికైన విముక్తికలదా? బ్రదుకంతయుఁగష్టమైనప్పుడు బ్రదుకనేల? బ్రదుకనేల యని యాత్మహత్యచేసికొనవలయునా? ముందుజన్మమే యుండునిడల నాత్మహ

త్యవలని ప్రయోజనమేమి? కావునసీజన్మముననే దుఃఖశాంతి యవశ్యకర్తవ్యము. దుఃఖమునంభవించునపుడెల్ల నేదో విధముగఁ దాత్కాలికశాంతి చేయవలసినదా? కాదు.

గీ. బాధమూలహేతువుగని ♦ వైద్యమటను
జేయనడఁగుఁ; బై శాంతుల ♦ మాయదెప్పు;
డొడలిపైబయల్వెడలెడు ♦ పొడలుగంధ
కమునఁబోవునె? పోవును ♦ గంధివలన.

ఇన్ని దుఃఖములకుఁ గారణము లేమై యుండవచ్చునో?

గీ. గంజిబిచ్చమెత్తుచుఁ ద్రావి ♦ గట్టుమనుచుఁ
ద్రేఁచివరమ దరిద్రుఁడు ♦ తృప్తిఁగనక
పట్టెడగునజ్జరొట్టెకై ♦ పలవరించి
యున్నగంజియసహ్యమై ♦ యుమ్మలించు.

గీ. సజ్జరొట్టెను దినునట్టి ♦ జనుఁడు యవల
రొట్టెఁదినుమహాభోగి మో ♦ మట్టెచూచి
కనులనీర్నించి యెంతదు ♦ ర్గతియొ యంచు
నాఁకలి యసూయచే మండి ♦ యడలు చెందు.

గీ. మంచిరొట్టెను గలవాఁడు ♦ మట్టియూడ
లవలెఁజక్కనౌపాల్ద్రావు ♦ టవలిజన్మ
మందెయనిలోని కన్నీళ్ల ♦ నంటనువ్వ
నైనరొట్టెమ్రింగుడు వడ ♦ కార్తిఁబడును.

గీ. రమ్యగోక్షీరపానవి ♦ భ్రాజితుండు
రజితపాత్రలేనివగ నీ ♦ రసతఁ జెందు
వెండియేడుపుదీఱిన ♦ వెట్టియతఁడు
బంగరేడ్పున్నకై గొంతు ♦ బొంగుదోలఁచు.

గీ. బంగరునఁ బ్రాపుసంపన్న ♦ వరుఁడు కడుపు
బరువునను బాలగిన్నను ♦ బాఱద్రోఁచు;
లేనియతఁడుండి యేష్పును ♦ లేదటంచు
నున్నయతఁడు లేకేష్పును ♦ నున్నదంచు.

గీ. మానిసికినున్న దేదైన ♦ లేనిదగును
లేనిదే యుండఁదగినది ♦ లేనిదాని
కేష్వదగినది యుండి లే ♦ కేష్వ లేక
లేక యేడుపె బ్రదుకగు ♦ లోకమందు.

గీ. మొద్దువటువ్రక్క సతిలేక ♦ మొత్తుకొనఁగ
మూఁడువందల యొకటవ ♦ ముదితకొఱకు
నుర్విపతి వేగు నెంతయు ♦ నున్నసరిమొ
లైని యేడుపు తప్పదె ♦ వ్వానికైన.

గీ. భవ్యపట్టాభిశ్రీపాండిత్య ♦ పటిమఁదనరు
కుండలికిఁగైత లేకున్న ♦ గొంతుదెగెనె?
యందుకై తప్పుచిటిచాఁప ♦ యల్లనేల?
పృష్ఠములనుండిజనులీడ్చి ♦ వేయనేల?

గీ. శ్రాద్ధభోజికిగానంబు ♦ రాకయున్నఁ
బుట్టిమునిఁగిపోయెనే? వీణఁ ♦ బట్టియట్టి
గారిమఃకిగారిమజెమటి ♦ గారియనుచు
గానమునుబింఁషదానముఁ ♦ గలువనేల?

గీ. వటువుజదువు నెమరవేయ ♦ వదలిపెట్టి
సతిఁదలఁచిలొట్టవేయును ♦ జదువువల్లె
నొకటిరెండెప్పు డౌనని ♦ యుమ్మలించుఁ
గట్టిత్రాటిమంగళసూత్ర ♦ గరిమఁజూచు.

గీ. పెండిలగు వెన్క-సుఖయించి ♦ యుండరాదె?
సతికడుపుకాయదోహద ♦ సమితికొఱకు
నెఱకతట్టలమఱివంబ ♦ బఱుకుటలను
బొమగుగడ్డాలఁ బుట్టలఁ ♦ దడుమనేల?

గీ. కొడుకునెఁగొకని నోర్యాసి ♦ కొనఁగరాదె?
మనుమలెత్తెడు వెతనోప ♦ మాలశుంఠ
పుట్టగోచికి జార్చైపఁట ♦ ముల్లువెట్టి
పాలకోడెతోఁ గార్వెయ్య ♦ బందెఁబెట్టు.

ఇఁక వారిద్దఱయవస్థ

గీ. పెలఁదితన్మొద్దుగొనఁగ నెం ♦ గిలికినమ్మ
కోపపడునని గావంచ ♦ కొసనుదుడుచు;
గండపత్రంబులకుమసి ♦ దెండటన్న
గ్రంథపత్రాలమసిదెచ్చి ♦ కాంతకిచ్చు.

గీ. తాతగారితపోమహ ♦ త్త్వఫలమునను
మానలమ్మకోకను నూనె ♦ గుడ్డవాని
చేతిచలవను యనరాని ♦ రీతినెట్లొ
కుక్క-గొడుగులు మొలుచును ♦ గొంపలోన

గీ. భవముభ్రష్టత బంధంబు ♦ పరిభవంబు
బహురుజలబాధభాగార్థ ♦ భండనంబు
భర్తృహీనకాంతలబారు ♦ బారుటులివ్వు
క్రమముగా గ్రమ్ముకొను బొమ్మ ♦ జెముడుకరఁశి.

ఆత్మసుఖము కొఱకైన తృష్ణయేయిందులకు ముఖ్యకారణము గాఁ గనఁబడుచున్నది.

గీ. ఉర్విపతికత్తిఁదృష్ణ ♦ యుద్యోగికనుప
పుల్లఁదృష్ణ; వైశ్యునిత్రాసు ♦ ముంటఁదృష్ణ;

కాంతయొడిఁదృష్ణ; మేడిలోఁ ♦ కకొనఁదృష్ణ;
బ్రాహ్మణుని రోమరోమ కూ ♦ పములఁదృష్ణ.

గీ. ధనమొ రాష్ట్రమొ కీర్తియొ ♦ తరుణిమణియొ
యేదొ పైఁబడదని యొప్పు ♦ ఱేద్వావలయు;
వస్తువెద్దానికో బ్రదుకు ♦ వాఁడెకాని
బ్రదుకుకొఱకునె బ్రదికెడు ♦ వాఁడు లేఁడు.

గీ. వేదములఁదృష్ణ; వేదాంగ ♦ వితతిఁదృష్ణ;
యింటఁదృష్ణ; వాకిటఁదృష్ణ ♦ యిలనుదృష్ణ;
వారిధినిదృష్ణ; గాలి లో ♦ పలనుదృష్ణ;
యెటుగనినఁదృష్ణ; మఱితృష్ణ ♦ యేకతృష్ణ.

ఇట్టితృష్ణయే సర్వవేదనాపరంపరలకు మూలహేతువై యున్నది. ఇట్టితృష్ణను శాంతిపఱిచినేఁ జాలునా? నిర్మూలనము సేయవలయునా? శాంతిపఱిచినకొలఁదిఁ దృష్ణవృద్ధియగును గాదా?

గీ. ఇచ్చుకొలఁది భిక్షుకునేష్ప ♦ హెచ్చిపోవు;
మెత్తబఱచుకొలఁది మొండి ♦ నెత్తికెక్కు;
నోటనాన్చుకొలఁది మంట ♦ మేటియగును;
గుగ్గిలపుజిడ్డు కడిఁగిన ♦ కొలఁదిసాగు.

గీ. ముడుచుకొనుకొలందిని జలి ♦ పొడవుఁగాంచు;
విసరుకొలఁదిని గ్రీష్మము ♦ కసిమసంగు;
నుడుకునీళ్లుపూయు కొలఁదిఁ ♦ జిడుమువిరియు;
గోఱుకుకొలఁదిని వెండ్రుకల్ ♦ గఱుసుదేరు.

గీ. ఒత్తుకొలఁదిఁ గాళులతీపు ♦ లురువుఁగాంచుఁ;
ద్రాగుకొలఁదిని జ్వరభవ ♦ తాపమెదుగుఁ;
గడలు ద్రొక్కుఁ కొలఁదిఁగప్ప ♦ గంతులెగయు
నడఁచిన కొలందిమిటమిట ♦ లాడుతృష్ణ.

కావునఁదృష్ణను మొదలంటఁ బెఱుకవలసినట్లే నిశ్చయపఱుప బలసి యున్నది. తృష్ణను నిర్మూలన మొనర్చిన నిఁక నేమి? సర్వదుఃఖములట్టె మాయమైపోవా?

గీ. రసఘుటికదాడిమీక్రిమి ♦ రాజియడఁగు;
దూడతామరపలుతీతఁ ♦ దొలఁగిపోవు;
రక్తపరిశుద్ధిఁజర్మరు ♦ క్ప్రతతిమాయుఁ;
గారిజపుబాగుచేఁబోవుఁ ♦ గామిలార్తి.

గీ. మెదడు పదిలముగఁ జేయఁ ♦ గుమరుపిచ్చి;
నరములు గుదియింప గమన బం ♦ ధమునశించు;
నష్టుతడకకు నెగుపాప ♦ నడఁగుహిక్క;
గాని తృష్ణశో సర్వరో ♦ గములుదీఱు.

సర్వరోగములుదీఱుననుటకూడ నిశ్చయము. తృష్ణశోదనే దేహవ్యాధులు నూటిలోఁ దొంబదితొమ్మిదివంతులకుఁ గలుగుచున్నవి.

గీ. ఆలఁ జెక్కునాతనికిఁ ద ♦ ఱచుగతియ;
కుట్టుపనియాతనికి గూను, ♦ గ్రుడ్డితనము
ముచ్చిపనియాతనికిఁ బాండు ♦ పూర్ణతయును
లోహకారకునకు రక్త ♦ మేహరుజయు.

గీ. ఉచ్చకంఠగాయకునకు ♦ నుబ్బసంబు
కుంజరప్రమావటీనికి ♦ గుండెదడయు
నాశ్వికాహవభటునకు ♦ నరిశెరుజయుఁ
బడఁబెఱుగు కోమటికి నధో ♦ భారగరిమ.

గీ. కల్లుఁద్రాగెడువానికిఁ ♦ గాజ్జెపురుజ
యతిమితతాంబూలికధికము ♦ దాగ్నిజబ్బు
స్తంభనాపేక్షులకునపుం ♦ సకత్వ బలువుఁ
త్రాగువానికి గోఁరంత ♦ దగ్గమిగుల.

గీ. ఉర్వీపతిసన్నిధినినిల్చి ♦ యుగ్రమైన
నిష్ఠురీతినివిడువఁగ ♦ స్వేచ్ఛ లేక
యతనియాసతి లేక యే ♦ యవలికరుగ
వలనుగలుగక జాముల ♦ కొలఁదినల్లె.

గీ. క్రిందిమాపులమూత్రపు ♦ రీషబంధ
ములను జేయుచు దప్పినాఁ ♦ కలినిదగిన
యవసరములఁ దీర్పనిసేవ ♦ కాళ్లకీళ్ల
నెల్లరోగంబులును సంభ ♦ వించునిజము.

గీ. అజ్ఞములటంచు మనచేత ♦ ననఁగఁబడెడు
పశువులకుఁ గీటకములకుఁ ♦ బక్షులకును
నరులతృష్ణయు లేదు; బం ♦ ధంబు లేదు
ప్రబలరోగాళిచే నింత ♦ బాధ లేదు.

గీ. అఖిలరోగార్తులైనయీ ♦ యయ్యవారు
లనిలశూన్యతమోవృత ♦ స్వాలయముల
దిగఁబెఱుగుతోలుబొమలతో ♦ దేవులాడి
యంధపంగు మూకాదులై ♦ యవతరింత్రు.

గీ. ప్రాణిబాధలు తగ్గింపఁ ♦ బ్రతినరునికి
నేకకర్తవ్యమైయుండె ♦ నిట్టివార
లట్లుసేయరుసరికదా ♦ యార్తినొందు
ప్రాణితతిసంఖ్యనే వృద్ధి ♦ పఱుతురయ్యొ!

గీ. ఇట్టిపాపులు సతిమెడఁ ♦ గట్టుత్రాడు
దమమెడనుఁ గట్టికొనియాల్గ ♦ ధరణిమేలు
త్రాటమెడబిగియించుకోఁ ♦ ద్రాసమైన
మొలను గలత్రాడు ద్రెంపిపో ♦ వలయువనికి.

కావున నిర్మూలిత తృష్ణులగునరులు నిర్మూలిత సర్వార్తులగుదు రు. కాని తృష్ణను నిర్మూలింప నరునితరమగునా? కాకేమి? ఆఁ! వాసనావాసితముగ వచ్చుచున్న తృష్ణను—మహాబలిష్ట మగుతృష్ణను—జన్మసహజమగు తృష్ణను—సర్వవ్యాప్తమగు తృష్ణను నిరాకరించుటసులభమా? సులభముకాదు. కష్టమే! నిశ్చయముగఁ గష్టమే! తగినసాధనముచే నిర్మూలింపవచ్చును. అతికష్టమున—మహాకష్టమున—ఆఁ! ఏమంతకష్టము? తృష్ణ వలనఁ గల్గుగు నతిఘోరములగు కష్టములను -వర్ణనాతీతము లగు కష్టములను—తలచుటకునైన నలవికానికష్టములను సహింపదగనికష్టములను—జనులనుభవించి యుండలేదా? ఆక ష్టములకంటె నీకష్టముఘనమా? కాదు; కాదు—కాదు.

గీ. పైత్యజార్తినిగడుచేదు ♦ ఏనరునోటి
ముక్కలను గ్రక్కి యుక్కిరి ♦ బిక్కిరియగు
జ్వరయుతుఁడు నేలవేముకి ♦ పాయమున వ
సంతమాలిని మ్రింగఁగఁ ♦ జాలడొక్కొ

గీ. కాలిబొట్టన వ్రేల్క్రిందఁ ♦ గల్గువ్రణంబు
వలననొడలెల్ల మంటలు ♦ బ్రహ్మరంధ్ర
భాగమున గునపపుఁ బోట్లు ♦ పడునరునికి
నంగుళిని గోసికొనుబాధ ♦ యధికతరమె?

గీ. జోడుసింహాలపైఁ దోకఁ ♦ యూడుసింహా
మెక్కిబొబ్బరింపగ నిత్య ♦ మృతికినెదుట
నడలునుద్యోగిగ్రామసిం ♦ హములతోడ
నూరమెదుకులు మెసవిచా ♦ కుండలేఁడె?

బుద్ధిపూర్వకముగ జనులు బడుచున్న మహాభీలాతికష్టములలో దృష్ణాచ్ఛేదన కష్టము పదునాలుగవభాగమైన నుండదని నాన

మ్మకము. అలవాటుచేసినచో సిద్ధింపనిదేదియునుండదు. కాని, తృష్ణను వేఱంటఁ బెఱుకఁగల సాధనములేవో యిప్పుడు తెలియవలసియున్నది. సరే ఆలోచింతము. (కన్నులు మూసికొని)

గీ. మనసులోపలి రసమొక్క ♦ మాఱుదశది
శలనుజల్లునవిరిసియో ♦ జగతినంత
వెల్లిగొని సర్వజీవులఁ ♦ జల్లగాఁగఁ
దడుపుచున్నట్లులున్నది ♦ య్యోడనునాకు.

(కనులుదెఱచిలేచి) ఓహో! ఓహో! ఓహో!

సీ. ముక్తి కొట్టఁగల ప్రజ ♦ ముల్లెపెట్టెలనొక్క
చెవిడీయు బ్రాహ్మణ ♦ ప్రవరులార!
కుండలకల్లును ♦ ముండలచొల్లును
గలిపిపీల్చెడు ధరా ♦ కాంతులార!
చోళులందునఁ బ్రజ నోళులందునమట్టిఁ
గలిపికొట్టెడు వైశ్య ♦ తిలకులార!
ముంజేతితోఁకతో ♦ ముందుదోఁకలరెండు
గలిపితొక్కెడు శూద్ర ♦ గణములార!
మీరునాసోదరులునేను ♦ మీదుబాధ
లజ్ఞతలను దీర్చుకొఱకె ♦ యవతరించి
నాఁడెఁ గన్నుల దెఱువు ♦ నాదునుడుల
వినుడి బుద్ధిదెచ్చుకొనుడి ♦ వేడ్కమనుడి.

సీ. నడునెత్తితోకతో ♦ ముడుగుకాళ్లకులంకె
చేసెడుచీనదే ♦ శీయులార!
స్థిరవాసరంబుతో ♦ గురువాసరములంకె
చేయనిబ్రహ్మదే ♦ శీయులార!

వక్కాకురక్కి కొ ♦ బ్బరికల్లుఁ గ్రోఁ బుక్కి
లించిమ్రింగెదుసైంహ ♦ ళేయులార!
గడ్డాలపీచును ♦ గాడలచెవిక్కుట్టుఁ
జిక్కన్కున్న యవనద్దే ♦ శీయులార!
మీరు నాసోదరులు నేను ♦ మీదుబాధ
లజ్జతలను దీర్చుకొఱకె ♦ యవతరించి
నాఁడు గన్నులఁ దెఱువుడీ ♦ నాదునుడుల
వినుఁడి బుద్ధి తెచ్చుకొనుడి ♦ వేడ్కమనుడి.

ఇదుగో సింహఘోషమునఁ జెప్పుచున్నాను.

భవము సర్వదుఃఖపూర్ణము. ఇదిప్రథమసత్యము.

అట్టిదుఃఖములకుఁ దృష్ణయే మూలకారణము. ఇదిద్వితీయ సత్యము.

తృష్ణానిర్మూలనమువలన దుఃఖనిర్మూలనమగును. ఇదితృతీయసత్యము.

సమ్యగ్దృష్టి, సమ్యక్సంకల్పము. సమ్యగ్వాక్కు సమ్యక్కర్మము. సమ్యగ్జీవనము, సమ్యగ్వ్యాయామము, సమ్యక్స్మృతి, సమ్యక్సమాధి. యనునీ యష్టాంగ శీలముచేఁ దృష్ణనిర్మూలనమగును. ఇది చతుర్థసత్యము.

నాల్గుసత్యముల నుద్ఘోషించునామతము నాలుగుదిక్కుల వ్యాపించవలయును. ఇదిగో! ఈచేతికఱ్ఱయే జెండాకఱ్ఱ. ఈనెత్తికాషాయయే జెండాగుడ్డ (అటుచేసి) జగదనురాగమతధ్వజమునిదిగో లోకోద్ధరణార్థమై యెత్తుచున్నాను. జయ! జయ! ఇదిగో! బుద్ధుడింక స్వమతబోధనార్థమై భవదుఃఖవిజయధ్వజముతోఁ బయలుదేరుచున్నాఁడు. ఆకసమునఁదిరుగుపక్షులారా! అడవినుండు జంతువులారా! సముద్రమునందుండుసర్వజీవులారా! భూమధ్యభా

గముచనుండు ప్రాణులారా! మిమ్ములనుమఱచితినను కొంటిరా
లేదు లేదు! బుద్ధుఁడీతనువును మఱచిన మిమ్ము మఱచును. ఆ
హింసయే పరమార్థధర్మమనియు వస్తుస్వభావమున బుద్ధునికి బు
ద్ధునికాలిక్రింద చీమకు భేదములేదనియు సర్వప్రాణిదుఃఖనివార
ణమేశీలమనియు బోధించుటకే యీనాల్క. ఓవృక్షమా! యిం
త సేపటినుండియుఛాయయేకాక యిప్పటికి బుద్ధతకూడనిచ్చినపు
ణ్యస్వరూపమవు. సెలవొసగుము. నేనిప్పుడే కాసికిబోయెదను.

సీ. నగముచక్కినకుంభ ♦ సంభవుల్నగముకా
లెడుశివాలకు మ్రొక్క ♦ లిడగగంగ
గుళ్లలోఁ బెగుగోడ్ల ♦ గోండ్రింపులకుపేర్థి
సిడియాడునరు నేడ్వ ♦ శ్రుతినిమీట
పడిక్రింది హోమాగ్ని ♦ తంత్రంబునకుఁబైని
మదనాగ్ని తంత్రంబు ♦ మాఱుపలుకఁ
బసుమాంసభక్షణ ♦ వ్రతమున భంగపా
నముడుంటియారాధ ♦ నమ్మగాఁగ
నిఱుకు సందుల మొఱకుల ♦ చెఱనుబడెడు
స్త్రీలమదనశయ్యలు మూఁత ♦ రాలు, పిదప
మరణశయ్యలు నాక్రింది ♦ ముఱికికుండ్లు.
గాఁగ ఘోరవృజినరాశి ♦ కాశి చెలఁగు.

ప్రథమబోధన క్రియా దీక్షనటనే చేయవలయును. • నన్నువద
లిన కౌండిన్యుని వానితోడి సహపాఠకులగు నల్వురిని మొదట
నచ్చటనే శ్రీ బుద్ధమతావలంబకులఁ జేసెదను.

(నిష్క్రమించును.)

ఇది ద్వితీయాంకము.

శ్రీ

# బుద్ధబోధసుధ

## తృతీయాంకము.

(ప్రదేశము—వారణాసీపురము.)

[ప్రవేశము—బుద్ధుఁడు, ఆనందుఁడు.]

ఆనం—బుద్ధాచార్యుని కటాక్షముచేఁ గౌండిన్యుఁడు మొదలగు నలుగురు బ్రాహ్మణులు శీఘ్రి బుద్ధమతావలంబకులై కృతార్థతనుఁ బొందిరి.

బుద్ధు—ఆనందా! ఏతన్మతావలంబకున కొకని కటాక్షముతోఁ బనిలేదు. ఒకనికటాక్షముచేఁ గృతార్థత గల్గునని బోధించు మతమిది కానేకాదు. ఎవనికివాఁడే సహాయుఁడు. ఎవనికృతార్థత వానిసాధనబలములోనే యున్నది. సాధనమార్గములఁ దెలిసినంతమాత్రమునే వినియోగములేదు.

ఆ. వె. ఎడమకాలితన్ను ♦ కుడిచేయి ముందూఁపు
నెడమచేయి యూఁపు ♦ కుడినిదన్ను
టంచుఁ దెలిసి యీఁత ♦ కై యేటనొకమాఱు
పడినవాఁడు దరిని ♦ బడయగలఁడె?

గీ. ఉవిద యలవాటుచే రుచు ♦ లుట్టిపడఁగ
వండుఁ బాకశాస్త్రజ్ఞాన ♦ పండితుండు
ప్రాయ్యిదరిజేరి ।వేళ్లను ♦ బూసనెక్క
బొగ్గొనర్చి యింటిపదిని ♦ బాగులఁ జేయు.

కాఁబట్టి యష్టాంగశీలమునే యసాధారణదీక్షతో ననుష్ఠింపవల
యును.

ఆనం—దానినే యీదినమున బోధింతుమని నిన్నసాయంకాలమున నా
నతి నొసంగితిరి.

(నేపథ్యమున) నిన్నసాయంకాల మటులంటినిగాని దానిమొగ
ము తిరిగిచూడ నాకసహ్యముగనున్నది.

బుద్ధు—(మందహాసమ్ముచేయుచున్నాఁడు.)

ఆనం—యశోఁడను నొకతుంటరి; తండ్రిభాగ్యమంతయు నవాచ్య దు
ర్వ్యాపారమునఁ దగులఁబెట్టి తనతోడిపలుగాకి వందలతో వే
శ్యావీధినుండి యింటికిఁ బోవుచున్నాఁడు.

బుద్ధు—ఆనందా! ఎఱుఁగుదును. వానినిట్లుపిలువుము.

ఆనం—తుచ్ఛుఁడు; త్రాగుపోతు; ఏమైనఁ ద్రేలునేమో?

బుద్ధు—(మందహాసముచేయుచు)

గీ. వంకవెదురు నూటికె యగ్ని, ♦ ప్రజ్వలించు.
కొంపకేనీరు, దుర్గంధ ♦ ఘోరమైన
చోటికే యొండ, మూర్ఛావ ♦ శునకెగాలి,
సాధుపథదూరునకుఁగాదె? ♦ బోధనంబు.

ఆతనిని నీవిటకుఁబిలువుము.

ఆనం—అయ్యా! అయ్యా!

(నేపథ్యమున) ఎవరువారు?

ఆనం—నే నానందుఁడను. ఇటురండు.

(నేపథ్యమున) మాకంటె నానందస్వరూపుఁడు మఱియెవఁడు

(యశుఁడు ప్రవేశించును.)

ఆనం—అయ్యా! ఇటుగూరుచుండుఁడు.

యశు—(అట్లుచేయును.)

(నేపథ్యమున) మేమందఱమక్కడకురామా?

ఆనం—వలదు. మాటలువినఁబడు నంతదూరమునబారుగఁ గూచుండుఁడు.

బుద్ధు—ఆనందస్వరూపుఁడా! ఒకగడియసేపునీతో మాటలాడుటకుఁ కనుజ్ఞయిచ్చెదవా?

యశు—ఇంటియొద్దనిప్పుడు కోళ్లపందెములున్నవి.

బుద్ధు—నీయింటికి నీవేయధికారివిగాఁబోలునేమి?

యశు—ఔను.

బుద్ధు—నీయిష్టమువచ్చినట్లు గృహకృత్యముల నీవాచరించుట కభ్యంతరమేమైనఁ గలదా?

యశు—లేదు.

బుద్ధు—అటుచేసిన నిన్నాక్షేపించువారెవరు?

యశు—ఎవ్వరులేరు.

బుద్ధు—అట్లయిన నుదయమున నియమించినకోళ్లపందెములు సాయకాలమునకు మార్చుటకు సర్వస్వతంత్రుఁడవు నీవేకావా?

యశు—అట్టిస్వాతంత్ర్యము నాకున్న మాటనిశ్చయమే.

బుద్ధు—అట్టి స్వాతంత్ర్యమున్నప్పుడును, మార్చునెడల నధిక్షేపణము లేనప్పుడును మార్చగూడదా?

యశు—మార్చవచ్చును; గాని—

బుద్ధు—నీయిష్టమునకు నీవే ప్రభుఁడవైనప్పుడు "కాని" "చేసితి?", నీ "కాని" కర్థమేమో చెప్పఁ లవ

యశు—(ఊరకుండును.)

బుద్ధు—పోనీ! ఈయుదయమునఁ గోళ్లపందెము వేయింతునని నీ వెవరితోడను వాగ్దానముచేయునట్టు లెవరియధిక్షేపణము లేనట్లు నీవు చెప్పినమాటలవలన నేర్పడుచున్నదికాదా?

యశు—అట్టివాగ్దానమును జేసియుండలేదు.

బుద్ధు—సంతోషమే. నాయనా! ఒకనికొఱకు నీవుపందెమును వేయించనక్కఱలేదుకద! నీకొఱకు మానినమానకలవుకద! ఇఁక నేమి!

యశు—పందెమును జూచుకుతూహలము లోనఁదొందరపెట్టుచున్నది.

బుద్ధు—బాగుగనున్నది. చూడు మగఁడు ధర్మముచేయునుత్సాహపడుచుండును. భార్య వలదు పడదని నివారించును మగఁడాలిమాట విని ధర్మబాహ్యుఁడై యుండునెడల నట్టివానిని నీవేమందువు?

యశు—వనితచేతి బొమ్మయందును.

బుద్ధు—నాయనా? బుద్ధిమంతుఁడవు. యథార్థవాక్యమాడితివి. చూడు పందెమును మానుట కస్వతంత్రతయుఁ బరాక్షేపణమును లేని నీవుచూచుకుతూహలమువలని సంభ్రమమునఁ బందెమునుమానకుండిన నిన్ను నే నేమనఁదగును?

యశు—(తలవంచుకొనును.)

బుద్ధు—తొందరలేదు. ఆలోచించి చెప్పవచ్చును.

యశు—నేనస్వాతంత్రుఁడను.

బుద్ధు—స్వతంత్రుఁడనని చెప్పియుంటివి కాదా! అదినిజమా? ఇదినిజమా?

యశు—ఇదియేనిజము.

బుద్ధు—అటులైనవాడు వనితచేతిబొమ్మయగును. నీవు వాంఛచేతిబొమ్మయగుదువు. అంతేనా?

యశు—అలాగే.

బుద్ధ—వాఁడు నింద్యుఁడు. నీవు—

యశు—నింద్యుఁడనే.—

బుద్ధ—నాయనా! అదెట్లు? నీకంటెనానందస్వరూపుఁడు మఱెవఁడని పలికి యిప్పుడు నింద్యుఁడ నను చుంటివేమి?

యశు—మిమ్ములను జూడఁగనే నామనస్సు తలక్రిందగుచున్నట్లున్నది.

బుద్ధ—తొందరవలదు. చూఁడు. పందెమును జూచుకుతూహలమున్న దంటివి కదా—

యశు—అదియిప్పుడు చాలభాగము తగ్గినదయ్యా!

బుద్ధ—మంచిదే. తగ్గకయుండినప్పుడది నీమనస్సునకు బాధగనుండెనా? నిర్బాధగనుండెనా?

యశు—నేను నిర్ణయింపలేకున్నాను.

బుద్ధ—వాకిటిలోనికి వచ్చిన డప్పులతోడియమ్మవారిఘటమును జూచుటకు బాలుఁడు వీథిలోనికిఁ బరుగెత్తుటకు సామాన్యముగ నుత్సాహపడునా?

యశు—తప్పకుండ—

బుద్ధ—వీథితలుపు వేసియుండు నెడల బిడ్డఁడు సామాన్యముగ నేమి సేయును?

యశు—తలుపుఁనొద్దకుఁ బరువెత్తి యచ్చట నేడ్చుచుండును.

బుద్ధ—ఏడ్పు ప్రాయికముగ బాధచేఁ గలుగునా? నిర్బాధస్థితివలనఁ గలుగునా?

యశు—బాధచేతనే—

బుద్ధ—బాలునకిప్పుడు బాధయేమికలిగెను?

యశు—తలుపు వేసియుండుట తనకు బాధకాదా?

బుద్ధు—తలుపు వేసియుండుటయే తనకు బాధ యైనప్పుడు రాత్రులె
ల్లను బిడ్డఁడేడ్చుచునే యుండునా?
యశు—అమ్మవారియుత్సవమును జూడవలయుననుకోరికకు బద్ధకవాటి
ముపరోధముగ నుంటచేత—
బుద్ధు—అనఁగ—సామాన్యముగఁ జెప్పుము.
యశు—తలఁచినకోరిక తీరకపోవుటచేత—
బుద్ధు—న్యాయనా! మంచివాఁడవు. చూడు. తాగినపిమ్మట దప్పియ
ప్పటికిఁయుండునా?
యశు—ఉండదు.
బుద్ధు—భుజించిన పిమ్మట క్షుత్తో?
యశు—ఉండదు.
బుద్ధు—అటులే తీరినతరువాత గోరికయో?
యశు—ఉండదు.
బుద్ధు—సరే! బాగుగనేయున్నది. కోరికతీరకపోవుట
చెప్పితివి. జ్ఞప్తియున్నదా!
యశు—ఉన్నది.
బుద్ధు—కోరిక యనుటతోడనే తీరనిదని యర్థమిచ్చుచుండఁగఁ గోరిక
తీరకయని చెప్పుటవ్యర్థముకాదా?
యశు—ఔను.
బుద్ధు—కావుననేమని చెప్పినజాలును? ఆలోచించుకొనుము.
యశు—కోరికయని చెప్పినజాలును.
బుద్ధు—ఆఁ మంచిది. బాలుఁడు అమ్మవారియుత్సవము. జ్ఞప్తియున్నదా?
యశు—లేకేమి!
బుద్ధు—బాలుడెందుచేత నేడ్చినాఁడు? మఱియొకసారి చెప్పుము.
యశు—అమ్మవారిని జూచుకోరిక చేత—

బుద్ధు—ఈకోరిక బాలునకు బాధనిచ్చినప్పుడు కోడిపందెములఁజూచు కోరిక నీకుబాధ నీకుండునా?

యశు—ఇప్పుడునాకాబాధ లేదు.

బుద్ధు—సరే! పందెమునుజూచుటకుఁ నీవుబోయినతోడనే నీకీబ్బాధనివారణమగునా?

యశు—నేనెక్కడికిబోవను. ఇచ్చట నేనుందును.

(నేపథ్యమున) మాకుఁ గూడ మనస్సులుతిరుగుచున్నవి. మేము గూడ నిచ్చటనే యుందుము.

బుద్ధు—వలదు; నాయనా! వలదు. నీయానందమునకు నేనభ్యంతరము పెట్టిన బాగుగనుండునా? చూడు పందెమునుజూచుటకు వెళ్లితినను కొనుము. చూడకున్న బాధ చూచినపిమ్మట నివారణమగునా?

యశు—ఔను.

బుద్ధు—అయిన దొక్క బాధనివారణమేనా? దానిపైన మఱేదైన గలిగినదా? ఆలోచించి మఱిచెప్పుము.

యశు—అంతకంటె మఱేమియునునాకుగలిగినట్లునమ్మకము లేదు.

బుద్ధు—సరే! ఆనందమేదో కలుగునని చెప్పితివే యదివట్టిదేనా?

యశు—ఏమియనిననేమి యసాధ్యమో యని సంశయించుచున్నాను.

బుద్ధు—కోడికీకెలూడుటవలన నీకానందమున్నదా?

బుద్ధు—బాధానివారణముకాక యానందస్థితియొకటి పైననధికముగసంభవించునని నీకుఁ గొంతనమ్మకముగనున్నట్లున్నది. మనకునీకోడిపందెమేదృష్టాంతము. ఆనందమేదైన నున్నయెడల నదిపందెము,వలన గలుగవలసినదే?

యశు—ఔను.

బుద్ధ—కోడికికేలూఁగుటవలన నీకానందమున్నదా?

యశు— లేదు.

బుద్ధ—కోడినెత్తురు నేలస్రవించుటవలన నీకానందమా!

యశు— లేదు.

బుద్ధ—కోడిచావువలన నీకానందమా?

యశు— లేదు.

బుద్ధ—కావుగాయుజనుల హెచ్చరికవు, బలుకులవలన నీకానందమా?

యశు— లేదు.

బుద్ధ—జనులుగుంపు గూడిరని నీకానందమా?

యశు— లేదు.

బుద్ధ—ఇఁక దేనివలన నీకానందము?

యశు—దేనివలన లేదు. ఆనందమును లేదు.

బుద్ధ—కావున నున్నదొక్క—?

యశు—బాధానివారణమే.

బుద్ధ—కావున నానందము కోఱకుఁగాక బాధానివారణముకొఱకే నీవింటికిఁ బోఁదలఁచితివి కాదా?

యశు—నేనింక మీసన్నిధి నివదలను.

(నేపథ్యమున) మేమందరమును తే.

బుద్ధ—తొందర పడవలదు. ఇక్కడనేమున్నది? ఆనందనిలయమగు వేశ్యాలయమునకే పోవచ్చును.

యశు—(లెంపలువైచుకొని) నన్ను క్షమింపుఁడు.

బుద్ధ—నీకిప్పటికిఁ దెలిసినయంశములెవ్వి? [మము.

యశు—తృష్ణయే బాధకు హేతువు. బాధానివారణమే యానందభ్ర

బుద్ధ—నీవు వేశ్యాగృహమునకు బుద్ధిపూర్వకముగఁ బోయితివా? ఎవరైన బలాత్కరించిరా?

యశు—లేదు.

బుద్ధు—కల్లుపాకకో?

యశు—నేనే పోవుదును.

బుద్ధు—ద్యూతమునకో?

యశు—బుద్ధిపూర్వకముగ నే పోవుదును.

బుద్ధు—ఇట్టివాంఛలన్ని నీవు కలిగించుకొనినవల్లకదా!

యశు—ఆ!

బుద్ధు—ఒకఁడుదయమున సుస్నాతుఁడై పరిశుద్ధవసనధారియై సత్కాలక్షేపమున నుండును. మఱియొకఁడు స్నానముచేసి కొంతసేపుండి బురదయొడలికిర్వాచుకొని తిరిగిస్నానముచేయును. మఱియొకసారి నెత్తిపైగోమయముపట్టించుకొని స్నానముచేయును. మూడవసారి యాముదము నోటిలోఁ బోసికొని నోరంతగండూషణముచేసి చెడగ్రక్కుకొనును. ఈయిద్దఱిలో నెవఁడపరిశుద్ధుడని చెప్పఁగలవు?

యశు—రెండవవాఁడు.

బుద్ధు—ఎందుచేత?

యశు—పరమాసహ్యమగు కల్మషము ననవసరముగ దేహమునకు బూసికొననేల? తరువాత గడుగుకొననేల?

బుద్ధు—నాయనా! బుద్ధిమంతుడవోయి! అటులే తృష్ణలను గల్పించుకొననేల? బాధపడనేల? బాధనునివారించుకొని మేమేయానంద స్వరూపులమని యననేల?

యశు—(లెంపలువైచుకొని) క్షమింపుఁడు. బుద్ధిగడ్డితినియుంటిని.

బుద్ధు—కావున నీవానందస్వరూపుఁడవు కావు?

యశు—కాను; మహాత్మా! కాను. ఘోరబాధాస్వరూపుఁడను.

బుద్ధు—అట్టులనకుము.

యశు—మహాత్మా! ఏమిచేత?

బుద్ధ—కడుపుబరువుగ నున్నపిల్లి యేమిచేయునో యెఱుఁగుదువా?

యశు—ఎఱుఁగను.

బుద్ధ—ఆనందా! నీకుఁదెలియునా?

ఆనం—గడ్డికొఱికి, వాంతిచేసికొని యుదరభారమును మాన్పుకొనును.

బుద్ధ—నీకుఁదెలిసిన దృష్టాంతమునే చెప్పెదను. మంగలివానికిఁ గాలికిముల్లుగ్రుచ్చుకొనినది. నేను వేదనాస్వరూపమనని పొడియు వలఁ బాలవైచివాఁడేడ్చునా? లేక మఱియేమైనఁ జేయునా?

యశు—గోరుగుల్లతో ముంటినూడఁదీసి బాధను దొలగించుకొనును.

బుద్ధ—ముంటినూడఁదీసికొన కుండవాఁడేడ్చుచుండిన వానినిజను లేమందురు?

యశు—మూర్ఖుఁడందురు.

బుద్ధ—నేను బాధావిలుఁడనని నీవు లోనఁబైనఁ బరితపించుచు నూరకుండిన నీవు మాత్రము మహాత్ముఁడవగుదువా;

యశు—పరమ మూర్ఖుఁడ నగుదును.

బుద్ధ—పరమ మూర్ఖుఁడవెందుచేత;

యశు—పిల్లికి క్షురకునకుఁ దమబాధను దొలఁగించుకొను మార్గములు తెలిసెను నాకుఁదెలియవు.

బుద్ధ—ఇన్నిమార్గము లెక్కడివి? ఉన్నమార్గమొక టేకదా!

యశు—నాకుఁ దెలియదు.

బుద్ధ—ముల్లుగ్రుచ్చుకొనుటచేఁ దలనొప్పి జ్వరము వచ్చిన క్షురకుఁడు ముంటిని దీయుటకుఁ ముందుగ వైద్యుని యొద్దకుఁ బోయి జ్వరవైద్యము చేయించుకొనునా? లంఘనములు సేయునా?

యశు—పైనసంభవించిన బాధలను శాంతిపఱిచిన లాభమేమున్నది? బాధకాది కారణమును నిర్మూలింపవలయును.

బుద్ధు—ఈమార్గమొక కంటకబాధకేనా? అన్నిబాధలకొఱకును వచ్చునా?

యశు—అన్నిటికిదియే.

బుద్ధు—కావున బాధను బాపుకొనుట కెన్నిమార్గములు?

యశు—ఒక్కటే.

బుద్ధు—ఏదది?

యశు—వేదనామూలకారణ నిర్మూలనము.

బుద్ధు—నీబాధకు మూలహేతు వేది?

యశు—తృష్ణ. కావున, తృష్ణానిర్మూలనమువలన సమస్త బాధలు నాకు నివారణమగును.

బుద్ధు—బాధలునివారణమగు వెన్క నీవు వేదనాస్వరూపుడవుకావుగదా!

యశు—కాను. మహాత్మా! కాను.

బుద్ధు—ఆనందమను స్వతంత్రతత్త్వమొకటి లేదనియు బాధనివారణమే యానందమనియు నీవిదివఱకభిప్రాయపడితివికాదా?

యశు—చిత్తము.

బుద్ధు—కావున నీ వింక నేస్వరూపుఁడ వగుదువు?

యశు—(నవ్వుచు) ఆనందస్వరూపుఁడనగుదును.

బుద్ధు—అమ్మయ్యా! నీపూర్వబిమదము నీకునిలువఁబడినదికద! బోధితలల భిక్షుకుల యొద్దకు వచ్చియున్నదున్నట్లు నిలువబరుచుకొంటివి. చాలు! అదృష్టవంతుడవు. ఇఁకనాయనా! నీయిష్టమువచ్చిన చోటికిఁ బొమ్ము.

యశు—మీరు నాకు గురూత్తములు, నాయిష్టమువచ్చినచోటును బొందుమని నాకాజ్ఞనొసంగితిరి. నేను మీయాశ్రమమును బొందితిని. నన్నుఁ బరిగ్రహింపుఁడు. నేను మిమ్ము వదలను.

(నేపథ్యమున) మేముకూడ మీసంఘమునఁ జేరితిమి. మమ్మాగ్రహింపుఁడు.

బుద్ధ—నాయనలారా! తృష్ణానిర్మూలనము చేయవలయుననియే మీకుఁ దెలిసినది. కాని యేయేసాధనముల నిందునిమిత్తమై చేయవలయునో మీకింకఁ దెలియ లేదుకదా?

ఆనం—అదినాకుఁగూడఁ దెలియలేదు.

యశు—ఏసాధనములైననరే నిశ్చలదీక్షతో నాచరింప సిద్ధముగనున్నాను.

(నేపథ్యమున) మేమందఱముగూడ నట్లేయున్నాము.

బుద్ధ—ఆనందా! అష్టాంగశీలమును నీవొక్కఁడవే యభ్యసింపక మఱియేఁబదియైదుగురితోఁ గూడనభ్యసించుసంతోషము నీకుఁ గలుగనైయున్నదికదా?

ఆనం—చిత్తము. [లేదు.

యశు—అష్టాంగశీలమంటిరే మహాత్మా! అదియేదియో నాకుఁదెలియ

ఆనం—తమ్ముఁడా! అదియేతృష్ణానిర్మూలనసాధనము.

యశు—ఆలాగా! అదియేనాకుఁ గావలయును.

(నేపథ్యమున) మాకందఱకదియే కావలయును.

యశు—సఖులారా! సన్యాసులారా! మనగురువుగారుపన్యసింపఁబోవుదానిని శ్రద్ధగావినుఁడు.

(నేపథ్యమున) చెవులు, మనస్సుకూడనాకర్షించుకొనియే పోఁబడినవి. ఇఁకమాశ్రద్ధ యేమున్నది?

బుద్ధ—సోదరులారా! ఈశీలమనునదియేమియు వింతయైనదికాదు. ఇదిపూర్వులు నిర్వచించినదే. మీఅందఱుఁగూడ నెఱిఁగియున్నదే. వినఁదలఁచితిరికాన వినుఁడు. నేను జీనాదేశమునకుఁ బోయెదను—

(నేపథ్యమున) మేముగూడ వచ్చెదము.

బుద్ధు—సోదరులారా! అలాగే. నేనుమనసులోఁబోయెదను కావున మీరు కూడ మనసులో నేరండు. ఆదేశమునకు వెడలఁదలంచిన నేను సింహళమువంకఁ బోయిన గమ్యస్థానమును జేరఁగ్గలనా?

(నేపథ్యమున) చేరలేరు.

బుద్ధు—సరే. సింధుదేశము వంకఁ బోయిననో?

(నేపథ్యమున) చేరలేరు. హేహే. (నవ్వుచున్నారు)

బుద్ధు—సరే! హిమాలయము వైపునఁ బోయిన?

(నేపథ్యమున) అద్దే! అవలీలగఁ జేరఁగలరు.

బుద్ధు—ఆనందా! కావున?—

ఆనం—గమ్యస్థానదిశనుగూర్చి యథార్థజ్ఞానముండవలయును.

బుద్ధు—ఉండవలయునుగద—

(నేపథ్యమున) ఓ ఓ తప్పకయుండవలయును.

బుద్ధు—ఇక్కడనుండి యొక్కపరుగునఁబోయి యాదేశమును జేరవలయునని నడుముఁ గట్టుకొని పర్వెత్తినఁ జేరగలనా?

(నేపథ్యమున) చీనాదేశమఁట! ఒక్కపరుగు దూరమఁట! హే హే హే!

బుద్ధు—యశుఁడా! కావునఁ బ్రయాణమునకుఁ ముందు మఱియేమి తెలియఁ దగినది?

యశు—గమ్యస్థానమెంతదూరమున్నదోయను నంశము.

(నేపథ్యమున) నిజమే.

బుద్ధు—రేయింబగళ్లు నిరంతరముగ నడచి యటకుఁ బోవుదుమన్నచోఁ బోగలనా?

(నేపథ్యమున) అయ్యో! అయ్యో! నిద్రాహారములు లేకుండనట్లు సేయవచ్చునా.

బుద్ధ—ఆనందా! కావున?—

ఆనం—దిశాదూరము లేకాక బాటసారులకుశయ్యాభోజనసౌఖ్యముల కేర్పఱుపబడిన సత్రము లెచ్చటెచ్చట నున్నవో కూడఁ దెలిసికొనుట కర్తవ్యము.

(నేపథ్యమున) కాదామఱి?

బుద్ధ—ఒకదినము నడచి నాలుగుదినములూరకుండి యటుపై నొకదినమినఁ బరుగెత్తిపోయినయెడల సుఖముగఁ బోగలనా?

(నేపథ్యమున) అబ్బో! ఆమాటయసత్యము. చీనాదేశమనఁగ బైపై నున్నదా? కాకిచెమ్మల కాలినడకల కొట్టబెట్టునదికాదు.

బుద్ధ—యశుఁడా! కావున?

యశు—నిరంతరదీక్షతోఁ గ్రమక్రమముగ ముందునకుఁబోవలయును.

(నేపథ్యమున) ఆ! ఆ!

బుద్ధ—సరే. కొంతజ్ఞానసంభారము, కొంతనిశ్చలదీక్షా సామగ్రి, మఱికొంతయుచితపరికరసంపత్తియు నిందులకొఱ కావశ్యకములని స్పష్టపడుచున్నదా? ఒక్కచీనాప్రయాణమునకే యిట్టి జ్ఞానదీక్షాసాధనము లావశ్యకములా?

(నేపథ్యమున) అవి లేకున్న నేయుద్యమమును గొనసాగదు.

బుద్ధ—నిరంతరచిత్తపరిశాంతిసంపాదనముకూడ ఘనుజోద్యమముల లోనొక్కటియే కాదా?

(నేపథ్యమున) హా హా హా! అదియే ముఖ్యమైనది. అదియొక్కటి యున్న మిగిలినయుద్యమములక్కఱ లేవు. మహాత్మా! మహాత్మా! అదిమాకుబోధింపుఁడు. ఇదివఱకు సుఖములనుకొనిపడినబాధలు తలఁచుకొన్న నిప్పుడుకూడఁ గడుపుమండిపోవు చున్నది. ఇది యేప్రథమోద్యమము. [వల్లయునా?

బుద్ధ—కావుననీయుద్యమమునకుఁ గూడఁ గొంతసాధనసామగ్రియు గా

యశ—ఇది సర్వోత్కృష్టమగు ప్రయత్నము కావున దీనికిఁ బరికర సం
పత్తియధికముగఁ గూడ యుండఁదగు నేమో?

బుద్ధ—అట్టియుత్తమోత్తమ సాధనమే యష్టాంగశీలము.

గీ. గస్తిపానికి దయ్యము ♦ ల్గలవటంచు
పాడునమ్మకమున్న నా ♦ పనిపడచునె?
న్యాయకర్తకు నభిచార ♦ మందునమ్మ
కము గలుగ న్యాయమేరీతిఁ ♦ గలుగుఁ బ్రజకు?

గీ. అంగసాఖ్యాధి కారికి ♦ నమ్మవార్ల
భయముగలుగ గ్రామముశుద్ధిఁ ♦ బడయఁగలఁడె?
మనుజు మర్త్యాంగనలు గాన ♦ మహిమఁజంపఁ
గలవనెడు నావికుఁడు యాత్ర ♦ గదలఁ గలఁడె?

గీ. తప్పటూహ సత్క్రియలను ♦ ధ్వంసపఱుచుఁ
జదువు రేఖ చేతిని లేమిఁ ♦ జదువడంగు;
గురుఁడు చండాలుఁడాకుపైఁ ♦ గూడుభ్రష్ట
ధర్మునకు ధర్మకర్మ య ♦ త్నంబులీగు.

ఆనం—మహాత్మా! ఇట్టితప్పటూహములు జనులకుఁ గలుగనేల?

బుద్ధ—గీ. ఒడలిబలుపున నోపిక ♦ రొత్తిగిల్ల
నెమటి రాజకీయపులెక్క ♦ నిట్టిరాజు
కనిపరీక్షింప కదిసరి ♦ యనుచుఁ గ్రింద
గ్రుడ్డిగచ్చకాయలు సాలి ♦ గూటఁబెట్టు.

గీ. అల్లిగర్వమెదిగి బుద్ధి ♦ నవలఁద్రోయ
నార్షసంప్రోక్తముల నిట్టి ♦ యట్టిగోణఁగి
శ్రేష్ఠ దౌష్ట్యవిమర్శన ♦ శక్తిలేక
గంగి బసవన్నవలెఁ దలఁ ♦ గదుపుజనుఁడు.

గీ. మంత్రియే పరీక్షించిన ♦ తంత్రమందుఁ
గొదువ లుండునె యనిరాజు ♦ గుఱ్ఱుఁబెట్టు;
నలువబుఘులనావేశించి ♦ పలుకువాని
యందుఁదప్పు లెట్లనిజనుఁ ♦ డంధుఁడగును.

తప్పునమ్మకములకిది యొకహేతువు.

గీ. కూసికుఱ్ఱని తన్మెచ్చు ♦ కొనును గాక;
యజ్ఞుఁడెదొ ప్రేలిసంతుష్టి ♦ నందునవ్వి;
తనదుకవితను బగులకు ♦ వినిచియేదొ
యేదొ యనిపైకిఁబల్కి మి ♦ న్నకుక్కలోన.

గీ. ఎటుకనికిఁ దనపంది భూ ♦ మీశుపట్టి
గజము కంటెఁ బ్రశస్తమై ♦ కానిపించు;
ఖిండనికిఁ దినకటిబోసి ♦ మెల్లసాని
నింద్రు నూర్వశినెత్తిపై ♦ నెగిరిపోవు.

గీ. తనదియేదైన సరె ప్రశ ♦ స్తఁబునిజము
నాదియనుకొంటఁబుట్టు ను ♦ న్మాదమిదియె
తనమతమె మంచి పరునిది. ♦ తప్పటంట
వెఱ్ఱులన్నిటి లోరాచ ♦ వెఱ్ఱినుమ్ము.

గీ. స్వమతమె యథార్థమైనప్డు ♦ నవనమందు
సోమపానము మంచిది ♦ సుందరికయి
కల్లలాడుటమంచిది ♦ కాలశవము
మీఁదిగణపతిపూజయు ♦ మిగులమంచి.

ఇదిరెండవహేతువు. నాయనలారా! జ్ఞప్తియున్నదా? మనము బుద్ధిపూర్వకముగ దెచ్చుకొన్న ప్రమాణమునఁ గొన్ని దుర్విశ్వాసములుగలుగును. తమమతమె మంచిదను వెఱ్ఱివలనఁగొన్ని

కలుగును. సోదరులారా! తెలియక పోయిన నడుగుడు. చెప్పవల
సినది చాలగనుంటచే సంకుచితముగఁ జెప్పుచున్నాను.

యశు—మహాత్మా! శ్రద్ధతోవిని గ్రహించుచున్నాము.

(నేపథ్యమున) మహానుభావా! బుద్ధాచార్యోత్తమా! తమవా
క్యములు గర్ణముల కమృత ప్రవాహము లైయున్నవి.

బుద్ధు—గీ. కారమిష్టము గలవాఁడు ♦ కారముగల
భక్ష్యముల నిచ్చుజనులకు ♦ వలసినపుడు
గాన మిష్టముగలవాడు ♦ గానమహిమ
నందతానందమును బొందు ♦ నట్లొసర్చు.

గీ. తనకు నెద్దియిష్టమోయది ♦ జనులకెల్ల
నుండదగునని పల్కుఁజ ♦ నుండుతఱచు
పిల్లజుట్టిష్టమగువాఁడు ♦ పిలకజుట్టు
లాడువాడికిఁ గూడమే ♦ లనుచుబల్కు.

గీ. తనకుఁ మజ్జనమిష్టమౌ ♦ జనుఁడుదేవు
లక్కపుత్త్రపైతగధిక్క ♦ శంకుమనును
తళుకుబట్టల పెళపెళల్ ♦ గలుగుజనుఁడు
గూని వెన్ను పాముని బిళ్ల ♦ గోచివెట్టు.

గీ. శ్రాద్ధభోజనమిష్టమౌ ♦ జనుఁడు మొండి
బోసిమూతికి గారెల ♦ బుట్టఁగట్టు;
స్త్రీప్రియుఁడునపుంసకునిచేఁ ♦ జేఁతమాచ
కమ్మకెట్లొగర్భాధాన ♦ కలనజరుపు.

తప్పునమ్మకముల కిది మూఁడవహేతువు. మఱియొకటి జెప్పె
దను వినుఁడు.

గీ. దురదకాత్మకమందను, ♦ దొలఁగితీఁగ
పాముమెలికలఁబడి యూర్వఁ ♦ బ్రక్కచరియు

ప్రతిరవము నృకము హసింపఁ ♦ బరుగులిడుచుఁ
గుక్కవెలిదీయదే స్మృతి ♦ గుక్కనుంచి.

గీ. అట్టిదుష్పథములఁబడి ♦ యార్తిఁజెంది
తన్నుఁగాపాడుకోశక్తి ♦ సున్నమైన
జనుని నెటనుండియోదైవ ♦ శక్తివచ్చి
వింతగాఁ బ్రోచుననుకొంట ♦ పెద్దవెఱ్ఱి.

(నేపథ్యమున) మహాత్మా! భగవంతుఁడు లేడనియే తమయభి ప్రాయమా?

బుద్ధు—(నవ్వుచు) లేఁడని నేనంటినా? అట్టియవసరమున నట్టివాని నాతఁడు బ్రోచుటజరుగదనికదా యంటిని. ఈయంశమునుగూర్చి యవకాశముచేసికొని మఱియొకప్పుడు బోధింతును. తప్పొటూహాలు కలుగటకిది యొక్కదారియను నంతమాత్రమునకే యిప్పుడు దీని గ్రహింపవలయును.

(నేపథ్యమున) చిత్తము. చిత్తము.

బుద్ధు—తప్పొటూహాలు కొందఱు తమసంతుష్టికైకూడఁ గల్పించుకొందురు. తప్పునమ్మకములకిది యొకమార్గము.

(నేపథ్యమున) సెలవిచ్చెదరు గాక!

గీ. చిత్తమున నప్సరసలు ♦ చేయెత్తుకులుకు
లాడులను ముద్దులాడి వె ♦ న్నాడిపాడు;
ఱామదేవిప్రియుండు బం ♦ గారుగిన్నె
జోరుజోరు పాయసమొక్క ♦ జుఱ్ఱఁగొనును.

గీ. అట్టులేసర్వమస్థిర ♦ మనియొఱింగి
పరమపదమున మందార ♦ తరులక్రింద
సుధను ద్రావి జరామృతి ♦ శూన్యుఁడగుచు
నక్షయముదాప్తి జనుఁడుండు ♦ నాత్మయందు.

ఇదియాత్మశాశ్వతత్వమును గూర్చినవెఱ్ఱి. ఈతత్వమునుగూర్చి కూడసావకాశముగఁ దరువాతఁ జెప్పెదను. ఇట్టివెఱ్ఱులు గలుగుట కనేకకారణములున్నవి యిప్పటికిచాలును.

గీ. అజ్ఞజనునకు గౌరవిద ♦ య్యాంబులైన
వగును వాయుభేదములు వి ♦ ద్యాన్వితునకు;
అజ్ఞుకంటను పాముకా ♦ నైనయద్ది
ఛాయగా గానబడును వి ♦ జ్ఞానికంట.

గీ. మొదటిసంజ్ఞలఁ దప్పుగాఁ ♦ జదువువాఁడు
వ్యాకరణశాస్త్రపారంబు ♦ నందఁగలఁడె?
తప్పుటూహ్యములను నెప్పు ♦ దాఁగలదె?
వంకదువ్వెనతో సూటి ♦ పాపటగునె?

భవదుఃఖవిముక్తియే సర్వమతములకు ఫలము. బుద్ధమతమునకుఁ గూడనదియే. అట్టిమహాఫలమును బొందఁదలఁచినవాఁడనేకకారణసంభూతాసత్యాభిప్రాయములఁ ద్యజించిప్రకృతికిని హేతువునకును సంభవించిన సత్యాభిప్రాయములనే సంగ్రహింపవలయును. దురభిప్రాయనిరాకరణము, సత్యాభిప్రాయ స్వీకరణమే సమ్యగ్దృష్టికిఁ బేరు. ఈసమ్యగ్దృష్టియే యష్టాంగశీలమునకు మొదటిది.

గీ. లెక్కకంకెలు చదువున ♦ కక్కరములు
శాస్త్రమునకు సంజ్ఞలును బీ ♦ జములుపంట
కత్యధమజీవులు నరతా ♦ ప్రాప్తికిట్లొ
సమ్యగీక్షయట్లగు చిత్త ♦ శాంతికొఱకు.

అష్టాంగశీలమున రెండవది సమ్యక్సంకల్పము. ఇదికూడవివరింపవలసినదా?

(నేపథ్యమున) ఇష్టమని సామాన్యముగనందు రేమి మహాత్మా శ్రవణములతోఁగాదు; ప్రాణములతో వినుచున్నాము.

బుద్ధ—శర్కర మధురముగ నుండదా?

(నేపథ్యమున) హే హే హే! ఉండదా? నోటిలోనదిపడుట ప్రాణముసుఖపడుట యొక్కమారుజరుగును.

బుద్ధ—అతిమాత్రరోగి దానిమాధుర్యమును బరిగణించునా?

(నేపథ్యమున) పరిగణింపఁడు. పరిగణింపఁడు.

బుద్ధ—ఏల?

(నేపథ్యమున) దానిని భక్షించి తనరోగమును వృద్ధిపఱుచుకొనునా?

బుద్ధ—యశోదా! కావున?

యశో—జనులకు శర్కరకంటె నారోగ్యమే యతిమధురము.

బుద్ధ—సొమ్మందరకుఁ బరమప్రియమగు వస్తువేకద!

(నేపథ్యమున) అద్దే! అద్దే!

బుద్ధ—బందిపోటు దొంగలు సొమ్ముగలవానియింటికి వచ్చి ధనమిచ్చెదవా చచ్చెదవాయని బెదరింప నాతడేమిసేయును?

(నేపథ్యమున) ప్రాణముండిన ధనము లేకపోవునా? ప్రాణము లేకున్న ధనమువలని ప్రయోజనమేమి?

బుద్ధ—ఆనందా! కావున?

ఆనం—సర్వధనముకంటె ప్రాణరక్షణమే పరమప్రియము.

బుద్ధ—భర్తకంటెఁ బతివ్రత కిష్టతర పదార్థము మఱియొండుగలదా?

(నేపథ్యమున) ఉండదు.

బుద్ధ—భర్తతో భార్యను సహగమనమున కీడ్చుకొని పోవనేల? కాలుసేతులుకట్టగట్టి యామెను భర్తతో నగ్నిశయ్యఁ జేర్పనేల?

(నేపథ్యమున) అబ్బో! తనచావువఱకు వచ్చినప్పుడు! అబ్బో. భర్త యైనసరే. పెద్దకొడుకైనసరే! మఱియెవఁడైనసరే!

బుద్ధు—యశుఁడా! కావున,

యశు—స్వరక్షణమే జనునకు ముఖ్యతమమైనది—

బుద్ధు—ఒక్కజనునకేనా?

(నేపథ్యమున) సర్వప్రాణులకు నిదియే సహజధర్మము.

బుద్ధు—సోదరులారా! పరోపకారైక పరాయణులెవ్వరు లేనేలేరా?

(నేపథ్యమున) ఉన్నారు. తమవంటిమహాత్ములు!

బుద్ధు—నామాట నేలచెప్పెదరు? స్వనాశనమునకైన లక్ష్యము చేయక 'అహమ్' అనుదానినే నిర్మూలించి కేవల పరసుఖానంద క్రియా దీక్షులైన వారెవ్వరైనను న్నారా?

యశు—ఉన్నారు. మిగుల తక్కువగ—

బుద్ధు—వీరుకూడఁ బ్రాణులేనా?

(నేపథ్యమున) హేం హే! ప్రాణులుకాక మఱెవ్వరు?

బుద్ధు—అగునెడలఁ బ్రాణులసహజధర్మమగు స్వప్రాణ కావనతత్పరత వీరియందు మాత్రమేల లేదు—సోదరులారా! మాటలాడరేమి! వీరు ప్రాణులైన గాకుండవలయును. స్వప్రాణావనమైన సహజధర్మము కాకుండవలయును. వీనిలో నేదియథార్థము?

(నేపథ్యమున) సహజధర్మమునుగూర్చి మేమెఱుఁగము. కాని వీరు ప్రాణులనుట మాత్రము సత్యము.

బుద్ధు—యశుఁడా! కావున?

యశు—స్వజీవనైకరక్షణము సహజధర్మము కాదని తోఁచుచున్నది.

బుద్ధు—సహజముకాని దేదైయుండవచ్చును.

యశు—తెచ్చిపెట్టుకొనినదై యుండవచ్చును.

బుద్ధ—యశుఁడా! సర్వకార్యములకు మూలకారణమేది యుండునని నీవు చెప్పితివి?

యశు—తృష్ణ—

బుద్ధ—అటులైన దీనికో?

యశు—తృష్ణయేయని తోఁచుచున్నది.

ఆనం—మహాత్మా! అట్టితృష్ణకలుగుట కేమికారణము?

బుద్ధ—నాయనా! నీవేచెప్పవలెను కాని; చూడు! ఈశాటినీకిచ్చితిని పుచ్చుకొనుము.

ఆనం—మహాత్మా! అనుగ్రహింపఁబడితిని.

(నేపథ్యమున) మాకుఁగూడఁ గాషాయముల నిప్పింపరా?

బుద్ధ—పూర్ణముగఁ దెలిసికొనిపిమ్మట నటులేతీసికొనవచ్చును. ఆనందా! ఈశాటినీదేనా?

ఆనం—చిత్తము. నాదే.

బుద్ధ—ఎందుచేత?

ఆనం—మీరిచ్చుటచేత.

బుద్ధ—నేనిచ్చుటయేల? నీవేతీసికొనరాదా?

ఆనం—తమశాటిని నేనెట్లుతీసికొందును!

బుద్ధ—అందుచేనాదికావున నేనిచ్చితిని. పుచ్చుకొంటివికాన నీదనుకొనుచుంటివి.

ఆనం—చిత్తము.

బుద్ధ—అనఁగ కారణాంతరముచే నీదనుకొనుచున్నావు. కాని యీవస్తువునీదికాదు.

ఆనం—చిత్తము.

బుద్ధ—యశుఁడా! ఈదేహము నీదేనా?

(నేపథ్యమున) హా హా! కాదామఱి!

యశు—నాదే.

బుద్ధు—నీదియగు నెపల నీ కెటనుండి వచ్చినది?

యశు—మాతల్లిదండ్రు లొసంగిరి.

బుద్ధు—కావున నీదని నీవనుకొనుచున్న యీదేహము మీతల్లిదండ్రులది.

యశు—చిత్తము. అంతే!

బుద్ధు—మీతల్లిదండ్రులమాత్రము స్వయంభువులా! నాయనా!

యశు—వారుగూడ వారితలిదండ్రులకుఁ బుట్టినవారే!

బుద్ధు—కావున వారివనుకొనిన దేహములుమఱికొందఱవి. చూచితివా?

యశు—చిత్తము.

బుద్ధు—అందుచేత నీదనుకొనిన దేహము మఱికొందఱది కాదా?

యశు—చిత్తము.

బుద్ధు—సోదరులారా! మీకుఁ దెలిసినదా? ఇచ్చటనిరుకుగానుంటచే మీరుదూరముగఁ గూరుచుండ వలసివచ్చెను.

(నేపథ్యమున) మనస్సులచే మిక్కిలి దగ్గఱగ నున్నారము.

బుద్ధు—యశుఁడా! నీదేహ మొకటి; ఇదినీదేకాక నీతలిదండ్రులిద్దఱిది, వారిపూర్వులు నల్గుఱది.

యశు—చిత్తము. తెలిసినది.

బుద్ధు—అంతటితోనాఁగునా! వారిపూర్వులగు నెనమండ్రది. ఆపై వారిపదునార్గుఱది ఇట్లుపైకిఁ బోఁగఁ బోఁగఁ—

యశు—నాదేహము ప్రపంచమం దిదివఱకుఁబుట్టి యిప్పటివఱకున్న నరకోటిదంతదియును!

బుద్ధు—నాయనా! అంతేనా?

యశు—ఇఁకముందుఁబుట్టఁబోవు నరకోటి దంతదియుఁగూడ—

బుద్ధు—అంతటితోడనే సంతుష్టినొందియుందువా? నాయనా!

యశు—ఏల?

బుద్ధు—పశుపక్షికీటకాది సర్వజంతువులును సర్వవిధముల నీవంటివే కావా?

యశు—ఔను.

బుద్ధు—ఉల్లిపొరవంటి రెండుచర్మము లంటించిన చిన్నసంచిలో నరముల ప్రాతిపదికమైన చిన్నచుక్క గలిగి కనులు ముక్కు నోరు మొదలగు నేయవయవములు లేనిచిన్నప్రాణిని నీవుచూచితివా?

యశు—చూడ లేదు.

బుద్ధు—ఆనందా! నీవో?

ఆనం—చూచితిని.

బుద్ధు—దానిపైనుండి జంతుని శ్రేణికారోహణమొనర్చు క్రమక్రమము గ నవయవస్ఫూర్తి అవిలోమవిలోమానల్ప భేదసంజాలముతో గూడిన నరములకూడిక తిర్యగ్గమనాదులుమాని యూర్ధ్వగమన ము మొదలగుసంపూర్ణ నరరూపావస్థయు మనము చూచుచున్నాముకామా?

ఆనం—చిత్తము.

బుద్ధు—అట్టిదో యశుడా! నీదనుకొనిన దేహము సమస్తనరకోటిదే కాక?—

యశు—సమస్తప్రాణికోటిదికూడను—

బుద్ధు—అట్టిచో నొక్క నీపొట్టనుమాత్రము నింపుకొనిన నీకుజాలునా నీపొట్టలోనెన్నికోటుల జంతువులపొట్టలిమిడియుండలేదు. అవి యెవరివో నా? నీవేకావా? అన్నికోటులకడుపులు మాడుచుండగ నీకడుపెట్లునిండినదని సంతసించుచున్నావు? నిండినదా? శతకోటిగుణాధికముగ మాడుచున్నదా? నీదిసంతసమా? సమస్తప్రాణులు నీలోనేడ్చుచున్న యేడుపా?

యశు—మహాత్మా! తెలిసినది.

బుద్ధ—పరదేహముల సుఖమునే నీవాచరించువాఁడవైన నెడలో?

యశు—అమితమైన యానందము.

బుద్ధ—ఎందుచేతనో యిప్పుడు తెలిసినదా?

యశు—నాదేహమంతయుఁ బరదేహమే.

బుద్ధ—పరులకు సుఖజ్ఞానము లిచ్చి నంతకాలమే?—

యశు—నాకుసౌఖ్యము.

బుద్ధ—నాకుసౌఖ్యమంటివే నే ననఁగ నేమి?

యశు—పర్థులు.

బుద్ధ—యథార్థబుద్ధిఁజూడ „నే" ననువస్తువున్నదా?

యశు—లేనట్లే.

బుద్ధ—ఇప్పటికున్నది. అది లేకుండఁ జేసినవాఁడేధన్యుఁడు. అతఁడే బుద్ధుఁడు. కాలిక్రిందిపురుగులు, ఆకాశమునందలి పక్షులు, అడవిలోనిజంతువులుసహస్రముఖములఁ దమజన్మవృద్ధి లయాది మార్గముల సర్వజీవనైక్యమును ఘోషించుచుండ లేనిది, ఋజువు కానిది, కల్పించుకొనినది, నిర్హేతుకమైన దగునాత్మతత్వము నెవఁడో విశ్వామిత్రసృష్టిచేసి యేజంతువునకాజంతువునే వేరుచేసి, యైక్యమును జెడఁగొట్టి, యజ్ఞానమును బెంచియహంభావమును వృద్ధిపఱచి, యితరప్రాణులయెడ నసూయవర్ధిల్లఁ జేసి, దుష్టబుద్ధులను బ్రేరేపించి, యెంత నీవు తానే తానేయని గుడుగుడుగుంచములాడఁజేసి యొక్కటే దేహమగు జంతులోకమును గణుపుకణుపుసూడఁదీసి, తలసహస్రధాపగులఁగొట్టి, మాంసములు ఖండఖండములక్రింద పోగులువెట్టి, సర్వజగత్తు నొక్కకటికవాని యంగడిఁజేసి, యీరీతిగసర్వవిధ్వంసము చేసి, యుండఁగనో సోదరులారా! ఇప్పుడైనఁ గన్నుదెఱువరా? ఇప్పుడైననొకత్వాటి మన

సునిలుపరా? ఇప్పుడైన హృదయములు పాషాణములుగఁ జేయుచుకొందురా? ఇప్పుడైన లేనిపోని ప్రమాణముల నిరాకరింపరా? ఇప్పుడైనఁ బ్రత్యక్షానుభవమునకు శాస్త్రమునకు విరుద్ధమగు ప్రబంధకల్పవల్లులను ద్రెంపి వేయరా? వస్తుయాథార్థ్యమెఱిఁగి పరమమైత్రిమతమును లోకోద్ధరణార్థమై మహోత్సాహసంభ్రమములతో నుద్ఘోషించు బుద్ధునియుపదేశ మాలింపరా?

(నేపథ్యమున నందఱు నమస్కరించి) మహాత్మా! వింటిమి. సంతుష్టిఁగాంచితిమి.

బుద్ధు—ఆనందా! అహంభావము, పరలోకేచ్ఛాసహనము, అను తృష్ణలు దేనిచేఁ గలిగినవో తిరిగి చెప్పుము.

ఆనం—సర్వజంతుజాలైక్య జ్ఞానాభావముచేతను, మిథ్యాత్మతత్వమువలనను గలిగినవి.

బుద్ధు—తృష్ణగలుగుటకుఁ గారణమేమని యిదివఱకడిగితివి. ఇప్పుడు తెలిసినదా?

ఆనం—మహాత్మా! తెలిసినది.

బుద్ధు—ఇట్టిజ్ఞానమూలకపరమచిత్తశాంత యవస్థాలతాకుసుమమగు నిర్వాణమే యష్టాంగశీలమున రెండవదియగు సమ్యక్సంకల్పము. మూఁడవది సమ్యగ్వాక్కు.

ఆనం—చిత్తము. దీనినిగూడ శోధింతురుగాక.

బుద్ధు—యశుఁడా! వీణావాద్యమునసీకుఁ బ్రవేశమున్నదా?

(నేపథ్యమున) మహాత్మా! సామాన్యప్రవేశమా? సానులలోనిశిష్యురాండ్రుకాని వారెవరు? ఎందులకు! ఎందులకు! ఆగురుత్వమే వదలిపోయినది. మాకందఱకాసంపర్కము లే వదలిపోయినవి. తమదర్శన మాహాత్మ్యమునఁ గృతార్థతఁ బొందితిమి.

బుద్ధు—యశుఁడా! వీణకుమెట్లపైఁ దంత్రులుండఁగఁ బ్రక్కఁగూడఁ దీఁగలుండనేల?

యశు—వీణనుండి వెడలు పలుకులు శ్రుతిసమంజసములై యుండవల యునుగాదా?

బుద్ధు—సోదరులారా! ప్రాణరహితమగు వీణ నినుపతీఁగలు బిగించి వ్రేళ్లతోఁ బొడిచి కదిపి యూపి బలాత్కారముగ మనుజుఁడు పలికించిన పలుకులే శ్రుతిసమంజ సములై యుండవలసినప్పుడు తానే బుద్ధిపూర్వకముగఁ బలికెడు పలుకులు శ్రుతిహితములై యుండ నక్కఱ లేదా?

(నేపథ్యమున) ఓ ఓ!

బుద్ధు—మోహనరాగమున వైణికుఁడు మధ్యమమును బలికించిన నెట్లుండును?

యశు—పరమాసహ్యముగ నుండును.

బుద్ధు—ఎందుచేత?

యశు—అదికూడని స్వరమగుటచేత.

బుద్ధు—కూడని స్వరచ్ఛాయనైన మనుజుఁడు పలికింపఁ గూడనప్పుడు కూడనిపలుకులు తానుబలుకవచ్చునా?

(నేపథ్యమున) కూడదు.

బుద్ధు—తొందరచేఁగాని, చేతు లలసిపోయిగాని తప్పమెట్టుపైనాతఁడు రాగమధ్యమున స్పృశించినయెడల—

యశు—కఠోరముగ నుండును.

బుద్ధు—ఆమాత్రపుఁ బొరబాటు కఠోరముగనుండు నప్పుడు మనుజుఁడు పలికిన తప్పుమాట యెట్లుండునో తెలిసికొనవలదా?

(నేపథ్యమున) మాతప్పులన్నియుఁ దెలిసికొనుచునే యున్నాము,

బుద్ధ—ఒకరాగస్వరమునననుసరించి వాయింపక నాలుగైదు రాగము లస్వరములను బంచగుడకపాయముగ వాయించినయెడల—

(నేపథ్యమున) మతిలేని వానికూఁతలు వలె నుండును.

బుద్ధ—అవియే యట్లుండునప్పుడు జనుల యసంబద్ధప్రలాపము లెట్లుండును?

(నేపథ్యమున) మహాత్మా! చెప్పుటకవకాశమున్నదా?

బుద్ధ—తీఁగలకుఁ బీటపైజీవాళులు లేకుండు నెడలనెట్లుండును?

యశు—తీఁగకు జలజలనాదముండక రెండుధ్వనుల యనుకులో వెలితిగఁగనఁబడును.

బుద్ధ—రెండుధ్వను లదుకక పోయినప్పుడే వెలితిగనుండునప్పుడుజనుఁడు పలుకుపలుకులకు నదుకులగు హేతుశుద్ధియుక్తి సహితత లేకుండు నెడల—

(నేపథ్యమున) ఏడుపంతకంటెనుంచిది.

బుద్ధ—వీణకుండ పలుచఁగ దొలుచబడక గఠినముగ మోటుగ నుండునెడల—

యశు—అట్టివీణను గాడిప్రొయ్యిలోఁ బడవైచిన మంచిది.

బుద్ధ—అదియే యథార్థమగునెడల హృదయకాఠిన్యముతోఁ బలుకువాని నేమిసేయదగును?

గీ. కఠిన చిత్తము దుష్కార్య ♦ కర్తృకంబు
గట్టి వెదురుబడితెఁ గుక్కఁ ♦ గొట్టనగును
లలితచిత్తము సత్కార్య ♦ విలసనంబు
బోలు వెదురు మురళియాచు ♦ ముద మొసంగు

గీ. తాపయుతు జిహ్వవాడియై ♦ తనరును జ్వర
కలితునాలుకగఱిదేరు ♦ కరణిగాఁగ

బూటుకూతలు నీత్యంత ♦ మునువదించు
జిహ్వపై నల్పునృతినిసూ ♦ చించునట్లు.

కావుననిప్పటివరకు మీకేమి తెలిసినది? ఆనందా! నీవుచెప్పుము.

ఆనం—గీ. భావరంజకముగఁ బల్క ♦ వలయు సత్య
వాక్యము శాంతదీక్షతోఁ ♦ బలుకవలయుఁ
గొండెములు నల్కఁగూడదు ♦ క్రూరవాక్య
ము లసంబద్ధములఁబల్క ♦ వలనుపడదు.

బుద్ధ—ఇదిగాక—

సీ. పరమదయాసుధా ♦ పరిషక్తమేకార్థ
కలితము పీతహృ ♦ త్కశ్మలంబు
జనగణోత్సాహావి ♦ శ్వాసవర్ధకమును
తత్త్వజ్ఞానసౌఖ్యసా ♦ ధనయుతంబు
గర్వశూన్యత్వప్ర ♦ కాశకంబునుయుక్తి
భవ్యసందర్భతఁ ♦ బ్రాంచితంబు
సముచితపరిపాక ♦ సంప్రదాయంబును
సత్యదీక్షైకప్ర ♦ శస్తతమము
నగుపలుకె పల్కనగుస్త్రీల, ♦ నవనిపతుల,
భక్ష్యముల, బిశాచముల, దే ♦ వతల, యుద్ధ
శకుల, గటికల గల్లుపా ♦ కల, ధనంపుఁ
జాతరల, సోదులనుగూర్చి ♦ పలుకదగదు

సమ్యగ్వాక్కునుగూర్చి యింతవరకుచాలును.

(నేపథ్యమున) మహాత్మా! నాలుగవదేది?

బుద్ధ—ఇతరహితార్థముగ నితరసౌఖ్యార్థముగ నితరధర్మప్రవృద్ధ్యర్థముగ నరుని పలుకులే యుండవలసియున్నప్పుడు చేష్టలట్లే యుండఁదగదా?

(నేపథ్యమున) అభ్యంతరమేమి? అభ్యంతరమేమి?

బుద్ధ—ఒకదుష్కృషి నొకర్చి వరికుప్ప వేసికొనినాఁడు. ఆకుప్పనొకఁడు మంటగలిపినాఁడు. ఇదిపరోపకారమా?

(నేపథ్యమున) హేం హేం హేం! కుప్పదగలబెట్టుటసత్కర్మమా

బుద్ధ—ఏలకాదు?

(నేపథ్యమున) దాని ప్రభువు కాపని ప్రత్యక్షబాధనీయదా?

బుద్ధ—కావున బాధనిచ్చునని?

(నేపథ్యమున) సత్కర్మముమున్నాటికినికాదు.

బుద్ధ—సరే! బాధనీయ కుండునని సత్కర్మమగునా?

(నేపథ్యమున) మాకుఁదెలియలేదు. బాధనీయ కుండు పనినిదేని నైనసెలవిచ్చెదరుగాక!

బుద్ధ—ఆ కుప్పనువాఁడు పరశురామప్రీతి సేయక తత్ప్రభువునకుఁదాని యనుభవముచకుఁనడుమ నష్టురాకుండును. అట్టిపని యేవగును.

(నేపథ్యమున) ఇదియుదాసీనకార్యము.

బుద్ధ—ఒకఛాందసుఁడు రాజద్వారమునుగూర్చి దక్షిణాపేక్ష చేఁబోయి గుమ్మము నొద్ద శకునమునకై నిక్కినిక్కి చూచుచుండగ రాజుచుఁ బొగగ్రమ్ముకొనిన పిడకనిప్పుతో బాలవితంతువు తేలు గుట్టుటవలని బాధ నేడ్చుచునెదురుగ రాఁదలచినదయ్యె నీబ్రాహ్మణుని తానుజూచి యావిధముగ నెమరురాకుండుట బ్రాహ్మణుఁడు సత్కర్మముగ స్మరించునా! లేదా!

(నేపథ్యమున) హేం హేం హేం! ఉపకారముగనే స్మరించును.

బుద్ధ—కావునఁ గుప్పదహింపకుండుట కూడ నొకవిధమగు సత్కర్మమేల కాఁగూడదు?

(నేపథ్యమున) కావచ్చును.

బుద్ధ—అతఁడాకుప్పను నూర్చుకొనునప్పుడు పొరుగువాఁడు తనపశువు

లతోఁబోయి యుచితముగ నిరపేక్షగనాతనికి సాహాయ్యము
చేయునెడల—

(నేపథ్యమున) ఇదిసత్కర్మము; పరోపకార కృత్యము.

బుద్ధ.—కావున, ఆనందా! సత్కర్మమెన్నివిధములు?

ఆనం.—రెండు.

బుద్ధ—యశుడా! అవియేవి?

యశు.—ఒకనికిఁ బ్రత్యక్షలాభమునుఁ గలుగజేయుట మొదటిది. ఆతనికి
బాధరాకుండునట్లుతాను జాగ్రత్తగఁ బ్రవర్తించుకొనుట రెండ
వది.

బుద్ధ—పరసౌఖ్యజ్ఞానదానమే మొదటిది. దీనికి దానమనిపేరు. ఈచేత
నుండు భిక్షాపాత్ర మీచేతనుంచిన నీచేతికిలాభ మీచేతికినష్ట
ముకాదా?

(నేపథ్యమున) ఆ! ఆ!

బుద్ధ.—కావునఁ బరోపకారమునఁ గర్తకుగొంత?—

(నేపథ్యమున) నష్టమున్నది.

బుద్ధ.—తాను శ్రమమునకోర్చియు నితరులకు జనుఁడు సుఖమీయ
వలయునుగాదా!

(నేపథ్యమున) అద్దే! అద్దే!

బుద్ధ.—సోదరులారా! ఇట్టిస్థితి ప్రపంచమున నన్నిస్థలములఁ జూచు
చునేయున్నాముగాదా?

ఆ. వె. నీరుఁద్రావిపుష్ప ♦ సారఘుమీయఁగ
లతలుమిగులఁ బ్రాఁకు ♦ లాడుఁగాదె?
బెడ్డవ్రేటుబాధఁ ♦ బెకఁద్రోచిఫలములీ
యంగఁదరువులూఁగు ♦ లాడుగాదె?

ఆ. వె. గడ్డిఁదినుచు ధేను ♦ గణములీయవె పాలు?
బరువుమోసి సుఖము ♦ ఖరమొసఁగదె?
బంధెఁ బడుచుఁ బురుగు ♦ పట్టొసంగదె? చలి
బడుచు గొఱ్ఱె రాంక ♦ వంబు నిడదె?

ఆ. వె. ఉప్పునీటఁ బొట్ట ♦ నోముచు నమృత మీ
యంగ మేఘమల్ల ♦ లారుఁగాదె?
పేడపెంటచేతఁ ♦ బ్రీతిఁ జెందుచు క్షమ
సర్వధాన్యతతియొ ♦ సంగుఁగాదె?

ఆ. వె. ఇష్టఫలము లనుభ ♦ వించినమనుజుండు
వీనిబోధఁగూడ ♦ వినఁగవలదె?
కవులగ్రంథతతినిఁ ♦ గడుమదంబును బొంది
వానినీతివిడువఁ ♦ బాడియగునె?

కావున, సోదరులారా! వానివలెనే?

(నేపథ్యమున) సర్వజనులు పరోపకారతత్పరులై యుండవలయును.

బుద్ధ—యశుఁడా! అంతయేనా?

యశు—వానివలెనేకాదు. వానికంటె నధికముగనని చెప్పఁదగును.

బుద్ధ—ఆనందా! ఎందుచేత?

ఆనం—స్థాణువులైన వృక్షాదులు, జ్ఞానశూన్యములగు జంతువులే యి ట్టి పుణ్యకార్య సమంజసములై యుండ స్వేచ్ఛాగమనముగల వాఁడును జ్ఞానవంతుఁడునైన జనుఁడు వానిని, పరోపకార పరాయణతను మించఁదగదా?

బుద్ధ—అంతేకాక,

ఆ. వె. పరసుఖంబులోనె ♦ నరు సుఖ మున్నది;
పరుని బాధలోన ♦ నరుని బాధ;

కాన నరుడు తన సు ♦ ఖమె కోరినయైనను
బరుల సుఖమె సేయ ♦ వలయు నెపుడు.

ఇదియుఁగాక,

ఆ. వె. రొట్టెవలన నర్థి ♦ పొట్ట నిండునె కాని
దాత మనసు నిండు ♦ దానివలనఁ
బ్రతిఫలంపుఁ బళ్లె ♦ రపు దీప్తిచే దివ్వె
వేయిరెట్లు కాంతి ♦ వెల్గుఁగాదె?

గీ. ధనము పెదప్రోగు గాఁగల ♦ జనుఁడు సుఖియె?
నందఱను దాన సుఖపెట్టు ♦ నతఁడు గాక;
చందనపుముద్ద నెదఁబూన ♦ సౌఖ్యమిడునె?
యొడలికంత పూసికొనఁగ ♦ నొసఁగు సుఖము.

(నేపథ్యమున) ధనము లేనివాఁడు పరోపకారమెట్లు సేయఁ
గలఁడు?

బుద్ధ—సోదరుఁడా! చెప్పుచున్నాను. నిన్ను నీప్రక్కనున్న బలాఢ్యుఁ
డు లెంపపైఁ గొట్టఁబోవఁగ, వాని ప్రక్కనున్నవాఁడు వానిన
ట్లు సేయకుండఁగ నివారించెననుకొనుము. అట్టిచో నీకుపకార
మిప్పుడు ధనమువలనఁ గలిగినదా?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—దేనివలనఁగలిగెను?

(నేపథ్యమున) బలమువలన—

బుద్ధ—దుష్టప్రవర్తనమునఁ బాడైపోయిన జనుల నొక్కఁడు సుబోధ
మున సత్ప్రవర్తకులఁ జేసె ననుకొనుము.

ఆనం—ఇది ప్రత్యక్షముగ జరుగుచునేయున్నది. కావున మనసులో న
నుకొనవలసిన పనిలేదు.

(నేపథ్యమున) అట్టివాఁడు పరమమహోపకార పారీణుఁడు.

బుద్ధ—ఇచ్చట పరోపకారము దేనివలనఁ గలిగెను?

(నేపథ్యమున) జ్ఞానమువలన—

బుద్ధ —ధనమేకాక?

(నేపథ్యమున) బలజ్ఞానములు కూడ నందులకు సాధనములు.

బుద్ధ—కావున,

గీ. త్యాగి ప్రాణమునకు సుఖ ♦ దానమిచ్చు
బలసహితుఁడాపదలఁ బాపి ♦ ప్రాణమిచ్చు
సత్యబోద్ధ ప్రాణాధిక ♦ జ్ఞానమిచ్చు
నందుచే ధర్మదానంబె ♦ యధికతమము.

సోదరులారా! ఇంతవఱకుఁ బరోపకారములో నొక్క మైత్రిభాగమును జెప్పితిని. రెండవదేదియో జ్ఞప్తియున్నదా?

(నేపథ్యమున) లేకుండుట కూడనా? జనులకుఁ దనవలన నేబాధయు లేకుండునట్లు జనుఁడు ప్రవర్తించుకొనుట.

బుద్ధ—దీనిపేరేనీతి; ఇది పూర్ణముగ బోధింప నాలన్యమగును గాన మఱియొకప్పుడు చెప్పెదను. ఇఁక నైదవదియగు సమ్యగ్జీవనము సమ్యక్కర్మమునకు ఫలమేకదా? సోదరులారా! కటికవానివృత్తిని జేసికొనఁదగునా?

(నేపథ్యమున) హింసాయుక్తమగుటచేఁ గూడదు.

బుద్ధ—ఉపాధ్యాయవృత్తిఁ జేసికొనఁదగునా?

(నేపథ్యమున) అద్దే! అదిమంచిది.

బుద్ధ—ఎందుచేత? యశుఁడా!

యశు—సర్వదానములలో జ్ఞానదానముత్కృష్టమని బోధించితిరి కాన—

బుద్ధ—వర్తకము చేసికొనఁదగునా? ఆనందుఁడా!

ఆనం—తగదు.

బుద్ధ—ఎందువలన?

ఆనం—అందువన మోసమునకుఁ బ్రోత్సాహము లెక్కువగలవు.

బుద్ధు—అట్లే. అదికొందఱి యెడల నిజమే.

గీ. చేతఁదులకాని తులలేదు ♦ చిత్తమందు
నోరుకొలపెచ్చు మఱికొల ♦ సేరుపిచ్చి
బుట్టదూనికలబరువు ♦ బుద్ధిలఘుత
గలుగువణిజుఁడు మోసాల ♦ కలుగుగాదె?

మోసముతోఁగూడిన యేజీవనాధారమునైన నరుఁడువరిగ్రహింప దగదు.

గీ. మట్టికుంకుమ వేపాకు ♦ పుట్టతేళ్ల
బెడ్డకాసులఁదినుచు జీ ♦ వింపఁదగదు;
పడఁతిమగలకు నఱిచేతఁ ♦ గడుపుచెప్పి
తనకడుపుబాధఁ దొలఁగించు ♦ కొనుటతగదు.

(నేపథ్యమున) ఇంద్రజాలవిద్యవలనను సాముద్రికమునను జీవింప దగదని తెలిసినది. ఇంకను దగనివృత్తులేమో సెలవిచ్చెదరుగాక!

బుద్ధు—గీ. ఎదుటిబోడి మునుగులోన ♦ నింకముందుఁ
గలుగుకార్యఫలము మూట ♦ గట్టఁదగదు;

(నేపథ్యమున) శకునఫలములఁ జెప్పి జీవింపఁగూడదనియా మహాత్మా!

నింగిపై పెద్దచీపురు ♦ నేలతేండ్లఁ
దుడిచిపెట్టునం చెప్పాడు ♦ నుడువఁదగదు.

(నేపథ్యమున) దుర్నిమిత్తములు జెప్పాటువలన జీవింపఁగూడదని కాఁబోలు!

బుద్ధు—ఆ. వె. ఎలుకబట్టఁ గొఱుక ♦ మృతినరుగొంతును
గొఱుకుననుచు రొట్టెఁ ♦ గొఱుకవలదు;

(నేపథ్యమున) హే హే హే! ఇదివఱకిట్టి గ్రుడ్డినమ్మకముతో నేడ్చినవారమే.

బుద్ధ— బ్రహ్మరాక్షసినిని ♦ బాతర వేయించి
యవలపాతరఁ బడ ♦ యంగఁదగదు.

ఆ. వె. తేలుకొండిబాధఁ ♦ దీర్తునుష్ణానమునఁ
దృష్ణకుట్టుబాధఁ ♦ దీర్పఁదగదు;
సర్పవిషముదింపఁ ♦ జాలుదుననిరోగి
నిలకుదింపమంత్ర ♦ మేద్వఁదగదు.

(నేపథ్యమున) ఆహాహా! ఇట్టిమోసగాండ్రు లోకమున నెంత రున్నారో! వారందఱకుఁగూడ మీబోధగలిగి యెప్పుడు జ్ఞానవంతు లగుదురో!

బుద్ధ—గీ. శనియొకనియింట వక్రించె ♦ ననుచు నొకని
యింట బ్రత్యక్ష శనిగవ ♦ క్రింపవలదు;
దొడ్డిద్రవ్యనిక్షేపంబు ♦ దొఱకుననుచు
నొకనియిలుఁ ద్రవ్వియింటఁ బో ♦ సికొనఁదగదు.

గీ. మృతునిజుట్టాలుశోకవ నం ♦ టించిమింటి
కాతనిని దోలియింటికి ♦ నావ్వఁదోలి
రొంటదక్షిణ, సిగ్గును ♦ మంటఁ, బెట్టి
శల్యపరమాన్నము భుజింపఁ ♦ జనదుచనదు.

గీ. జీల్గుకల్లుశక్తికినట్టి ♦ చేయిఁద్రిప్పి
యిట్టినోరుతాటించి జీ ♦ వింపవలదు;
గవ్వకన్నులకాటుక ♦ కరముగూర్చి
వెఱ్ఱికన్నులఁగాటుక ♦ వేయఁదగదు.

(నేపథ్యమున) ఇది అంజనమువంటి యింద్రజాలము కాఁబోలు!

బుద్ధ—గీ. స్థానముననుండి మస్తకా ♦ ల్జారెననుచు
మస్తకముజాఱినట్లాడి ♦ మలగఁదగదు;

(నేపథ్యమున) ఇది యశ్వశాస్త్రపాండిత్య ప్రభావముకాఁబోలు!

తనకషాయమురోగి గొం ♦ తునను రోగి
గంజితనగొంతునను, నగు ♦ గడనతగదు.

(నేపథ్యమున) ఆహా! ధర్మవైద్యమే చేయవలయునుగాఁబోలు!

—గీ. రాగిబంగారమును జేయు ♦ యోగిననుచు
గబ్బిలాలఁజావుచు బ్రబను ♦ కంగఁదగదు;

యశు—ఆనందా! రసవాదశాస్త్రమనునది యిదేనా?

ఆనం—(తలయూపును.)

బుద్ధ— మనుజపతులచేతుల సీస ♦ మూలఁ బెట్టి
మెడలబంగ్గారుమాలలఁ ♦ బడయఁదగదు.

(నేపథ్యమున) అయ్యో! అయ్యో! కవితాప్రవృత్తిగూడ ననర్థమైనదా?

యశు—కాదా! వారినవరత్నములు కుత్సితములుకావా? వారినక్షత్రమాలికలు దివారాత్ర ప్రకాశకములుకావా! వారిచంపకోత్పలమాలికలు నీరుపోసిపెంచని లతలవికావా! వారిస్తోత్రపాఠములు విననాకుఁబరమాసహ్యము! నాలుగుపాదములఁ బృథ్వినిమడఁచి నాచేతిలోఁబెట్టి నాల్గుపుట్లపృథ్వి నొక కవినాయొద్దనుండి లాగుకొనినాఁడు. కవులుమోసగాండ్రు కాకేమి?

బుద్ధ—నాయనా! కవులనుమోసగాండ్రనుచుదూషింపఁబోయిబుద్ధిహీనుఁడవని నిన్నునీవు దూషించుకొనుచున్నావు. ఇఁకను దత్ప్రశంసవలదు. ఇదివఱకుసమ్యగ్దృష్టియేదో చెప్పితిని. క్లేశనాశనచిత్తశాంత్యాదిరూపకనిర్వాణమేసర్వావధిఫలమని చెప్పితిని గాదా? అట్టిఫలసంగ్రహముల కివివఱకెన్ని సాధనములఁ జెప్పితిని?

ఆనం—సమ్యగ్వాక్కు, సమ్యక్కర్మము, సమ్యగ్జీవనము లేక సమ్యగ్వృత్తి.

బుద్ధు—ఈమూఁడునుగాయిక సాధనములు. ఇఁకమూఁడు మనస్సాధనములున్నవి.

యశు—మహాత్మా! అవి యేవి?

బుద్ధు—సమ్యగ్వ్యాయామము; సమ్యక్స్మృతి; సమ్యక్సమాధి. సోదరులారా!

(నేపథ్యమున) అయ్యా! మహాత్మా! అయ్యా! మహానుభావా!

బుద్ధు—మీరు వినుచున్నారుకదా!

(నేపథ్యమున) అద్దే! అద్దే!

బుద్ధు—సంతోషమే. వినుచున్నప్పుడు మీమనస్సులుకోళ్లపంజెముల పైకిఁ గొక్కోకశాస్త్రముపైకిఁ బోవునెడల మీవినుటవలని ఫలమున్నదా?

(నేపథ్యమున) మహానుభావా! ఎంతమాట! మామనస్సులను బరిశుద్ధిచేసికొని మీపాదములపైఁగట్టిపెట్టిముఱివినుచున్నాము.

బుద్ధు—మనస్సులనంత శ్రమపెట్టి యేలవినవలయును?

(నేపథ్యమున) మాకేమియుబాధలేదు. అట్లువినినఁ గాని వినిన ఫలమేమున్నది?

బుద్ధు—కావునమనశ్శుద్ధియు మనస్స్థైర్యమును లేనికార్యము నిష్ఫలమేకదా!

(నేపథ్యమున) ఓ ఓ! సందేహమేమి?

బుద్ధు—మీయొడలు మురికియగునెడల పరిశుద్ధులెట్లుకాఁగలరు?

(నేపథ్యమున) గంగలోమునిఁగినయొడలనన్నిమైలలెగిరిపోవును!

బుద్ధు—మనసులోని మురికినిగూడ గంగోదకముల్లిగరఁ గొట్టఁగలదా?

(నేపథ్యమున) ఆసీటితో నాపప్పుడకదు.

బుద్ధు—ఉన్మత్తుఁడొక్కఁడు వీథిని నిరంకుశముగఁ దిరుగుచుండ వాని నేమి సేయుదురు?

(నేపథ్యమున) కాలుసేతులుగట్టి పడవైతుము.

బుద్ధు—అట్లు చేసిన యెడల—

(నేపథ్యమున) నిశ్చలుఁడై యొకచోటఁ బడియుండును.

బుద్ధు—మనోనిశ్చలతగూడ నూల్త్రాళ్లతోను బీఁగగొలుసులతోడను సిద్ధింపఁగలదా?

(నేపథ్యమున) హే హే! అట్లు సిద్ధించునా? మహాత్మా! మహాత్మా!

బుద్ధు—సోదరులారా! ఏల? ఏల?

(నేపథ్యమున) మనశ్శుద్ధిస్థైర్యము లెట్లుకలుగునో దయచేసి చెప్పరా?

బుద్ధు—చెప్పుచునే యుంటినిగదా? అందుకొఱకే మానసిక సాధనములు కావలయునని చెప్పితిని. వానిలో మొదటిది సమ్యగ్వ్యాయామము. ఆనందుఁడా! నీకు మధురపదార్థమిష్టమా? కటువిష్టమా?

ఆనం—మధురపదార్థము.

బుద్ధు—అదేపనిగ విశేషముగఁగలకండను నీవు తినినయెడల నారోగ్యవంతుఁడవై యుండఁగలవా?

ఆనం—ఉండలేను.

బుద్ధు—ఉండక,

ఆనం—ఉదరక్రిమిచే బాధపడుదును.

బుద్ధు—అట్టి క్రిమిని హరించుట కర్తవ్యమేనా?

ఆనం—ఔ.

బుద్ధు—మోదుగమాడనుమాత్రఁ జేసి వేసికొందువా?

ఆనం—ఔ.

బుద్ధ—అప్పుడారోగ్యమును గాంచఁగలవా?

ఆనం—కలను.

బుద్ధ—కడుపునొప్పి వచ్చినపిమ్మట నొప్పిని హరించుట కర్తవ్యమా? మొదలే రాకుండఁ జేసికొనుట కర్తవ్యమా?

యశు—రాకుండఁ జేసికొనుటయే మంచిదికాదా?

బుద్ధ—ఏమిచేసిన రాకుండఁ జేసికొనుట సిద్ధించునో చెప్పఁగలవా?

యశు—కడుపునొప్పికిఁ గారణమగు పంచదారను దినకుండినయెడల—

బుద్ధ—దానియందు రాగమున్నంతకాలము దానినిదినకుండుట యెట్లు సంభవించును?

ఆనం—కావున రాగమునే హరింపవలయును.

బుద్ధ—ఇటులే ద్వేషమునుగూడ హరింపవలయునుగాదా?

యశు—హరింపవలసినదే!

బుద్ధ—గీ. ద్వీపసప్తకముండి పై ♦ ద్వీపమునకు
వాంఛగనురాజు; నిత్య ని ♦ ర్భాగ్యయుక్తుఁ
డింత గోచినాకేలని ♦ కొంతచింపి
పరునికొసఁగు; నతఁడునిత్య ♦ భాగ్యయుతుఁడు.

గీ. ఇతఁడు నాశత్రుఁడితని శి ♦ క్షింతుననుచు
నతని నడఁచి త్రొక్కెడునాతఁ ♦ డత్యధముఁడు;
అందఱకు నేనుదాసుఁడ ♦ ననుచు శిరము
నవనతము సేయునాతఁడే ♦ యత్యధికుఁడు.

కావున?—ఆనందా!

ఆనం—రాగద్వేషములకు లో బడనివాఁడే మహాఘనుఁడు.

(నేపథ్యమున) అద్దే! అద్దే!

బుద్ధ—గీ. పైఁబడి పులినడఁచువాఁడు ♦ బంటుకాఁడు;
పరులనెల్ల గెల్చినవాఁడు ♦ బంటుకాఁడు;

లోనబాధించు వైరుల ♦ లోనుగాక
వాని నిర్జించువాఁడెపో ♦ బంటు; బంటు!

గీ. రామరావణ రణమది ♦ రణముకాదు;
ప్రబలభారత రణమది ♦ రణముకాదు;
రవము, సెగ, తెంపులేని యీ ♦ ర్ష్యాళిములఖిఁ
రంగి ప్రేటులదాగుండె ♦ రణమెరణము.

గీ. ఎదుటి వీరు గుటిచి భయ ♦ మేమికలుగ
దింటికి ప్రతిమారి గుతిచి ♦ యెంతో భయము
సమరయోధు క్షత్రికిరాజు ♦ జడియఁ; డైన
వంట వానిచే గరిటకు ♦ వడకుఁజెందు.

గీ. ఇతరు లరులెకారింట జ ♦ న్మించువారె
ఖరతరాన్యోన్య శత్రుత్వ ♦ గరిమఁగాంత్రు;
జలములోఁ బుట్టువహ్నియే ♦ జలముగాల్చు;
నట్టినీరమెంచహ్నిఁ జ ♦ ల్లార్పఁజూచు.

కావున మనసు నందుఁ బుట్టిన యరిషడ్వర్గమును మనసే నిర్జింప వలయునని చెప్పుచున్నాను.

(నేపథ్యమున) మహాచార్యోత్తమా! ఆమార్గమును బోధించె దరుగాక!

బుద్ధ—సోదరులారా! మీలో నొకనికి వారకాంత యింటికిఁ బోవల యునని బుద్ధి పుట్టియున్నది.

(నేపథ్యమున) అట్లుపోవు బుద్ధి మాలో నందఱకు నశించినది.

బుద్ధ—పోవు బుద్ధినశించి యుండునుగాని యనుకొనను బుద్ధి నశింపలే దుగదా! అట్లు పుట్టినదనుకొనుఁడు.

(నేపథ్యము) చిత్తము.

బుద్ధ— అట్టిచింత మానుకొనఁదగిన దేకావున నప్పుడేమిచేయవలసినది

నంగ—అట్లుపోయినందువలన గలుగునష్టములు—బలనష్టము
స్వాతంత్ర్యనష్టము—బుద్ధినష్టము—ఆరోగ్యనష్టము—ద్రవ్య
నష్టము—కీర్తినష్టము మొదలగు నష్టములఁగూర్చి గాఢము
గమనము నాలోచించుచు కొనవలయును. శాశ్వతములగు
నీనష్టములు ఘనములో నీచతుశ్శోకముగు వేదనానిస్తుకి ఘనమో
మనసున: దూరముకొనవలయును. తరువాత — జలతారు
కోకలను బాలకొప్పుల నొకసమునము దూరముగఁబెట్టి కా
షాయములు బోడితలలుగల భిక్షుకులయొద్ద సత్కాలక్షేపము
నుఁ జేయునెడలఁ గలుగులాభములను మనసులోబాగుగ యో
జించుకొనవలయును. అప్పటికిని మనసింక దుష్టచింతపైకే పో
వుచుండునెడల నల్పమైన దేహపరిశ్రమను చేయవలయును.

ఆనం—హఠయోగాదుల నిరసింపవలయునని యానతిచ్చి యిప్పుడు దే
హపరిశ్రమ మనుచున్నారేల? నాకుబోధముకాలేదు.

బుద్ధ—ఆనందా! పొరలి పొరలి దుఃఖమువచ్చుచున్నవాఁడు శీతోదక
స్నాతుఁడైనెడల—

ఆనం—కొంత దుఃఖశాంతిఁ బొందఁగలఁడు.

బుద్ధ—కోపము తీవ్రముగవచ్చినవాఁడర్ఘ్యులుచ్చారణము చేయునెడల?

ఆనం—కోపమడఁగును.

బుద్ధ—అటులే దుష్టచింతగలవాఁడు కొంతసేపట్టొట్టు నడయాడుటయో
గుఱ్ఱమెక్కి గాఢస్వేదపూర్ణుఁడగువఱకు వ్యాయామము చేయు
టయో మహాత్ముల చరిత్రములు చదువుట చదివించి వినుట
యో మఱియేటులో యుచితమైన దేహాపుఁబట్టుచేత మనస్సు
తిక్కమఱలించునెడలఁ దచ్చింత వెంటనే నశించును. అట్లు కలి
గినప్పుడెల్ల నిట్లే దీక్షతోఁ జేయునెడల దుష్టచింతలు తొలఁగి
పోవును. అవి తొలఁగినవెంటనే వానికిఁ గారణములగు దుర్గుణ

ములు నశించును. దుర్గుణములవలన దుష్టచింతలు కలుగునా దుష్టచింతలవలన దుర్గుణములుగలుగునాయని దూరమాలోచింపనక్కఱ లేదు.

గీ. దుష్టచింతలఁ గలుగును ♦ దుర్గుణములు;
దుర్గుణంబులఁ గలుగును ♦ దుష్టచింత;
కొండనాలుక ప్రాలిన ♦ గొంగలిగించుఁ;
గానఘనమైన కొండనా ♦ లుక్కయును ప్రాలు;

దుష్టచింతలు దుర్గుణములు నశించువెంటనే తత్కారణమగు న హిపట్కము బలహీనముకాక తప్పదు.

గీ. లోనికాజ్యైర్పశూలకు ♦ బైననావ
పట్టుమిరియాలధృతికిఁదో ♦ ప్పడదెకొంత?
లోనినరముల బలిమికిఁ ♦ బైనిమర్ద
నంబు విషముష్టిధృతికిసా ♦ యంబుగాదె?

నాయనా! «బడలెల్ల విరిసినతామరకొలఁదు వైద్యము చెప్పినాఁడఁట. అందినంతవఱకుఁ దానే గోకికొనవచ్చుననియు నందకపోయి నప్పుడట్లకఱ్ఱతోగోకి కొనవలసినదనియును»,—
కొంచెము హెచ్చుతగ్గుగ నట్లే యోపికయున్నంతవఱకు దన్ను దానే కొట్టుకొనవచ్చుననియు నోపికతగ్గినవెనుక నొరునిచేఁగొట్టించుకొనవలసినదను యోగమును నేను చెప్పితినని నీవు తలంచితివా?

ఆనం—చిత్తము. ఇప్పుడు తెలిసినది.

బుద్ధ—గీ. ఇంద్రియము లెన్ని బాధల ♦ నిడినఁగఠిన
యత్నమున మది చాసిపై ♦ నాడవలయు
నేటిమున్కల గణియింప ♦ కీదువాఁడు
క్రమముగానది నదిదాఁటు ♦ కరణిగాఁగ.

గీ. పాపచింతలు వ్యాయామ ♦ పటిమఁబోవ
నపుడె చిత్తము పరిశుద్ధి ♦ నందఁగలదు;
పుడుగులును మన్నుఁగలసీట ♦ బొగ్గునిసుక
నై చివడికట్ట నీరు శు ♦ భ్రంబుగాదె?

ఇంద్రియముల నడఁచుపూనిక గల్గుతోడనే చిత్తమునకుఁ జాంచల్యమువదలి స్థిరత్వము కలుగును. సోదరులారా! వినుచున్నారా?

(నేపథ్యమున) చిత్తము. చిత్తము.

బుద్ధు—మీకు మనన్సు నేఁ జెప్పుదానియందు లగ్నమగుచున్నట్లున్నదా?

(నేపథ్యమున) ఏలమహాత్మా! అట్లడుగుచున్నారు?

బుద్ధు—ఏలన—

గీ. తల్లికాకిపిల్లకు సంస్కృ ♦ తముసఁ గూయు
స్వకలరీతులు బాలకు ♦ నకు రుచించుఁ;
జెక్కుగుంటలుమామిడి ♦ చిగురుమంట
లాలిమగలజంటలును యు ♦ వాలిఁగఱచు.

గీ. కనుపపుల్లకిరకిరలు ♦ కత్తితునుక
పరపరలుకుమారునిమది ♦ గఱగఁ జేయుఁ;
దలలు "బోడులు" కడుపు "మా ♦ దులును గొంప"
"పాడులు" ను వృద్ధజనునకు ♦ వేడుకగును.

గీ. వనికిఁజనిసతిఁగనిపురిఁ ♦ బడినుఖంచె
ప్రభువరుఁడను శృంగార రూ ♦ పకమెయిద్ది?
ఉన్నసతిసౌఖ్యములరోసి ♦ యున్నయూరు
దాఁటిపొమ్మను తల్రకిందు ♦ నాటకంబు

గీ. మాయలున్నపల్కులెనరు ♦ మదికినెక్కు;
చాయలున్నకత్తులె ఝొషల్ ♦ దూయఁజాలుః

మాయచాయలు లేని యీ ♦ మాటలెల్ల
పడుచువారలమది కెక్కు ♦ భ్రాతలార!

యశు—ఆచార్యోత్తమా! మేముపడుచువారమయ్యు సమస్తవ్యసనాను భవపాంశిత్యమునవృద్ధుల మైయున్నాము. కొలఁదికాలములో మేము తిరిగిన తిరుగుడు లింతనిచెప్పఁగలమా? అవియమితములగుచే మామొగము లిదివఱకే తిరిగియున్నవి.

బుద్ధ—ఆసంగతి నీమొదటిమాటవలననే గ్రహించి నీవింక బాగుపడుదువని నేననుకొంటిని.

యశు—అదియేమోనాకు జ్ఞప్తి లేదు.

బుద్ధ—"దానితో మాటలాడఁ దలఁచితినిగాని యిఁకదాని మొగము చూడ నాకసహ్యముగనున్నది" యని నీవాడుతోడనే నీనడతలోఁ బ్రశస్తమగు మార్పుకలుగుటకిదియే యదనుగదాయని నేనుసంతోషపూర్వకముగ గ్రహించి—

ఆనం—అందులకా మహాత్మా! మీరప్పుడు మందహాసము చేసినారు? నాకిప్పుడు కారణము బోధపడినది.

బుద్ధ—నిన్నక్కడకు రమ్మని యానందునిచే వార్తనంపితిని.

యశు—ఆహాహా! దీనులయెడ గురువులవారి నిష్కారణకరుణాకటాక్షము!

(స్వగతమున) సందేహమేమి? అధోగతులపాలగుచున్న ముద్ధరింపఁబడినారము.

బుద్ధ—నేను మహానుభావుఁడనని నన్ను స్తుతించువాఁడు నాకుమిత్రుఁడు కాఁడు. నేను బోధించినదానిని గ్రహించి యితరులకు బోధించువాఁడు నాకుఁ బరమమిత్రుఁడు. నేను దుర్మార్గుఁడనని బుద్ధిహీనుఁడనని నన్నెవ్వఁడైన దూషించిన నేను బరితాపమొందను. పూర్వాపరములు గ్రహింపకుండ నామతమును దూషిం

చు వానిని గూర్చి నేను బహుతాపమొందెదను. కావున నన్నుఁ బెద్దసేయక నామతమును బద్దుచేసి యింకఁ జెప్పఁబోవునదే దో వినుఁడు.

(నేపథ్యమున) అద్దే! అద్దే! సిద్ధముగ నున్నారము.

బుద్ధు.—సమ్యగ్వ్యాయామము తరువాతిది సమ్యక్స్మృతి. దుష్టవాంఛల ను వదలి మనస్థిరత్వమొంది సద్వాంఛలచే మనశ్శుద్ధిని పొంది నపిమ్మట యథార్థజ్ఞానమొందవలయును.

ఆనం.—అదియేదో సెలవిచ్చెదరుగాక!

బుద్ధు.—గీ. కార్యకారణ సంబంధ ♦ గరిమకాయ
నై జగతిచిత్త వేదనా ♦ నైజములును
వస్తు సముదయాన్యోన్య సం ♦ బంధగరిమ
బాగుగా గ్రహియించుటే ♦ ప్రజ్ఞనుండి.

గీ. అఖిలజగతి హేతు ప్రత్య ♦ యమునఁ బుట్టి
నాత్మమిథ్య ద్రవ్యముల ని ♦ త్యములు గుణ వి
తతియె యెఱుఁగంగఁ దగినది ♦ దానిక్రింద
గుణి మనము లేనియట్లెంచు ♦ కొనఁగవలయు.

గీ. ఇదియె యాథార్థ్య విజ్ఞాన ♦ మిద్దిలేక
పోవుట యవిద్యతన్మ మనః ♦ పూర్ణవివిధ
సర్వబాధ లవిద్యచే ♦ జన్మమొందు
జ్ఞానమేనుండి మోక్షైక ♦ సాధనంబు.

గీ. జ్ఞానమునకు నీతియె ముఖ్య ♦ సాధనంబు
కాని నీతిచేతనె ముక్తి ♦ కలుగదెపుడు
నీతి విజ్ఞానమునకుఁ గ్రిం ♦ దిదగు మెట్టు
నీతిజ్ఞానదూరంబైన ♦ నీతికాదు.

ఈసంగతులనే సవిస్తరముగ వైదేహాత్మ తత్త్వోపన్యాసములఁ

నేఁబుఁ దలఁచితినిగాన నిచ్చట సంక్షేపముగఁ జెప్పితిని. దీనిత గువాతిసనఁగ నెనిమిదవదియుఁ గడపటిదియు నగుశీలము, సమాధి, లేక ధ్యానము, నేమైన నొకయంశము దెలిసినవాఁడు దానిని బాగుగ మనసునఁ బట్టించుకొనుటకుఁ బలుమరు పఠించురీతి నిదివఱకు సప్తాంగములవలనఁ గలిగినఫలమును స్థిరపఱచుటకై ధ్యానమావశ్యకము.

ఆనం—ఈధ్యాన స్వభావమెట్టిది? మహాత్మా!

బుద్ధ—సర్వధర్మ సుఖాక్రాంతతయే సమాధి. అహంభావవిసర్జనము, ఆత్మవిజ్ఞానము, సర్వవస్తు యథార్థజ్ఞానము, సర్వ జగదేకీభావజ్ఞానమువలనఁ గలుగు నిశ్చలానందస్థితియే సమాధి.

యశ—ఈసమాధియందుస్మృతి బుద్ధి వికాసములుండునా?

బుద్ధ—నేనుపదేశింపఁబోవు సమాధికిని మతబోధకులయందును యోగులయందును దఱుచుగ మనము చూచుసమాధికిని భేదమున్నది.

ఆనం—ఉపదేశింతురుగాక.

బుద్ధ—ఒకనిని దదేకదీక్షగా ఘల్లని జుక్కనొకదానిని జూడఁ జేయునెడల నేమగును?

ఆనం—ఆతనికొక విధమగు పరవశత గలుగును.

బుద్ధ—దీనికిని యోగుల సమాధికి నేమిభేదమున్నది?

ఆనం—లేనట్లే కనఁబడుచున్నది.

బుద్ధ—క్షురకులు సామాన్యముగ జనుల యొడల్లు పట్టునపుడు మెడమీఁద బింకముగ నొకపట్టు పట్టినయెడల నేమగును!

ఆనం—నిద్రవంటి పారవశ్యము సిద్ధించును.

బుద్ధ—దీనికిని యోగుల సమాధికిని భేదమేమి?

ఆనం—ఏమియున్నట్లు కానఁబడదు.

బుద్ధు—యశుండా! మఱియొకమాట. ఆనందునికంటె నీవు బాగుగఁ దెలిసియుందువు. విరహులకు నిశ్చలకామచింతావ్యాపారమున మూర్ఛగలుగుట చూచితివా?

యశు—చిత్తము.

బుద్ధు—అది దేనివలనఁగలిగియుండునో తెలిసికొంటివా?

యశు—లేదు.

బుద్ధు—అది గుహ్యాంగములందుఁగలిగిన తీవ్రతచేఁ గలిగినది.

ఆనం—అలాగా!

బుద్ధు—ఇట్టిదానికిని యోగులసమాధికిని భేదమున్నదా?

ఆనం—లేనట్లె యున్నది.

బుద్ధు—ఇవియన్నియు దేహవికారములే. జ్ఞానశూన్యావస్థలే. నిష్ఫలములే. అందుచేనివ్యన్నియు త్యాజ్యములే. ఇఁకనీసమాధిలోఁ జతురవస్థలున్నవి. మొదటిది విజనస్థలమున బహిరంతః పరిశీలనమువలనఁ గలిగినమోదము. రెండవది హేతుబంధశూన్యముగ, తత్పరిశీలనమువలన గలిగిన యాంతరగభీరత, యాంతరప్రసన్నత, యాంతరోత్సాహము. ఇఁకమూఁడవది రాగద్వేషసంపూర్ణాభావము. నాల్గవది, అవర్ణ్యానుభవైక వేద్యనిశ్చలానందము.

(నేపథ్యమున) భక్తులమూర్ఛలు మొదలగునవన్నియు టక్కులేనా?

బుద్ధు—కావచ్చును. కాకపోవచ్చును.

(నేపథ్యమున) మాకుబోధము కాలేదు.

బుద్ధు—డప్పు తీవ్రముగ వాయించిన మొదల నొక్కొక్కపిత్తదేహికి స్మృతిపోవును. ఇది దొంగతనమని చెప్పవచ్చునా?

యశు—తగదు.

బుద్ధు—మీఁదచుంచు ప్రాఁకిన నొక్కస్త్రీమూర్ఛనొందును. ఇది దొంగతనమగునా?

ఆనం—కాదు.

బుద్ధ—ఆకస్మికముగ భయంకరమగుధ్వని నొకఁడువినినప్పుడు పరవశుఁడగును. ఇట్టియవస్థ దొంగతనమునఁ దెచ్చుకొనినదా?

యశు—కాదు.

బుద్ధ—ఏదియోయొకరూపమును దదేకదృష్టిగఁ జూచిచూచి భక్తుఁడు మూర్ఛజెందును. ఇదిదొంగతనమగునా?

ఆనం—కాదు.

బుద్ధ—ఇవియన్నియుఁ గేవలతనువికృతులు. ఈవికారములతో మన స్సున కెంతమాత్రము సంబంధము లేదు. నిద్రయెట్లో మరణ మెట్లో యివియు నంతే. ఇట్టితత్వము నెఱుంగ లేక మూఢులగు జనులిట్టి తనువికృతులు భగవత్ప్రేరేపణమువలనఁ గలిగినవను దురభిప్రాయమును బుట్టఁజొచ్చిరి. అప్పటినుండి దొంగతనము లారంభములైనవి. అందు చేఁగావచ్చునని కాకపోవచ్చునని చెప్పితిని. ఇతరమతముల కన్నిటికిభూషణములగు నీమర్మికారములు బుద్ధమతమునకుఁ బరమానింద్యములు. కేవలజ్ఞానావస్థయే స్వమాధ్యవస్థ. జ్ఞానమేనిర్వాణసాధనము. దీనినిగూర్చికూడ ముందు సవిస్తరముగఁ జెప్పెదను. అష్టాంగశీలమనునదియిదియే. సోదరులారా! శ్రమమునిచ్చితిని. ఆలస్యమైనది. ఇఁక మీరు మీ యిండ్లకుఁ బొండు.

(నేపథ్యమున) ఇంకనిండ్లా! ఇఁకేదమయాశ్రమమే మాగృహము.

యశు—(సాష్టాంగపడి) కటాక్షించి బుద్ధభిక్షుకునిగఁ జేయ వేఁడెదను.

బుద్ధ—భిక్షుకుఁడవే కావలయునన్న మాట లేదు. సంసారివైయుండి కూడ నీమతమవలంబించ వచ్చును.

యశు—వలదు. మహాత్మా! వలదు. ఈక్షణమున నేనుసన్యాసి న య్యెదను. కటాక్షింపుము.

బుద్ధ—ఆనందా! నీయొద్దనున్న శాటియేది? (యశునికిచ్చి) యశుఁడా! నిన్ను భిక్షుకునిగ బుద్ధసంఘమునఁ జేర్చుకొంటిని.

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా! మహాత్మా మహాత్మా
మహాత్మా! (కేకలు)

బుద్ధ—మీరు బుద్ధసంసారులగుదురా? బుద్ధభిక్షుకులగుదురా?

(నేపథ్యమున) సంసారములు చాలకాలమేడ్చితిమి. వానివన తెలి
సినది. మాకు సన్యాసము; సన్యాసము! దయచేయుఁడు.

బుద్ధ—ఇదిగో! అట్లువచ్చి మిమ్ము బుద్ధమతమునఁ జేర్చుకొందును.
మీరు యేఁబదిమందురా?

(నేపథ్యమున) యశునితో నేఁబదియైదుగురము.

బుద్ధ—ఇదివఱకుఁ గౌండిన్యాదులైదుగురు శిష్యులున్నారు.

ఆనం—నేనుగాక యరువదిశిష్యులున్నారు.

బుద్ధ—యశుఁడా! మీరు ప్రక్కయాశ్రమమునుండుఁ కౌండిన్యాది
పంచకమును గలిసికొని దిక్కొకటికిఁ బదునేనుగురు చొప్పున
నాల్గుదిక్కులకుఁబోయి యీమతమును వ్యాపింపఁజేయుఁడు. మీకు
శిష్యుడుమిగిల్చినభాగములు రాత్రిచెప్పెదను. రేపటియుదయ
మున నే పోయి లోకోద్ధరణార్థమై పాటుపడుదును.

యశు—అనుగ్రహింపఁ బడితిని.

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా! బ్రదికితిమి. ఉద్ధరింపఁ
బడితిమి. రండు. రండు. మాకుసన్యాస మిప్పింపుఁడు. వేగ
రండు. మాకు మహోత్సాహముగ నున్నది.

బుద్ధ—ఆనందా! నీవునాయొద్దనుండుము. సోదరులారా! వచ్చుచు
న్నాను. మీరు సంస్కృతముతోఁగాక దేశభాషలలోనే యతి
సులభమగు శైలితో జనులకుమృదువుగ బోధింపవలయును.
ఇదిగో! సోదరులారా! వచ్చుచున్నాను.

(అందఱునిష్క్రమింతురు.)

ఇదితృతీయాంకము.

---

శ్రీ

# బుద్ధబోధసుధ

## చతుర్థాంకము.

—:o:—

### ప్రదేశము—గయ.

ప్రవేశము—గాలవుఁడు, కంఠీరవుఁడు.

గాల—ఏమోయి! కంఠీరవా! నీభార్యకు నెలతప్పినదా యేమి?

కం—గాలవా! నాభార్యకుఁ గాదు. నాకే నెలతప్పినది.

గాల—అదేమిటి?

కం—క్షురకర్మము చేయించుకొని నెలదాటినది.

గాల—అందులకే నిన్ను నే నడిగినాను.

కం—అందులకే నేను జెప్పినాను.

గాల—కాని నీవింతకాలమేల స్నానము లేక యుంటివి?

కం—ఆత్మక్షౌర కాంక్షులము మనుష్యులము గాని యిప్పటివరకిది మంగలిచేతనైన పనియే కాని మనచేతనైనది కాదుగద!

గాల—మనకు మంగలి పందలముకూడఁ గావలయునా?

కం—మంగలి బానిసలు యతిశ్రేష్ఠులైనప్పుడు వారివృత్తి మనమేల చేయఁగూడదు?

గాల—చిట్టచివరకు ఉపాలిగాఁడు? ఊఁ.

కం—ఆ! బుఱ్ఱలు గొఱుగుటమాని నున్నగఁ గొఱిగించుకొనినాఁడు.

గాల—బుద్ధశ్రమణుఁడయ్యెనా?———

కరం—అరణ్య రోజే. దినమున కధమము నూరుమంది పుట్టి తెగిపోవుచున్నవి. ఈ గ్రామమున క్షౌరాలరాయఁడు వచ్చి దశాహస్నానమైనఁగాలేదు. వేయిమందికిఁ బునర్వైధవ్య మిప్పించినాఁడు. ఉదయము మొదలు సాయంకాలమువరకీ కొబ్బరికాయల యొలుపునకు విధివిరామము లేదు. శ్రాద్ధాలమట్టి క్షౌరాలమట్టి యైనది. వెనుకటి దినములలోఁ బిండము లిచ్చుటకు గంగలో నిరంతరము పడినట్టు బోడితలలు గుబుకు గుబుకుమని బుద్ధసంధులోఁ బడుచున్నవి. మంగళ్ల పాలిటి మహాత్ముఁ డవతరించినాఁడు. వాఁడిప్పుడు పిలిచినఁ బలుకుదురా?

గాల—ఈనెత్తికిఁ తలల సంతలో మంగలి దొరుకక పోవుటచేత నా తల పెంచుకొనియున్నావు?

కరం—దొరికినప్పుడుకూడ మానివేసినాను.

గాల—అదేల?

కరం—నేను గూడ బుద్ధ శ్రమణుఁడనగుటకే తన పొది నాశ్రయించితినను కొనిగాని లేక యలవాటుచొప్పునఁగాని తూర్పు పడమరలకు నుత్తరదక్షిణములకు నొక్కొక్కటేసిత క్రింద దిగకొట్టినయెడల—మా మేనత్త కూఁతురు "బావా! నాయంత వాఁడవైతి వా" యని నన్నధిక్షేపింపదా?

గాల—మీ మేనత్త కూఁతురిచ్చటికేల వచ్చినది?

కరం—ఆమె తండ్రియగు పురాణకస్యపునితో వచ్చినది

గాల—కస్యపబ్రహ్మగారేల వచ్చినారు?

గాల—గాయత్రితోడు.

కరం—పురాణకస్యపుఁడేకాఁడు. మక్కలుఁడు, మహాచార్యుఁడు, దేవదత్తుఁడు మొదలగు మతాంతరధ మహర్షులందఱు విచ్చేసినారు.

గాల—అన్యోన్య కలహాయుక్తులగు మీరందఱొక చోట చేరుటయేల?

కం—సర్వమతాలపకులు—బోధిగుండ్లబారు ఫిరంగియగు నీదిక్కుమా లిన బుద్ధమతమొకటి యాకస్మికాగ్ని కొంపలటోపారము లెగర గొట్టినట్లే—పిలకలబారుల నెగరఁగొట్టుచుండఁగఁ గడువుమం టచేత—నెలుకలు కుక్కలు పిల్లులొక్క కలుగులోఁ జెప్పులు కొఱుకుకొనుటకై చేరినట్లున్నది.

గాల—ఇప్పుడు వీరందఱు రహస్యముగ సభ చేయుదురా?

కం—మానుదురా?

గాల—మనము గూడఁ బ్రక్కలనుండి వారి సంభాషణముల వినఁగ లమా?

కం—ఉండనిచ్చుటకు వారికిఁ గన్నులుపోయినప్పుడు మనచెవ్రు లుప యోగింపకుందునా?

గాల—అటులైన నేను సెలవు తీసుకొననా?

కం—సరే. (తనలో) మాకస్య పయ్యమామ యీసరికి సభకై యె దురు చూచుచుండును. ఆతని కూఁతురు నాకొఱకై యెదురు చూచుచుండును.

(నిష్క్రమింతురు)

ఇది విష్కంభము.

---

శ్రీ

# బుద్ధబోధసుధ

## చతుర్థాంకము.

—o:—

ప్రదేశము—గృహము.

ప్రవేశము—పురాణకాశ్యపుఁడు, మస్కలుఁడు, అజితకేశకంబళుఁడు, మహాచార్యుఁడు, దేవదత్తుఁడు.

దే—మహాచార్యస్వామీ! తామూరకున సెలవీయఁగూడదు.

మహా—ఎందుచేతనండీ? దేవదత్తాచార్యులుగారూ!

దే—ఈ పురాణకాశ్యప, మస్కల, కేశకంబళాచార్యులవారునాకు బరమమిత్రులు. అదిగాక మనమిచ్చటకు మతవాదములకై రాలేదు. మనపనియేదో మనముచూచుకొనవలయునుగాదా?

మహా—మనపనియేదో మనమతానుసరణముగనే చూచుకోఁదగినది కాదా?

పురా—మహాచార్యా! మతముమతమని పలుమారందువేల? నీమతమును నీవుబోధింతువు. మామతములను మేముబోధింతుము. నీమతానుసరణము కానిది మామతానుసరణమైనప్పుడేలచేయఁగూడదు?

మహా—అదేమిమాట! ఒకమతమైనను జీవహత్యకొప్పుకొనునా?

దే—మహాచార్యా! ఊరకవాదార్థమైయన్నమాట యథార్థముగఁ బరిగణించుచున్నారేమి? హత్యయెవరికి? తప్పుకాదా?

పురా—మహాచార్యా! ఒకమతమైన జీవహత్య కొప్పుకొనునాయంటి వే! నీవుఛాందస బ్రాహ్మణోత్తముఁడవు. యజ్ఞములలోఁ బశు హత్యఁ జేయుచుంటివా? ఏల?

మహా—అది వేరు. దైవపిత్ర్యర్థముగా హత్యఁజేయవచ్చును. అందుల కువేద మంగీకరించును. హత్యఁజేయబడిన పశువులుఁ గూడ స్వర్గప్రాప్తియగునప్పుడు తప్పేమి?

అజి—అట్లైన నీతండ్రికారీతిగ స్వర్గమిప్పింపక పోయితివా?

పురా—అజితాచార్యా! మీరుండుఁడు. నేనుజెప్పఁబోవునదేదో చెప్పనిండు.

దే—మీరు ముగ్గురుఁ గూడ నొక్కనిముసము శాంతించుఁడు. వాద పూర్వమందొక చిన్నయంశము స్థిరపఱచుకొనవలసియున్నది. పురాణకశ్యపాచార్యా! దేవుఁడున్నాఁడని మీరొప్పుకొందురా?

పురా—ఉన్నాఁడని నేనంగీకరింతును—కాని—తటస్థుఁడు—

దే—ఇఁకఁగానివలదు. మక్కలాచార్యా! మీరుకూడ—ఆస్తికులేనా?

మక్క—ఔను.

దే—అజితగురూత్తమా! మీరో?

అజి—నేను నాస్తికుఁడను.

దేవ—మహాచార్యా! మీరో?

మహా—నేను దైవతత్త్వము నంగీకరించినవాఁడనే.

పురా—సరే. దేవదత్తాచార్యా! మీరో?

దే—ఆస్తికుఁడను. మనమైదుగురిలోనల్వు రాస్తికులు. ఒక్కఁడునాస్తికుఁడు. ఇకను—హత్యవలనఁ బాపమున్నదా? లేదా? ఇది వాదాంశము. పురాణకశ్యపయ్యగారూ! మీయభిప్రాయ మేమి? మీరు సర్వజ్ఞులు. మీరుకానిండు. వాదిప్రతివాదులుచెప్ప నేదో యధికావసరమునఁగాని మూఁడవవాఁడు మాట్లాడఁ గూడదు.

పురా—గీ. బారుచేపలు చిన్న చే ♦ పలనుజంపు;
[గూరపక్షులు బడుగుప ♦ క్షులనుజంపుఁ;
దుష్టమృగములు సాధుజం ♦ తువులఁ జంపు;
బొడుగుపుర్వులు చిన్నపు ♦ ర్వులను జంపు.

గీ. నరుఁడు స్వేచ్ఛగా నక్షగో ♦ చరములైన
[ప్రాణులను జంపుటయెకాక ♦ [త్రాగునపుడుఁ
బీల్చునపుడు కనఁబడని ♦ వేలకోట్ల
జీవములఁ జంపిపొట్టలోఁ ♦ జేర్చుకొనఁడె?

ఇదిగాక—

గీ. రణము లందున బలులుకు ♦ ర్బలుల, గుడిసె
లందుజారులొండొరులఁ, గ ♦ ల్లంగడులను
బాయనేస్తాలు నేస్తాల, ♦ వైద్యమందు
భేషజులురోగులను జంప ♦ వింతగాదు.

గీ. [ప్రాణులన్నియు నన్యోన్య ♦ వధముకొఱకె
యిలనుసృజియింపఁబడెను దై ♦ వేచ్ఛచేతఁ;
[బాణివధదైవసృష్టికిఁ ♦ [బ్రాతిపదిక
చావె[బదుకగును; [బదుకె ♦ చావుగాదె?

మహా—కావున, హింస పుణ్యము, అహింస పాపము. ఇంతేనామీాయ భి[ప్రాయము?

పురా—పుణ్యము, పాపము నను భేదమే లేదని నాయభి[ప్రాయము.

మహా—వింతగవాదించు చున్నారు. కొన్ని పుణ్యకార్యములని కొన్ని పాపకార్యములని లోకమునఁ [బత్యక్షభేదము లేదా?

పురా—ఆ యున్న భేదమే లేని దని నాయభి[ప్రాయము.

గీ. ధని తనసొమ్ము పరులు గై ♦ కొనక యుండు
నట్లుచౌర్యము పాపకా ♦ర్యముగఁ జేసెఁ;

జక్కనగు చుక్కపతి తన ♦ చాన నెపుడు
దగులకుండఁగ జారతఁ ♦ దప్పఁజేసె.

గీ. పిఱికి దొంగలు ధనులను ♦ బీల్చివేయ
వితరణమె పుణ్యకృతిగఁ గ ♦ ల్పించినారు;
జనములాత్మీయ లాభ వాం ♦ ఛలకు నిశ్లై
యిలను బుణ్యపాపముల స్థా ♦ పించినారు

గీ. గంగ కీయొడ్డు నంతయు వా ♦ రాంగనలకు
గారుగుడిసెలు కట్ట పా ♦ పంబు కాదు;
గంగ కా యొడ్డునంతయు ని ♦ స్సంగులకు మ
హామఠములను గట్ట పు ♦ ణ్యంబు కాదు.

గీ. జనుఁడు స్వేచ్ఛగా నేది చే ♦ సినను సరియె,
దానివలన నెవ్వనికి నే ♦ మైన సరియె,
చేయకుండినను సరియె ♦ చేయమిని నె
వనికి నేమైన సరె తలఁ ♦ పంగ వలదు.

మహా—బహువిరుద్ధముగ నున్నదే. జనునకు సౌఖ్యమిచ్చునదైన బుణ్యము దుఃఖమిచ్చునదైనఁ బాపము. ఈమాత్రపు భేదమైన నంగీకరింపరా?

పురా—అదేమిమాట!

గీ. అన్యునకు గీడు తనకు మే ♦ లగు; ఋణప్ర
దాత మృతిభీతి తనయను ♦ ప్రీతికాదె?
తనదు కీడన్యునకు మేల్మి; ♦ తనమగోరు
చిట్టుపోటు వెజ్జుని ప్రేలి ♦ చుట్టు నీటుః

మహా—పోనీ! జనబాహుళ్యమున కేది సుఖకరమో యది పుణ్యముగ ను, నేది దుఃఖకరమో యది పాపముగను బరిగణింపఁగూడదా?

పురా—మహాచార్యా! ఎన్నిమారులు చెప్పఁగలను? బలహీనులు, ధైర్యహీనులు స్వార్థపరులగు జనులచే నిర్మించుకొనఁబడిన యీ పుణ్యా

పాపతత్త్వములు. దైవదృష్టిచే బుణ్యములేదు. పాపములేదు. నైనమొకనిని ద్రొక్కువాఁడు కాఁడు; నెత్తిపైఁ బెట్టుకొను వాఁడుకాఁడు. మీరు సెలవిచ్చినరీతిగ జనబాహుళ్యమునేకాదు. జనలోకమునంత నేకాదు. సర్వజగత్ప్రాణికోటుల నన్నిటిని నీవొక్కసారి గొంతుకలుకోసి చంపినయెడలనైన నది పాపము కాదు. వానినన్నిటిని నీవు స్వధన ప్రదానమునఁ బోషించినయెడల నైన నది పుణ్యమునుగాదు.

దే—అట్లైన మీమతమున హత్య కర్తవ్యమనియేనా?

పురా—సర్వలోక—

మక్క—పురాణకస్య పాచార్యోత్తమా! ఎంత లెంతలుమాటలు సెప్పుచున్నావు! ఒకనిని జంపుటకుఁ బోషించుటకుఁ గూడ నీవే కర్తవా? ఆ! ఎంత సర్వస్వాతంత్ర్యమును నెత్తిపైఁ బెట్టికొంటివి! ఇఁక నీనిరంకుశగర్వాలాపములఁ గట్టిపెట్టుము.

పురా—మక్కలాచార్యా! అంతకోపమేల పడెదవయ్యా!

మక్క—అదే తెలివి తక్కువతనము. కోపపడువాఁడను నేనా? ఏపని చేయుటకైన మనకధికారమున్నదా? మనమెక్కడ? స్వాతంత్ర్యమెక్కడ? అబ్బో! కొండలు దాఁటిపోవు మాటలా? ఆఁ! ఎట్లు? కత్తితో గ్రామమందఱగొంతుకలు నఱికెదవా? నఱుకువాఁడవు నీవా? నఱుకునది కత్తియా? నఱుకఁబడునవి గొంతుకులా? ఆ!

పురా—ఏమి యీయసందర్భపుపోడి! "నఱుకువాఁడవునీవా" యని యధిక్షేపించితివే! నఱుకుట యేమి మహాకష్టము! నేనంతగూడ నెందులకు? ఇదిగో! కత్తిపుచ్చుకొనినయెడల—చిప్పకు చిప్పకు క్రింద—నీయొక్క చేతితో—సెలగ సెలగ క్రింద

మక్క—ఆఁగు. ఆఁగు. ఈచేయి నీదే యనుకొనుచుంటివా? ఏమియు జ్ఞత! నీ చేయినిప్పుడుపైకెత్తిన తత్త్వమునీవే యనుకొను

చుంటివా? కృంతనకార్యములో నీచేయిని విసరునది నీవేయను
కొనుచుంటివా? ఎంతతత్త్వజ్ఞానశూన్యత! నీజిహ్వానీదే? నీమన
సునీదే? నీవునీవాఁడవే? ఆఁ! ఏమిమూఢత!

పురా — నేను నావాఁడను, నేను నేను గాక నీవగుదునా?

మక్క — అదిగో! తిరిగి యదే ప్రశంసయా? నేనుమాత్రము నావాఁడ
నా? నేనుమాత్రము నేనా?

పురా — దేవదత్తాచార్యా! ఏమియది! మక్కలాచార్యులవారు నేఁడు
మోతాదుమీఱిన దాహశాంతి నాచరించిరా యేమి?

మక్క — నేనుగల్లుఁద్రాగితి ననుచుంటివా? త్రాగుటకునాకు సమర్థత
గలదా? సర్వచరాచరలోకసంచలీకరణైక దక్షమగుకర్మము
నన్నుఁద్రాగించినది త్రాగినవాఁడను నేనా? కర్మము. ఆకల్లు
ముంత కాసమయమునందు నాకర్మముమూలమున పట్టిది కావలసిన
పురాతనకర్మయోగము దానికుండుటచేత నదినానోటఁబడెను,
గాని లేనియెడల నెక్కచుక్కకుముంత దాఁటిపైకివచ్చుటకధికా
రమేది? త్రాగినవాఁడను నేనుగాను. త్రాగినదికల్లుగాదు.

పురా — కాకమఱేది?

మక్క — ఇంకఁదత్త్వముబోధము కాలేదా? కల్లుకాదు; కర్మఫలము.
నాకర్మఫలము. ముంతచేసికొన్న కర్మఫలము. ఇప్పటికైనఁ
దెలిసినదా?

పురా — తెలిసినదాయని యడిగెద రేమి? తెలియుతత్త్వము నేనా? నాక
ర్మము; తెలిసికొనునది నేనా? మీకర్మఫలముతోఁ గూడిన నాక
ర్మఫలము.

మక్క — హా! హా! ఆనందము. ఆనందము. ఇదియేసత్యము.

గీ. చదువుచదువంచు మనుజులే ♦ డ్చెదరుగాని
చదువుకొనిన ఫలము లేమి ♦ చదువఁదగదు;

చదువుకొనకున్ననైనఁ శాస్త్ర ♦ జ్ఞసనకృతులు
సదిగనున్నఁద నంతనే ♦ చదువువచ్చు.

గీ. "అతి" వలన వ్యాధిరాదు; పు ♦ రాత్తసంచి
తమునవచ్చు; మందునఁబోదు ♦ తత్కృతి పరి
పాకమునఁబోవుఁ; బ్రారబ్ధ ♦ ఫలమిటను భు
జింపఁదగుఁగాని చేయినో ♦ రెత్తఁదెగదు.

గీ. కర్మమేసర్వలోకాళి ♦ కర్తృకంబు
పాలకమునాశకంబు ని ♦ ష్పారమాది
రహితమవ్యయశక్తి వి ♦ భ్రాజితంబు
వర్ణనాతీతమాహాత్మ్య ♦ వైభవంబు.

అజ—అయ్యా! మక్కలాచార్యా! కర్మమే సృష్టిస్థితిలయ కారణమగు నప్పుడింక దేవుఁడెందులకయ్యా?

మక్క——ఇంతసేపును నీవున్నట్లే నోరుమూసికొని పడియుండుటకు——

అజి—అట్టియంధ బధిర మూక పంగు నిస్సార నిరుపయోగ నిర్భాగ్యపు దేవుని గల్పించుకొనుటకంటె——

దేవ—అజితాచార్యా! ఇప్పుడు దేవునిఁ గూర్చి వివాదాంశము కాదు. మక్కలాచార్యా! మీ సిద్ధాంతము ప్రకారము పుణ్యపాపభేదమున్నదా?

మక్క——కావలసినంత యున్నది. కాని——

దేవ—ఇంకఁ "గాని" యేమి?

మక్క——పుణ్యమును జేయుటకుఁగాని పాపమును జేయుటకుఁగాని మనకధికారము లేదు. అవివానియంత నవియేజరిగిపోవును.

దేవ—ఏట్లుజరుగును? మనమూలకముగనే జరుగునుగాదా?

మక్క——కాదామఱి?

దేవ—సరే. మావలన నిప్పుడొక్కవధము జరిగినది.

మక్క—అదియే యసాధ్యమని యింతసేపటినుండియుఁ జెప్పినది. బహు నిగూఢమైన మతమగుటచే సుబోధ్యముగాదు. అదిగాక మత సాంప్రదాయసమీచీనమగు వాక్యసముదాయము గూడ భాష లో లేదు.

దేవ—ప్రత్యక్షకారణమగు కర్మము, తటస్థకారణమగు మనగుండ సైనే వధ కర్మమును జేసెను. ఆవధముతో మనకేమైన సంబంధ మున్నదా?

మక్క—ఏమియులేదు. ఎవ్వఁడునునోరెత్తఁ దగదు. మనపూర్వకర్మ మీవధకర్మమునకు గర్తృకమైనది. వాని కర్మ మీవధకర్మము నకుఁ గర్మకమైనది. ఇన్నిమాటలేల? ఒకకర్మము రెండవకర్మ మును జంపును. ఒకకర్మము రెండవకర్మమును దొంగిలించును. ఒకకర్మము రెండవ కర్మముతో వ్యభిచరించును. అంతే! మన మెవరము! గడ్డిబొమ్మలము. తోలు సంచులము. మఱపెట్టె లము.

అజి—అట్లైన నీ దిక్కుమాలిన ప్రాణముగూడ నెందులకు? చావ రాదా?

మక్క—అదిగో! మూఢత! అదిగో! కర్మమహిమాంధత! చావరాదా? ఆఁ! ఆఁ! చావఁగలవాఁడను నేనే?

అజి—చావఁగలవాఁడవు నీవే. చంపువాఁడనుమాత్రము నేను.

దేవ—అజితాచార్యోత్తమా! ఆతని యభిప్రాయమేమో తెలిసినది అంతయేమనకుఁ దెలియఁదగినది. “చంపువాఁడను మాత్రము నే నని నీవిప్పుడంటివి. చంపఁదగినవాఁ డెవఁడైన నున్న యెడల చంపుటకు నీయభ్యంతరమేమియు నుండదనట్లునీమాటవలననుస్పష్ట పడుచున్నదికాదా?

అజి—నాయభ్యంతర మొంతమాత్రమును లేదు కాని—

దేవ—లేక పోయిన గాని, యేల?

అజి—రాజశాసన మభ్యంతరముకాదా?

దేవ—అది లేకుండనే జేసినయెడల?—

అజి—నీమిత్రుఁడును యువరాజునగు నజాతశత్రునిమూలమున నాబాధ లేకుండఁ జేసెదవా?

దేవ—ఎట్లోయొకట్లు! అదివివాదాంశముకాదు. అట్లు చేయునెడల—మాటలాడ వేమి? పాపకార్యమని నీకుసందేహము లేదుకద!

అజి—పాపమా? అది మామతములోనే లేదు.

పురా—సెబాస్! మామతములోను నంతే.

అజి—పుణ్య మంతకంటె లేదు.

పురా—మామతమునఁ గూడ నంతే.

అజి—కాని సుఖదుఃఖములున్నవి.

పురా—అట్టి యూహముతప్పు.

దేవ—పురాణ కస్యపాచార్యా! మీయభిప్రాయమును స్పష్టీకరించితి కాన మీరు మాటలాడనేల? అజితా! సుఖదుఃఖములున్నవి?

అజి—ఏవరునకు దుఃఖమును గలిగిఁగూడదను కట్టుబాటొకటి గూడ నున్నది కాదా?

పురా—చచ్చిన వానికింక దుఃఖమెట్లు?

దేవ—పురాణ కస్యపాచార్యా! మీరూరకుండుఁడు. అజితాచార్యా! అట్టి కట్టుబాటెవరు చేసికొనిరి?

అజి—మనమే.

దేవ—నేనెవనితోడను జేయలేదు. నీవెవనితోడఁ జేసితివో చెప్పెదవా?

అజి—నేను మాత్రము ప్రత్యేకమెవనితోడనైనఁ జేసితినా? మనపూర్వులు చేసినారు.

దేవ—నీపూర్వులు నీయభిప్రాయమెఱుఁగకుండ జేసినకట్టుబాటునకు నీ వేల బద్ధుఁడవై యుండవలయును?

అజి—అటులే యెవనివాఁడే నీతివిరోధముగఁ బ్రవర్తించినయెడల లోకమునశాంతి యుండునా?

మక్క—(తనలో) నడుచుటకు నడువకపోవుటకు మీాయిష్టమే కాఁబోలు!

దేవ—మీామతమునఁ గావలసినది యాత్మసుఖమా? పరసుఖమా?

అజి—ఆత్మసుఖమే.

దేవ—అట్టిచో నీకు లోకముసుఖముతో నేమిపనియున్నది?

అజి—అంతపని లేదుకాని లోకముక్షోభించునెడల నేనుగూడ లోకములోనివాఁడ నగుటచేత నట్టిక్షోభములోఁ గొంతభాగము నాకుఁ గూడఁ గలుగదా?

దేవ.—అట్టిభాగమేదో నీకొకనివలనఁ గలుగవలసినదేనా?

అజి—ఔను.

దేవ—అట్లునీకుఁ గలుగకుండునట్లు వానికి రాజదండన భీతియున్నది కాదా?

అజి—నీవాద మసమంజసముగ నున్నది. ఇంతకు ముందనుకొన్న దేమనఁగఁ బ్రతిజనుఁడును రాజదండన భీతిదూరుఁడై వర్తించునెడల జగముక్షోభమొందునని యనుకొంటిమి. ఇప్పుడునాకుఁ క్షోభమొసఁగువానికి రాజదండన భీతియున్నదంటివి.

దేవ—అజితాచార్యోత్తమా! అటులనుకొంటిమా? లేదు. ఎవనిమట్టునకువాఁడే నీతివిరుద్ధముగఁ బ్రవర్తించునెడల ననికాదా?

అజి—అవును. రాజదండన భీతివలనఁ గలిగినదేకదానీతి.

దేవ—నీతివలన రాజదండనము పుట్టలేదు.

అజి—లేదు.

దేవ—రాజదండనభీతి యున్నవానికి నీతి యుండఁదగినది.

అజి—అవును.

దేవ—అది నీకు లేదని స్పష్టముగఁ జెప్పితినికాదా?

అజి—అట్లైననిదియు నాకుండవలసిన పనిలేదు.

దేవ—కావున నీవొకనిని నశింపఁజేయఁ గలవుగద!

అజి—నశింపఁజేయుట యెవనితరమును గూడఁగాదు.

దేవ—అదెట్లు?

అజి—భూతచతుష్టయ సమావేశమువలన నీదేహము గలిగినది. ఆము డియూడఁదీసి యేభూతము నాభూతములోఁ గలుపవచ్చును. అంతవఱకే మనముచేయుపని. దానిపేరే చావని నాయభిప్రా యము. నీవుచెప్పిననాశనము ప్రకృతిలోనే లేదు.

దేవ—నాశనముచేయలేవుగాని చంపఁగలవు?

అజి—అదే. రూపుమాపఁ గలము.

మక్క—ఎందులకు వెఱ్ఱిమాటలు! ఆకర్మాధిదేవత సెలవులేనిదే నెత్తి పైనొక్క వెండ్రుక యూడఁదీయలేవు.

దేవ—మక్కలాచార్యోత్తమా! ఆయనచెప్పునది యదికాదు. రూపు మాపునది యథార్థముగఁ గర్మమే. తానూరక నిమిత్తమాత్రుఁ డుగ నుండునని యాతనియభిప్రాయము.

మక్క—అది దివ్యముగ నున్నది. అదియేసమంజస మార్గము.

అజి—(అపవారించి) దేవదత్తాచార్యా! నాయభిప్రాయ మదికాదే!

దేవ—(అపవారించి) ఆత్రాగుబోతు ముండకొడుకుతో నెందుల కు బోనిమ్ము.

అజి—(అప) అదికాదు. మతవిషయమైన పట్టువచ్చినప్పు డీమెలతమా టలు కూడవు.

దేవ—(అపవారించి)అజితాచార్యోత్తమా! అజాతశత్రుని వు నాకుఁ బ్రా ణమిత్రుఁడని లోకమెఱుఁగును గదా! నీవుకూడనట్లేయని నా

మనస్సైనుఁగును గదా? నావలనముందు నీకేట్టివిజరుగునో చె
ప్పవలయునా?

అజి—(అప) అజాతశత్రువును నాస్తికమతములోఁ జేరునట్లుచేయఁ
గలవా?

దేవ—(అప) ఏమిచేయుదునో యిప్పుడుచెప్పనేల? నీవెవరితోడను గలి
యాపడవలను.

అజి—(అప) అట్లయైననా కేమి? నీయిష్టమెట్లో యట్లేసరియందును.

దేవ—మహాచార్యా! మీయభిప్రాయము బాగుగవెల్లడికాలేదు.

మహా—వెల్లడియగుట కేమున్నది. మీయిష్టమెట్లో నాయిష్టమట్లే.

దేవ—అట్లుకాదు. మీరుయాగములలోఁ బశువులను హింసింతురుకద!

మహా—ఒక్కదానిని గాదు.

దేవ—దైవప్రీత్యర్థమై యని యిదివఱకే సెలవిచ్చినారు గాదా?

మహా—ఔను.

దేవ—అనఁగ దైవవైభవ స్వరూపులగు నింద్రాది దేవతల ప్రీతికొఱకేనా?

మహా—అంతే.

దేవ—దైవశక్తిస్వరూపలేకద దుర్గాదులు?

మహా—అభ్యంతరమేమి? దైవశక్తులుకూడఁ బూజనీయములుకావా?

దేవ—దుర్గాప్రీత్యర్థముగ నరబలులిచ్చుట పావనమగు లోకాచారమై
యున్నది కాదా?

మహా—ఉన్నదికాని యది మాకలవాటులేదు.

దేవ—మీమాట నే నడుగలేదు. అది తప్పైనయెడలఁ దాంత్రికులేల
దానినాచరింతురా?

మహా—తప్పులేదు. అంతమట్టునకు నిశ్చయము.

దేవ—ఎవరికిఁ దప్పులేదు. చేయువారికిఁ దప్పులేదని చెప్పనక్కఱలేదు
కదా? ఇఁక దప్పులేకపోవుట మీకుఁగాని మీవంటివారికిఁగాని
యై యుండవలయును.

మహా—అలాగే కనఁబడుచున్నది.

దేవ—మీరందఱు నాయందు దయకలవారుగావున—మీలోనొకఁడు పునుగును నాయీచేతికి వ్రాయును. రెండవవాఁడు కస్తూరిసారము నీచేతికిఁ బూయును. మూఁడవవాఁడు నావక్షస్స్థలమునఁ బన్నీరమును జల్లును. నాల్గవవాఁడు చందనమును నాఫాలమునఁ బెట్టించును. మీరందఱు నాకుపకారమును జేసినవారేనా? ఈయుపకారములలో భేదమేమంతయున్నది?

మహా—ఏమియు లేదు.

దేవ—నాకు మీరందఱొకటేకద!

మహా—ఒకటే.

దేవ—మీరందఱొక్కటగునప్పుడు మీలో మీకు భేదమెట్లు?

మహా—లేదు.

దేవ—కావున నీవీచేతికిఁ బునుగును వ్రాయుటకుఁ బ్రతినిధిగ నీరెండవ చేతికిఁ గస్తూరిసారమునుఁ బూయవచ్చునుగద?

మహా—అభ్యంతరమేమి?

దేవ—కపోలముపై గంధముఁ బూసినయాతఁడు శిరముపై సంపెంగతైల మంటవచ్చునుగద?

మహా—ఆ.

దేవ—కావున దైవవిభుత్వస్వరూపు లగు నింద్రాదిదేవతల వజహత్యతోఁ బ్రీతిచేసినవాఁడే దైవశక్తిస్వరూపయగు దుర్గను నరహత్యతోఁ బ్రీతి సేయవచ్చునుగద?

మహా—చేయవచ్చును.

దేవ—కావున నరహత్య తప్పులేదు?

మహా—లేదు.

దేవ—ఇంతకుముందు మీరు తప్పులేనట్లే కనఁబడుచున్నదని వచించి నారు. ఇప్పుడు నిస్సందేహముగఁ దప్పులేదని చెప్పఁగలరు.

మహా—లేదు. లేదు.

దేవ—హా! దైవమా! ఎంతగతి పట్టించితివోయితండ్రీ! అయ్యయ్యో! సోదరులారా! మహాచార్యపురుషులారా! హత్యకూడదని మీలోనొక్కరైనఁ జెప్పలేకపోయితిరా? ఒక్కఁడైనఁ గూడదని చెప్పునేమో యని యింత గ్రుచ్చిగ్రుచ్చి యడిగితినే. ఏమిమహాత్ములారా! హత్యఁగూర్చి యందఱొకాభిప్రాయులేమైరా? ఇది నామహాకర్మమా? నాదుష్కృతియా?

అందఱు.—ఏల? అట్లు విచారింతు రేల?

దేవ—హత్య తగదని చెప్పుదురేమో యందువలన మనసురాయిచేసి కొని-జనులు భ్రష్టులైనసరే—బ్రాహ్మణ్యమధోగతిపాలైనసరే—వేదములు కుక్కకూఁతలైనసరే—వర్ణచతుష్టయము సర్వధ్వాంసంకరమైన సరే—ఆత్మయొండమావియైన సరే—దైవ మవాచ్యపు ముండకొడుకైనసరే—లోకమంత ధ్వంసమైనసరే—చిత్తమును బెద్దపాషాణముచేసికొని నాకీగోడవయేల యని దౌడలుదగ్గఱగ నొక్కుకొని యుండఁదలఁచిననాకు—చచ్చిపడి యుండఁదలఁచిన నాకు—"మృతియోమృతియో," యనిదైవమును నోరెండిపోవఁ బ్రార్థించుచుఁ జావఁదలఁచిననాకు-తిరిగి-అయ్యయ్యో! మఱల—సోదరులారా! హత్య సర్వమత సమీచీనమనిబోధించి—మనసు నుల్లోలకల్లోలముచు జేసితిరా? ఆహాహా! ఏమిచేయుదు? యమయాతనఁబడుచు నూరకుండవా? చావనా? హరిహరీ! ఎంతప్రారబ్ధము!

మక—నిశ్చయము. ప్రారబ్ధమనునదియే దైవస్వరూపము.

పురా—ఆహా! మతాచార్యులారా! బుద్ధుఁడు చేయుచున్న యక్రమ
మతోపన్యాసము లీయాచార్యపురుషుని హృదయము నెంతగాఁ
బాడుచేసినవో! చూడుఁడు!

దేవ—బుద్ధుఁడెవఁడు? ఈగుండెలో గుండెకాఁడా? ఈరక్తములో రక్త
ముకాఁడా? ఈయెముకలో నెముకకాఁడా? అతఁడు నేను దాయా
దులవలెనే యుంటిమా? ఒక్కశరీరమే! ఒక్కప్రాణమే! ఒక్క
మనసే! ఒక్కయాత్మయే! అయ్యయో! బుద్ధాచార్య పురుషా!
మనకు బ్రాహ్మణులే భూలోకదైవములే! అట్టి బ్రాహ్మణోత్త
ములను బరమనీచు లగు క్షురకుల నొక్కకాటిచేఁ గప్పుచుం
టివా? భూదేవ మహాపరాధమును గట్టుకొంటివా? వేదములు
నిస్సంశయ ప్రమాణములే! అట్టి వేదములను గోకొక్కశాస్త్ర
ముతో పాటు దిగఁదుడిచి నిప్పులలోఁ బారవైచితివా? నీవుచేయు
మహాదుర్ణయమును జూచి నీశరీరభాగమునైన నేనెట్లు సహింపఁ
గలనయ్యా? (విచారించును)

మక్క—సహించుటకు, సహింపకపోవుటకు మనకధికారము లేదు. మన
కర్మమే సహింపఁజేయును.

దేవ—అంతే! అంతే! సహించియూరకుండ వలసినదేనా? గత్యంతరము
లేదా? ఈబాధ నివారింపఁదగదా? బ్రాహ్మణులు చండాలురై
పోవునప్పుడు కూడ నింక సహింపవలసినదేనా? పట్టణము లన్ని
యు బోఁడితలలీనునప్పు డింక సహనమేనా? ఆఁ! దిక్కుమాలిన
యాఁడువారిరోదనము లాకసమున నెగురుచుండ నింకనోరుమూ
సికొన వలసినదేనా? తానుబోధించునది సర్వజనానురాగమత
మఁట! మైత్రిమతమఁట! తండ్రులను బుత్త్రిలనుండి, భ్రాతలను
భ్రాతలనుండి, మగలను భార్యలనుండి అందఱి నొక్కసారిగా
నింటనుండి, సంసారమునుండి— సుఖమునుండి, కడుపునింపిన

యన్నమునుండి, యొడలు నిండిన గుడ్డనుండి, కొసకు నెత్తిపై
దైవమిచ్చిన వెండ్రుకలనుండి— వేఱుచేసి—విడఁదీసి— అయ్యో
య్యో! ఏమిబుద్ధాచార్య మహాపురుషా! ఇంతఘోరపాపమున
కొడిగట్టినావు? ఇదియేనా సర్వప్రాణ్యనురాగమతము!

అజి—అదియేమి వింతయోకాని యీయనస్వరూపము ప్రమాదమున
నైనఁ గంటఁబడుసరి కాయనను దరి జేర బుద్ధిపుట్టును. సమీ
పించుట, వినుట, సమ్మతించుట, సన్యాసియగుట యొక్క మాత్రే
జరుగును. ఇదియేమో యత్యద్భుతముగ నున్నది.

మహా—అద్భుతమున కేమియు లేదు. బుద్ధుఁడుమోసగాఁడు. మాంత్రి
కుఁడు. అథర్వణవేదములో జనవశ్యలోకవశ్య మంత్రము లనేక
ములున్నవి. ఇది యామంత్రముల మత్తుకాని మఱియొకటికాదు.

అజి—చాలు చాలు! మంత్రముల లొడలొడలతో లోకవశ్యమగునా?
వెఱ్ఱిమాట! వేదముల నిరసించినవాఁడు—అథర్వణవేదములోని
మంత్రములఁ బురశ్చరణముఁ జేసినదు నేమి? మంత్రములు లే
వు. పురశ్చరణములు లేవు. ఫలములు లేవు.

దేవ—అజితాచార్యా! అట్లనకుము. ఆఱుసంవత్సరములు తదేకదీక్ష
గా వేదపారాయణమును బుద్ధుఁడుచేసినాఁడు. యోగము నిరం
కుశదీక్షతో నభ్యసించినాఁడు. ఏదియోశాబరము పట్టువడినది.
ఏదియోజనవశీకరణ సాధనమును సంపాదించినాఁడు. అదియే లేక
పోయినయెడలఁ దొంబతొంబలుగ—మోపులు మోపులుగ—
కుప్పలు కుప్పలుగ—గుట్టలు గుట్టలుగ—నిండఱుశిష్యులు గుం
డ్లపైగుండ్లు—శాటులపై శాటులు—ఆహా! ఇది మంత్రముకాని
మఱియొకటి కాదయ్యా! కాదయ్యా!

అజి—మంత్రము లుండవచ్చును. లేకపోవచ్చును. ఆసంగతియేల?
కాని—యొకచిత్రమున్నది. బ్రాహ్మణులిదివఱకు సర్వోత్కృ

ష్ఠులమని చెప్పుచు సర్వశక్తిమంతులమని వాదించుచు, బ్రహ్మకు మేము ముఖ్యులమని బోధించుచు, వేదముల నితరులు చదువఁ గూడదని నిరాకరించుచు, దైవమునకు నబ్రాహ్మణులకుఁ దా మేముఖ్యసంధాన కర్తలమని చెప్పుచు, బ్రాహ్మణేతరులను సమస్తవిధముల నిరాదరించుచు, మహాగర్వోన్నతిచే నుండుటచేత నబ్రాహ్మణులకందఱకుఁ గడుపులుమండుకొని పోవుచున్నవి. ఎప్పుడైన నీదిక్కుమాలిన యార్షమతమునుండి వెలుపలఁబడుదుమా యని యందఱేడ్చుచునే యున్నారు. అట్టియవకాశమిప్పుడు కలిగినది. బుద్ధుఁడు సర్వజనసమత్వమును స్థాపించినాఁడు. విభూతిరేఖల మాధ్యస్థ్యము లేకుండనే యెవనికి వాఁడే మోక్షప్రయత్నము చేసికొనవచ్చునని కూడఁ జెప్పినాఁడఁట! ఇంతకంటె నీమహాకలకలములో జనులకుఁ గావలసిన దేమి? అందుచేత—తొంబతొంబ లని, గుట్టగుట్ట లని నీవు చెప్పినకుదిడీసరుకులు బయలుదేరినవి.

పురా—అజితాచార్యా! కవిత్వము నీకు లేకపోయెను గాని, యతిశయోక్తిమాత్ర మున్నది. బ్రాహ్మణు, లబ్రాహ్మణుల నట్లు నిరసించుట యెప్పుడును లేదు. వర్ణసంబంధము లగుననూయలుగూడ నింకఁ బూర్ణముగ్గఁ బెఱుఁగలేదు. నీవు చెప్పినది కారణము గాదు.

అజి—ఏదో నీవు చెప్పరాదా?

పురా—ఇదిగో! క్రొత్త యెప్పుడును వింత! అందులో నుత్తము లని యెంచఁబడువారి యుత్తమత్వ మసత్య మని చెప్పునరి కథముల కట్టిమాట లమృతప్రాయములుగ నుండును. వేదప్రమాణబద్ధులగువారందఱుఁగూడ వేదములు మిథ్యలని బోధించువాఁ డెవఁడైనఁ గలుగునరికి నిరంకుశముగ నాతని వెన్నాడుదురు. నవ

స్తికస్తభూయిష్ఠ మగుకర్మతంత్రపు జిడ్డు నూడఁదీసినవెంటనే—
ఓ! స్వేచ్ఛ! ఇఁక నేమి? బ్రాహ్మణాధిక్యము, వేదప్రామాణ్య
ము, దైవత్త్వముతుడిచివేసిన ప్రతినూతనమతములో బుద్ధిహీ
నులు, శక్తిహీనులు, వక్రబుద్ధులు, నీచజాతులు, సంకరులో
క్క పెట్టునఁ జేరుదురు. అదిప్రకృతి.

దేవ—అటులైన నజితాచార్యునినాస్తికమతమున కేల వీరంద ఱెక్కుఁ
గూడరు?

పురా—నాస్తిక్య మెన్నఁడును మతము కానేరదు నాస్తికులు పెంట
పై మొండిచేతులవలె నక్కడక్కడ నుండవలసినవారే కాని
వా రొకజాతిమాత్ర మెన్నఁడును గానేరరు.

అజి—అన్ని ప్రాణుల నొక్కసారి చంపవచ్చు నని బోధింపఁగల నీతిమా
లిన యాస్తిక్యముకంటె నాస్తికమతమే మంచిది కాదా?

దేవ—అజితాచార్యా! నీవు తామసింపవలదు. పురాణకస్యపాచార్యో
త్తమా! బుద్ధమతముమాత్రము నాస్తికమతము కాదా?

పురా—దేవుఁడు లేడని కంఠోక్తిగ నిదివఱ కెక్కడ నాతఁడు చెప్పి
యుండలేదఁట!

దేవ—పోనీ! అబ్రాహ్మణులు, నీచులు, అకార్మికులు బుద్ధమతమునఁ
జేరి రందువా? నిత్యాగ్నిహోత్రులు, ఛాందసాగ్రగణ్యులు,
శతయాగదీక్షారతులు, బ్రహ్మపరావతారము లగునదికస్యపుఁడు,
నురుబిల్వకస్యపుఁడు నాతనిసోదరులతో నిన్నఁగాక మొన్న నే
యీగయలో నేకదా చేరిరి. దీని కేమికారణము చెప్పఁగలవు?
నీవు వెయ్యి చెప్పు. ఇది యంతయు మంత్రప్రభావము కాని
మతబోధకునిప్రభావము కాదు. ఏమి పురాణకస్యపాచార్యో
త్తమా! ఏమందువు?

శ్రోరా—మంత్రములు మాహాత్మ్యసంపన్నములు కావని నేను జెప్పను.

దేవ—మహాచార్యవర్యా! మంత్రప్రభావమే యిది యంతయు నని మీరే మొదట సెలవిచ్చితిరి. కాన మీయభిప్రాయ మక్కఱ లేదు. మక్కలాచార్యా! మీయభిప్రాయ మేమి? మంత్రమునకుఁ బ్రభావ మున్నదా?

మక్క—మంత్ర మెంతప్రభావము కలదైనను గర్మమునకు వ్యతిరేకముగఁ బనిచేయదు.

దేవ—అది సరేనయ్యా! కర్మమే వధము చేయునదైనను గత్తికి వాఁడి లేదనవచ్చునా?

మక్క—అటులైన మంత్రమున కెంతప్రభావమైన నున్నది.

దేవ—(అప) అజితాచార్యా! నీకు నేను జేయఁదలఁచినయుపకారము జ్ఞప్తి యున్నదా?

అజి—(అప) ఉన్నది. (ప్రకాశముగా) మంత్రము ప్రభావము కలది కాదని చెప్పుటకు నాకుఁ గారణము లగపడవు.

దేవ—ఆహా! బుద్ధాచార్యోత్తమా! నీవు మాంత్రికుఁడవు, మోసగాఁడవు, గొంతుకోఁతలవాఁడవు కావని వీరిచే నేననిపించుటకు వీరితో నింతవాదమును తఱచితఱచి, పొడిచి పొడిచి చేసితిని. అయిన నేమి? నాకోర్కె తీఱినదికాదు. నాయూహము యథార్థమైనది కాకపోయెను. ఇఁక నే నేమిచేయఁగలను? జనుల నందఱను నీవీరీతిగ ననురాగమిషమునఁ బ్రోచుచేయుచు నుండ— జనక్షేమముననే నాక్షేమమును, జనప్రాణములనే నాప్రాణముల నుంచుకొని కాలక్షేపమును జేయునే నింతలోకాపకార మెట్లు సహింతును? అయ్యయ్యో! ప్రాణమిత్రమా!

మహా—ప్రాణమిత్రమైనమాత్ర మేమి? చేయునది జగదపకారమైన నప్పు డూరకుండఁ దగునా?

దేవ—ఊరకుండ లేదు. ఊరకుండ లేదు. ఏడ్చుచునే యున్నాను.

మక్క—అది తప్పు. ఏడ్చుటకుమాత్రము మనము స్వతంత్రులమా?

పురా—తగినప్రతీకార మేదైనఁ జేయవలయును గాని యిఁక నూరకుం డఁదగదు.

దేవ—ఓ బ్రాహ్మణోత్తములారా! బ్రహ్మముఖోద్భవుల రగుమిమ్ముఁ బరమచండాలురతో సములుగఁ బరిగణించుచున్నాఁడు. ఇట్టి మహాపమానమును దిగ్రమింగి మీ రూరకుండిరికారా? బ్రహ్మ ముఖోద్గీతములును, సర్వలోకప్రమాణములు నగువేదములను బూతుకూఁత లని నిశ్చితిగ—బాహాటముగ—బోధించుచుండ వో నైదికశిఖామణులారా! ఇట్టిమహాదురాగతమును సహించి నోరు మూసికొనియే యున్నారుకాదా? యాగశాలలు కటికల యంగళ్లని, సోమపానము త్రాగుబోతుతన మని, అయ్యయ్యో! ఇంక నేమో యని ప్రత్యక్షముగ రచ్చసావడుల సంతబైళ్లను ఘోషించుచుండ నోపౌండరీకాశ్వమేధాది సత్క్రతుప్రియులా రా! ఆతఁడు చెప్పినట్లు పశుమాంసమును దిని, కల్లుతాగి మత్తులై యీతిట్లు మనవి కావని యుపేక్షించియే యున్నారుకా రా? ఇట్టిసహానబుద్ధిని నాయేడ్పు విని మీరేల యిప్పుడు వద లఁదలఁచినారు? వలదు. వలదు. నేను బ్రాహ్మణుఁడను గాను. బ్రాహ్మణుల కథమసేవకుఁడను. మీబ్రాహ్మణ్యముఁ బోయిన ను నేను మీకుఁ బాదదాసుఁడనే.

మహా—అదేమిమాట? బ్రాహ్మణ్యము—బ్రహ్మముక్కు చివరనుండి వచ్చుచున్న బ్రాహ్మణ్యము—అనాదియైన బ్రాహ్మణ్యము—చె రపినను జెడని బ్రాహ్మణ్యము—ఎక్కడకుఁ బోవును? నాప్రాణ ములనైనఁ బోఁగొట్టుకొందునుకాని—

దేవ—అయ్యయ్యో! ఇప్పటి కున్న ప్రాణమిత్రములు మీరే. మీలో నొకఁడిందుల్కై ప్రాణములు విడిచిన యెడల—

పురా—అట్టు లందువేల? ఒకఁ డనుట యేల? నేనుఁగూడ లేనా? బుద్ధుని బుద్ధునినాలుగువేలశిష్యులను గూడ నేను జంపుటకు సిద్ధముగనున్నాను. సుఖమని దుఃఖమని—చావని బ్రతుకని—పుణ్యమని పాపమని యున్న దనుకొను భేదమును దుండు తుపాకితో నెగరఁగొట్టినవాఁడను. హేహే!

మక్క—అది తప్పు. ఎగరఁగొట్టినది కర్మము. ఎగరఁగొట్టఁబడినది కర్మఫలము.

దేవ—మక్కలాచార్యా! ప్రారబ్ధ మంగీకరించునెడల నీవుఁగూడ మహాచార్య, పురాణకస్యపాచార్యులలో వాఁడవే కాఁబోలు నేమి?

మక్క—అతనికిఁ బ్రారబ్ధవశమున మననిమిత్తకారణమున నాయువు క్షయింపనున్నది కావుననే మనకర్మవశమున మన కిట్టియూహము కలిగినది.

అజి—ఆతనిని జంపిన నాయాక్షేపణ యింతమాత్రము లేదు కాని—

మహా—కాని యేమి?

దేవ—వ్యభిచరించుట గాని—వ్యభిచరించె ననువాడుక కలుగుటగాని—సన్యాసికి సమస్తకీర్తివినాశకము. అట్లు మనము చేయునెడల—నీక గురువు లేఁడు. శిష్యులు లేరు. మతము లేదు.

పురా—వ్యభిచరించె ననువాఁడుక గలుగఁజేయఁగలము కాని, యాతని చేత బలవంతముగ వ్యభిచారము చేయింపఁగలమా?

మక్క—నీ ప్రయోజకత్వ మేమున్నది? కర్మమే చేయించును.

అజి—కొంచె మెచ్చుతగ్గుగ నట్టిప్రోత్సాహమే కలిగింపవలయును.

మహా—ఏలాగున నయ్యా!

అజి—మక్కలాచార్యులవారు తన ప్రారబ్ధకర్మమునకై జాగ్రత్తపతిచిన సన్యాసకాంత నిందులకై నియోగింపవలసియున్నది.

మక్క—జాగ్రత్తపతిచిత్తి నను పేరుమాత్రమే నాది కాని తత్ఫల మంతయు మీయందలదే కద!

పురో—ఆమాత్రపుఁజేప ట్టుండుటచేతనే దినములు దొరలిపోవుచున్నవి. ఇట్లు చేయవచ్చునుగాని యేమిలాభము? ఆతఁడు యథార్థముగఁ గక్కుఱితిపడినవాఁడైన నెవ్వఁడును నమ్మఁడు. అదిగాక మన రహస్యసంసారసముద్రతారణమున కేదో చిన్న తెప్పగా నున్న దీనిని నచ్చటకుఁ బంపినయెడల నది కారణాంతరములవలన నతని విడిచి తిరిగి మన్నయాశ్రమములకు రాకుండునెడల మనగతి యేమికావలసినది?

దేవ—సుందరియను వేశ్య నాతనియొద్దకుఁ బంపి యాతనికీర్తిని నశింపఁ జేసెదరా?

అందఱు—ఆ.

దేవ—అట్లు చేయుటకంటె మీరందఱు గూడి నాగొంతును నొక్కి యజ్ఞపశువునువలెఁ జంపరాదా?

మహా—ఏమి యట్లనుచున్నారు?

దేవ—ఉత్తమక్షత్రియులమే—అభిమానైక ప్రధానవర్ణజులమే—ప్రాణమన్నఁ దృణముగఁ జూచువారమే—ఒక్కయభిమానరక్షణమునకై లక్షప్రాణములు బలిపెట్టుటకు సిద్ధపడువారమే—ఆతఁడు నాకంటె జ్యేష్ఠుఁడే—నాకంటె నభిమానాధికుఁడే—ఒకటే యాలోచించుకొనుఁడు. సృష్ట్యాదినుండి వచ్చుచున్న బ్రాహ్మణాధిక్యమును వేదాధిక్యమునుదుడిచిపెట్టఁదగినవాఁ డెంత యభిమానము గలవాఁడో యూహించుకొనలేరా? అట్టినం

పూర్ణాభిమానుఁడే—ఆఁ! శాశ్వతమైనయాతనిక్షత్రియాభిమానమును బరిహరింపు మని క్షత్రియుఁడ నైననాయెదుటనే—ఆతనిదాయాదుఁడ నైననాయెదుటనే—యాతనిప్రాణసఖుఁడ నైననాయెదుటనే—మీరు పలుక సాహసించితిరా? ఆహా! ఎంతనిర్భీతిగ వర్తించుచున్నారు. బ్రాహ్మణదాసుఁడ నైనంత మాత్రమున క్షత్రియాగ్ని చల్లారిన దనుకొంటిరా? జాగ్రత్త!

అందఱు—క్షమింపుఁడు. క్షమింపుఁడు. తెలియక యట్లంటిమి. ఆతని జంపుట తప్పనితరోపాయము లేదు.

దేవ—ఏమో! ఏమిచేయుదురో! నామనసు చెదరిపోయినది. నాగుండె పగిలిపోవుచున్నది. ఆహా! బుద్ధాచార్యుఁడా! నీవు నాకు సోదరుఁడవుగూడ నేల నైతివి?

పురా—సోదరుఁ డైన, నేమి? పుత్త్రుఁడయిన నేమి? లోకాపకారి శిక్షార్హుఁడు.

దేవ—లోకముకొఱకే—లోకముకొఱకే—నేనేష్ప్పనేష్ప్ప.

మహా—వింటిరా! ఈమహాత్ముఁ డెంతలోకోపకారియో!

దేవ—బంధుఘాతుకుఁడను గానుంటివి గాదా?

పురా—అట్లైనను లోకోపకారముకొఱకేకదా?

దేవ—లోకోపకారమునకై బంధుహత్యఁ జేయవచ్చునుగద!

పురా—ఈమతబోద్ధలమహాసభలో నాయంశ మిప్పుడు స్థిరపఱుపఁబడినది కాదా?

దేవ—మతి లేదు. మతి లేదు. ఓబుద్ధాచార్యోత్తమా! నీ కింక నీళ్లు వదలుకొనవలసినదేనా? (విచారించును.)

పురా—మహా. (దేవదత్తుని జేతులు పట్టుకొని) మీ రూరకే విచారింపఁ దగదు. ఆతఁడు నశించినగాని మనమతములు నిలువఁబడవు.

బ్రాహ్మణులమనసులు కుములఁబడవు. వేదములు గూలఁబడవు. మీకు తటస్థులుగ నూరకుండుఁడు. పని యంతయు మేము జక్కపెట్టెదము.

దేవ—అయ్యో! నాయనా! ఎట్లు?

పురో—మహాచోరుఁ డగునంగుళిమాలుఁడును నరభక్షకుఁడగు నలవకుఁడును మనకు స్వాధీనులై యున్నారుకదా?

మహా—ఇద్దఱేల?

పురో—అంగుళిమాలుఁడు మహాధైర్యశాలి. బుద్ధిశాలి. బుద్ధుఁడు తన యాశ్రమములోఁ గాని మఱియెచ్చట నున్నఁగాని యవలీలగ నాతనిఁ గనిపెట్టి చంపఁగలఁడు. వెంటనే తచ్ఛవమును నరభక్షకుఁ డగురెండవవాఁడు కబళించును. అంతటితో గప్‌చిప్.

దేవ—అయ్యయ్యో! నాకసుపు ముందుకొనిపోవుచున్నది.

పురో—మీరింక నేమి మాటలాడకుఁడు అయ్యలారా! ఆచార్యోత్తములారా! మీరందఱు లెండు. పోవుదము. అయ్యా! మాకు సెలవిమ్ము. పోయెదము.

దేవ—పోయెదరా? దయయుంచుఁడు. నమస్కారము.

అందఱు. చిరంజీవి. చిరంజీవి. (పోవుదురు.)

దేవ—బుద్ధుఁడు కల్పించినమతముకంటెఁ బ్రశస్తతర మగుమతమును గఠినతరము లగునీతిముక్తిమార్గములతో నేను గల్పించియుండ నెక్కఁడును నామతమునఁ జేరఁడయ్యెను. నింద్యమైనబౌద్ధమతమున నందఱు చేరుచున్నారు. క్షత్రియుఁడ నైననేను సాటి క్షత్రియునియుచ్ఛ్రత సహింపఁగలనా? ఇంతకంటె నాకు గుండెలోఁ బోటేమి? ఇంతకంటె నాకు హృదయమున శల్యమేమి? బుద్ధు నింక బ్రదుకనిచ్చెదనా? ఇక్కడ కిపుడు చేరినమతబోద్ధలు

పెట్టిముంచకొనుకులు. బుద్ధుఁడు చచ్చినపిమ్మట వీరిప్రోత్సాహమున నే యాతఁడు చంపఁబడె నని రాజుతోఁ జెప్పి వీరినిగూడఁ జంపించెదను. నామత మేదియో యది తప్ప మఱియొకమతము నిలువఁగూడదు. బుద్ధునితండ్రియు, బుద్ధునిభార్యయు, నొకసారి కపిలవస్తుపురమునకు వచ్చి తమ్ముఁ జూచి పోవలసిన దని యనేకవార్త లంపుచున్నా రఁట! బుద్ధుఁడు పోవుట కంగీకరించె నఁట! నడుమ దారిలో నంగుళిమాలునిచేత నలవకునిచేతను హత్య జరిగించుట నిశ్చయము. నిశ్చయము. వారిద్దఱు కారణాంతరములచే నిచ్చటనే యున్నారు. ఇఁకఁ దత్ప్రయత్నమున నుండఁదగినదే కావునఁ బోవుదును.

(నిష్క్రమించును.)

ఇది చతుర్థాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ.

పంచమాంకము.

—— ౦ ——

ప్రదేశము—ఉరుబిల్వారణ్యము.

ప్రవేశము—అంగులిమాలుఁడు, అలవకుఁడు.

అల—ఏమిఅంగులిమాలా! బుద్ధునిదరిఁ జేరుటకు బుద్ధియే కాని యాత నిసమీపించుటకుఁ గాళ్లు ముందాడకున్న వేమి?

అంగు—నాకుఁ గాళ్లు ముందాడుచునే యున్నవి. కాని బుద్ధిమాత్ర ము వెనుకాడుచున్నది.

అల—లోకకంటకుల మగుమనకే యాతఁడు భయనిదాన మగుచు న్నాఁడా యేమి?

అంగు—నీకు మనసులో నాతనిదర్శనమున భయము కలిగినదేమో కా ని నాకేమో నిర్వర్ణింపరానిగౌరవము కలిగినది.

అల—భయమనఁగ సామాన్యభయమా? నరులపచ్చిమాంసము కఱ కఱ నమలి పచ్చిరక్తమును గడగడఁ ద్రావినన న్నాతఁడు న మలి మ్రింగివేయునేమో యని పెద్దభయముగ నున్నది.

అంగు—నాకెట్లున్న దనఁగ—"పరమదుర్భాగ్యుఁడను క్రూరుఁడ నగునే నాతని నేమొగము పెట్టుకొని చూడఁగలను. సర్వవిధముల నపవిత్రుఁడ నగునేను సర్వవిధములఁ బవిత్రుఁ డగునాతని నెట్లు గా దర్శించి యపవిత్రుని జేయఁదగు," నని నాకున్నది.

అల—సింహ మున్నబోనులోనికి వెళ్లుట యెట్లో యాతనిసన్నిధికిఁ బో వుట నాకట్లున్నది.

అం—చండాలునకు దేవాలయగర్భములోనికిఁ బోవుట యెట్లుండునో నాకట్లున్నది.

అల—నాకు దిక్కుమాలిన ప్రాణభీతి వచ్చినది గాని, నాకే నీమనస్థితి వంటిదున్నట్లయిన నిశ్శంకముగఁ బోయి యాతనిఁ జీల్చివైచి యుందును.

అంగు—నీకున్న ప్రాణభీతియే నాకుండు నేని లఁ బరుగునఁ బోయి యాత నితోఁ బోరాడి చంపనైనఁ జంపుదును. లేక చావనైనఁ జత్తును.

అల—నాకీబోడిబుద్ధి మూలమునఁ బిఱికిదనము వచ్చిన ట్లున్నది. యుద్ధభటులను బ్రమింగితిని. సన్యాసుల నట్టె కోటకి పాఱవైచి తిని. గర్భవతులను జప్పళించితిని. కాని మొన్నఁ డిట్టివికార మెం దుఁగను. కిల్లుతిత్తి నీయొద్దనే యున్నది కాదా?

అంగు— ఒక్కటేమి? మూఁడుతిత్తు లున్నవి.

అల—ఎట్లు?

అంగు—నాచేతిలో తిత్తి; నీకడుపు తిత్తి; నాకడుపు తిత్తి.

అల—హాహా! మనము త్రాగి యెంత సేపైనది?

అంగు—ఏది! త్రాగినప్పటి త్రేపేకాని రెండవ దింక రానే లేదు.

అల—మనము తిరిగి త్రాగుదమా?

అంగు—సందున్న యెడల నటులే చేయవచ్చును గాని దానివలన లాభ ము లేదు.

అల—ఎందుచేత?

అంగు—త్రాగుఁడువలన హెచ్చునది ధైర్యము కాదు. పిఱికిదనము.

అల—అది నేనొప్పుకోనను.. ఒడలు తెలిసియుండఁగఁ జేయఁదగనివ నివి త్రాగుచున్నప్పుడు నిరభ్యంతరముగఁ జేయవచ్చును. కాని యా

దినమున నెన్నిమాఱులు త్రాగినను సున్నపుగుల్ల యుడుకుచున్న
ట్లు లోన గుబగుబలాడుచున్న సొగసైనమత్తే చేసినది కాదేమి?

అంగు—కడుపులో బెద్దయాందోళన మున్నప్పుడు కల్లు మత్తుచేయు
నా? ప్రాణావసానసమయమందు నల్లమందు పట్టిచ్చునా?

అల—ఆలాగేమి? ఇది నేనెఱుఁగనుసుమా! అట్లైన నొకనిముసము
గూరుచుందుము. మనస్సుల శాంతిపఱుచుకొని మఱిమఱి త్రా
గి మఱలఁ బోయి యీసారి చంపి మఱి వత్తము.

అంగు—ఇదివఱకు రెండుసారులు కూర్చుంటిమి. రెండుసారులు స్తిమి
తత నొందితిమి. రెండుమాఱులు కొండనాలుకవఱకుఁ ద్రాగితి
మి. ఏమియుఁజేయలేక రెండుసారులు తిరిగి వచ్చితిమి. కల్లుతి
త్తి మెత్తఁబడనకొలఁది మనస్సులుకూడ మెత్తఁబడుచున్నవి.

అల—కల్లింకఁ బడిపాయలపఱ్వైన నున్నట్లేకద! (తిత్తిని దడుముచు)
ఇది మూఁడవసారి. ఈసారి చూచి చేతకాకపోయినయెడల
నింటికిఁ బోవుదము. కూర్చుండుము. (ఇద్దఱు కూరుచుందురు)
ఆయనతో మఱియొకఁడుగూడఁ గానఁబడినాఁడే యాతఁడెవఁడు?

అంగు—ఆయనశిష్యుఁ డొక్కఁ డానందుఁడనువాఁ డాయనను విడువక
యెల్లప్పుడు కూడ నుండునని దేవదత్తాచార్యులు చెప్పినాఁడు.

అల—చూడు. దేవదత్తాచార్యు లన్న, నాకిప్పుడు జ్ఞప్తికి వచ్చినది. ఈ
బుద్ధుఁడు శుద్ధమాంత్రికుఁ డని మోసగాఁడని, నాతోఁ జెప్పి
నాఁడు సుమా! అయ్యయ్యో! ఇఁక నొకమాటకూడఁ జెప్పి
నాఁడు. లోనిమంత్రముల తేజముచేత నీతఁడు పైకి భయంక
రముగఁగాని దరిజేరఁ దగనట్లుగాని మాకుఁ గానఁబడును. ఎం
తమాత్రము జడియవలదు. కాళిని దలఁచుకొని కన్నులు గట్టిగ
మూసికొని గభాలున నొక్కసారి యాతనిపైఁ బడుఁడని చెప్పి
నాఁడు. వాడి. పందిమఱవు.

అంగు—పందిమఱపు గాదు. లొట్టిత్రాగుము.

అల—ఎంత త్రాగిన నేమి? చడి లేదు. వడి లేదు. (త్రేంచి) ఇదిగో! వింటివా రెండవత్రేంపు వచ్చినది! ఇంకఁ బట్టు ఒకటిరెండు పీల్పులు. తిత్తి నిటు పెట్టు. కాని! జయ! కాళమ్మతల్లీ! ఈ బుద్ధుఁ డీరాత్రి మాకడుపులోఁ బడునట్లు కటాక్షించు. తల్లీ! దుర్గమ్మతల్లీ! కోడికత్తించుకోకఁ గొనిపెట్టుదును. కోరలమ్మ తల్లీ! కొబ్బరికల్లు కొత్తబుడ్డిముంత చేతి కందింతును. చాముం డమ్మతల్లీ! నూఱుగొఱ్ఱెబుఱ్ఱలతో నుపారము పెట్టింతును. నూకాలమ్మతల్లీ! దున్నపోతునెత్తురుపానకము పంద్రెండుబానల బోనాలే బోనాలు! పానాలు! పానాలు! ఊ ఉ ఉ ఉ. మూము పంబరేకైన లేకపోయినది గాని యంబపదముపాడి యొక్క గంతు వెయ్యవలెననియున్నది.

అంగు—వలదు; వలదు సందడి సేయవలదు.

అల—కావునఁ తిత్తి నోటికి వంపుపెట్టి లోనికల్లును బైచర్మము నొక్క మూఱు లోనికి బుస్సున: బీల్చెద.

(నేపథ్యమున) వలదు. సోదరుఁడా! వలదు.

అంగు & అల (తొందరపడి లేచుచున్నారు.)

అల—(అప) వచ్చుచున్నాఁడు. జాగ్రత్త! జాగ్రత్త!

(బుద్ధుఁడు, ఆనందుఁడు ప్రవేశింతురు.)

బుద్ధ—వలఁదు. సోదరుఁడా! వలదు. ఇఁకఁ గొంచెము ప్రొద్దున్నది. కాన నీఁకఁ గొంతదూరము నడచి ముం దెక్కడనైన నిద్రింతము.

ఆనం—ఇఁక నడువ నక్కఱ లేదు. ఇక్కడనే పెద్దనిద్ర! అంగుళి మాలా! కన్నులు తెరవకుసుమా! (మీఁదఁ బడుచున్నాఁడు) ఆఁ!, చప్పళించెదను. నమలెదను. మ్రింగెదను. సోదరుఁడా!

నాచేతిలో కత్తి యున్నది. నీచేతిలోనున్న కత్తితోఁ బొడువు; పొడువు! ఊరకుందు వేమి? కన్నులు తెఱువకు.

బుద్ధ—సోదరుఁడా! అంగుళిమాలుఁడా! నీమిత్రుఁ డంతయాతురతతో నన్నుఁ బొడుపొడు మని ప్రార్థింప నూరకుందు వేమి? నాయనా! రావోయి! ఆతఁ డెంతయాఁకలితో నున్నాఁడో! ఏడడుగులపొడుగగున న్నొకసారి మ్రింగఁగలఁడా? చూడు. నోటికి సరిపోవునంతముక్కలుగ—చేయవోయి! కాసీ! అయ్యయ్యో! వెఱ్ఱివాఁడా! అట్లు చూచెద వేల? అట్లు కన్నుల నీరు పెట్టుకొందు వేల?

అల—సెబాస్! వహవ్వా! క్షత్రియమాంసము. ఉష్ణరక్తపూర్ణము. మదమేదురము. వహవ్వా! వహవ్వా! రే! అంగుళిమాలా! పొడువరా! ముండకొడుక! ఎక్కడ నున్నావు? కన్నులు మూసికొని యిదిగో! ఈపొట్టమీఁద! వహవ్వా! ఒక్కపోటు! తగిలించు. తగిలించు!

ఆనం—(అప) ఇతఁడు నరభక్షకుఁ డగునలవకుఁ డని తోఁచుచున్నది; స్వామీ! ఎట్లు?

బుద్ధ—నాయనా! అలవకా! నీతృష్ణను నేను నివారింతును. తొందర లేదు. నన్ను వదలుము. కూర్చుండుము. నాకంటె నీవు బలాఢ్యుఁడవు కావు. నిన్ను వదలిపించుకొనుశక్తి నాకు లేకపోలేదు. నాయనా! అట్లు నేఁ జేయునెడల నీశరీరము నొచ్చిపో[illegible]? నీబాధ నాది కాదా? కాలిక్రిందిచీమనైనఁ ద్రొక్కకుఁ[illegible]నె ట్టుమీఁదిపువ్వునైనఁ ద్రుంపకుండ, హింసాకర్మమున కొ[illegible] రుఁడనై కాలక్షేపమును జేయునేను—నాసాటిసరుఁడ—నా[illegible] సోదరుఁడవు—మీఁదుమిక్కిలి నారక్తమాంసము లారింప[illegible] దలఁచి నాసన్నిధికిఁ క్షుద్బాధతో వచ్చినపుణ్యస్వరూపుఁడ వై[illegible]

యతిధివి—అట్లైనీకు దేహము కుందునట్లు చేసెదనా? నెత్తి
నొక్కవెంద్రుక మఱుగునట్లయినఁ జేసెదనా? నాయనా! వి..!

అంగు—(తనలో) కన్నుల మూసికొంటిని గాని చెవులెట్లు మూసికొం
దును?

అల—నేను నిన్ను మ్రింగుదు నని కొండంతయాస పెట్టుకొని వచ్చితి
ని. ఈపిఱికిలంజకొడుకు నన్ను మోసపుచ్చినాఁడు.

బుద్ధ—వలదు. కఠినవాక్యము లాడవలదు. ఒకనినిఁ దిట్టుట తప్పు.
ఆతఁ డేమి చేసినాఁడు?

అల—ఆతఁడు ముందు నిన్నుఁ బొడుచుటకుఁ దరువాత నేను దినుటకు
మాప్రభువులయొద్ద నేర్పాటు చేసికొనివచ్చితిమి.

ఆన—(అప) వారెవ్వరో కనుఁగొనుఁడు?

బుద్ధ—వారిరహస్యములు మన కేల? అలవకా! ఆతఁడు నన్నుఁ బొడు
వలేదని నీవాఁతని నిందింపకుము. నీకింక నిష్టమున్నయెడల నా
తనిని బతిమాలుకొని నన్నుఁ బొడిపించుకొందును.

అంగు—(తనలో) అది నేను జచ్చినతరువాత—

బుద్ధ—కావున సోదరుఁడా! కూరుచుండుము. నే నెక్కడకుఁ బోవు
దును?

అల—నీవుగూడ నన్ను మోసముచేయుదువేమో?

బుద్ధ—నీయిష్ట మెట్లో నీకట్లు చేసినఁ జాలుచుగద! ఇంకను - నీకు న
న్నుఁ దినవలయు ననుబుద్ధి పూర్ణముగ నున్నయెడల నన్ను నేఁ
గోసికొనియైన నీనోటఁ బడెదను. సోదరుఁడా! నావంకఁ జూడ
కన్నులట్లు గట్టిగ మూసికొంటివేమి?

మాంత్రికుఁడవు కావున నట్లు చేయవలసిన దని యాజ్ఞయై

బుద్ధ—బుద్ధశిష్యుఁడ వయ్యు న్నిట్లాచరింతువా?

ఆనం—క్షమింతురుగాక!

బుద్ధ—అట్లయిన నీవు కన్నులు మూసికొనియే యుండుము. నిన్ను నాతొడపై మెల్లగఁ గూరుచుండఁబెట్టుకొందును. (అట్లు చేయును.) అంగుళిమాలా! నీవుకూడ నాయొద్దఁ గూరుచుండుము.

ఆనం—(తనలో) బుద్ధాచార్యుఁ డెట్టిలోకాతీతగుణాప్రపూర్ణుఁడో! తన్నుఁజీఁకకొని తినవచ్చినవానిని బుత్త్రునివలెఁ దొడపైఁ గూరుచుండఁబెట్టుకొని బుజ్జగించుచున్నాఁడు. ఆహా! ఎంతవింతగ నున్నది!

బుద్ధ—అంగుళిమాలకా! సందేహింపకుము. దగ్గఱగ రమ్ము.

అంగు—నేను దుర్మార్గుఁడను.

బుద్ధ—దుర్మార్గుఁడ వని నీకు గోచరించినది కావుననే రమ్మంటిని. సన్మార్గుఁడ వని నీకెట్లే గోచరించునప్పుడు మతిబోధకై దూరముగఁ బొమ్మనియే చెప్పుదును.

అంగు—(దగ్గఱఁ గూర్చుండును)

బుద్ధ—అంగుళిమాలా! నీచేతఁ బొడిపించుకొందు నని నేను నీమిత్త్రునితో నంటిని. ఇదిగో! గొంతుకకోయుము.

అంగు—అయ్యా! క్షమించుఁడు.

బుద్ధ—నిన్ను నేను క్షమించిన నాన్నితఁడు క్షమింపవలదా?

అంగు—ఆతనినిగూడ మీరే క్షమింపవలయును.

బుద్ధ—నీవృత్తి గొంతుకోఁతలవృత్తియే కదా? ఇదివఱకు తులో కోసియుంటివే! ఇప్పు డీయొక్కగొంతును నీకోసం దేహ మేల?

అంగు—మిముఁ జూచుతోడనే నామన స్సెట్లో తిరిగిపోయిది

అలవ—కన్నులు తెఱవవలదని చెప్పిన పిదప తెఱచి నాకొంపఁ గూ ల్చినావు.

బుద్ధు—సోదరుఁడా! నీవింకఁ గన్నులు గట్టిగ మూసికొనియే యుం డుము.

అలవ—కన్నులు మూసికొంటిని గాని చెవులలోనుండి మీమాటలు గుండెలోకి దూరి పిల్లి యెలుకను గొఱుకునట్లు లోన దేనినో కాని కొఱుకుచున్నవి!

బుద్ధు—అంగుళిమాలా! నీవింక నన్నుఁ బొడుచెదవా?

అంగు—మీరు సెలవిచ్చినది మఱి దేనినైనఁ జేయుదును.

బుద్ధు—అట్లైన నీకత్తి నాకిమ్ము.

అంగు—ఏల? పొడుచుకొని యాతని కాహార మగుదురా?

బుద్ధు—అనినమాటకుఁ దిరుగఁదగదు కదా? (కత్తి తీసుకొనును.) అల వకా! ఇదిగో! కత్తి. నీమిత్రుఁడు పిఱికివాఁడు. నీవే నన్నుఁగోసి భక్షింపుము.

అల—నేను నరమాంసమును దినువాఁడనే కాని నరులఁ గోయువాఁడను గాను. ఆమెండ త్రెంపులవృత్తి యీతనిది. లభించిననరమాంస మును భక్షించువాఁడనే కాని నరులఁజంపువాఁడను గాను.

బుద్ధు—సోదరుఁడా! ధర్మసూక్ష్మమునే చెప్పితివి. నీకు నరమాంస మావశ్యకము గదా? హత్యలేనిదే యది సంభవింపదు కదా? నరహత్యవృత్తినిగూడ నేల చేసికొనరాదు?

అల—మేఁకమాంసమును దినువాండ్రెల్ల కటికవానివృత్తిని జేసికొం దురా?

బుద్ధు—ఎందులకుఁ జేసికొనరోకూడఁ జెప్పెదవా?

అల—అది చేసికొనఁదగినది కాకపోవుటచే—

బుద్ధు—అనఁగ—

అల—దానివలన దోష మున్నది.

బుద్ధు—అటులే—

అల—నరహత్య నేను జేయను. నాకలవాటు లేదు. నాకుఁ దగదు. నానమ్మకము నాది.

బుద్ధు—అంగుళిమాలా! వినుచుంటివా నీమిత్రునిమాటలు? నరహత్య దోష మని యాతఁ డనునప్పు డావృత్తియే నీకేల? నీమిత్రుని తోపాటు నీవుకూడ నంతకంటె నరమాంసభక్షణవృత్తియే చేసికొనరాదా?

అంగు—నరమాంసభక్షణమా? ఆపేరు తలపెట్టకుఁడు. నాకొడలు గఱి పొడుచుచున్నది. అంతయభక్ష్యభక్ష్యము మఱియొకటి యున్నదా? అది నరుఁడు చేయవలసినపని కాదయ్యా! అట్టిఘోరకృత్యము మఱియొకటి లేదు. అది నేను జేయఁదగినది కాదయ్యా! నానమ్మకము నాది. నేఁజేయుపనికూడ ఘోరకృత్యమే. కాని నరులను నరులు యుద్ధములలోఁ జంపుకొనుచున్నారు. గుడిసె ప్రేటులకొంపలలోఁ జంపుకొనుచున్నారు. కల్లుపాకలలోఁ జంపుకొనుచున్నారు. పట్టరానితామసము వచ్చినప్పుడు సంసారములలోఁ జంపుకొనుచున్నారు. సరి. దారిగొట్టుటలో నావలెనే చంపుకొనుచున్నారు. నేఁజేసికొనువృత్తి నాతోపాటు మఱికొందఱు సేయుచున్నారు. కాని నరమాంసభక్షణవృత్తి చేయువాని నెవ్వనిని నేను వినియుండలేదు. తనవృత్తికంటె నావృత్తి పాపతరమని చెప్పుటచేత నింతచెప్పితిని. క్షమించుఁడు.

బుద్ధు—సోదరుఁడా! అలవకా! అంగుళిమాలునిమాటలు వింటివా? తన వృత్తియే నీవృత్తికంటె మంచి దనుచున్నాఁడు. అదిగాక నరహత్య చేయువాఁ డున్నఁగాని నీవృత్తి సాగనే సాగదు. ఇంత స్వతంత్రత లేనియీదిక్కుమాలినవృత్తి నీ కెందులకు? నాయ

నా! మానివేసి నిక్షేపముగ మేఁకమాంసమునే తినరాదా? క
టికవాండ్రకుంగూడఁ గొదువ లేదు.

అల—తమసెలవు ప్రకారమే చేసెదను.

బుద్ధ—నాయనా! నే నొకని నాజ్ఞాపించువాఁడను గానే. నీకు సహేతు
కమని తోఁచినయెడలఁ జేయుము.

అల—నాకు మనఃపూర్వకముగఁ దోఁచినది. నేను మేఁకమాంసమునే
తిందును.

బుద్ధ—అంగుళిమాలా! వింటివా? మిత్రత్వఫల మూరకె పోవునా?
నరభక్షణముదూష్యమని నీవనుసరికి నీమిత్రుఁ డావృత్తినే వద
లుకొనినాఁడు. నీవుకూడనరహత్యను వదలుకొని నోరులేని మేఁక
లతలగొట్టుకొని జీవింపరాదా?

అంగు—ఆవృత్తిమాత్ర మేమంత మంచిది? నరులైనయెడలఁ గోపము
తోఁ జంపవచ్చును. మేఁక నట్లు చేయుటెట్లు? ఒక్కభాగ్యవం
తునిగొంతుకఁ గోయునెడల నిల్లు నిండును. ఎన్ని మేఁకలను గో
సినయెడల బుట్టెఁడురాగికాసులు వచ్చును. నరునిజంపుటయైనఁ
గొన్ని విధముల మంచిది కాని మేఁకనుజంపుట బొత్తుగ మంచి
ది కాదు.

బుద్ధ—అంగుళిమాలా! కటికవాం డ్రందఱు నీయట్టియంతఃకరణము గ
లవారే యగునెడల మాంసోదరుఁ డగునలవకునకు మేకమాంస
మెటనుండి వచ్చును?

అల—అయ్యా! నా కక్కఱ లేదు. శాకములనైనఁ దిని బ్రదికెదను.
కాని దుష్టవృత్తియొక్కఫలమును నేనుమాత్ర మనుభవింతు
నా? ఒకనివృత్తితో సంబంధమైనవృత్తి నా కక్కఱ లేదు. నా
మట్టునకు నే నొకనికి బాధలేకుండ నొకనిబాధ నాకు లేకుండఁ
గాలక్షేపము సేయఁగలను.

బుద్ధ—నాయనా! అలవకుఁడా! బుద్ధిమంతుఁడవు.

అల—అయ్యో! మీస్వరూపము నీదినమున మొదట చూచినప్పటినుండియు నాకుఁ గలిగినభయ మిప్పటికిఁ దీఱినది. నే నింకఁ గన్నులు తెఱచెదను (తెఱచి లేచి) అయ్యయ్యో! మీతోడఁ బైనుంటి నేల? అపచారము కాదా? నమస్కారము. (నమస్కరించును.)

అంగు—(లేచి) మహాత్మా! దాసులము కటాక్షింపుఁడు. మేమిద్దఱము గూడ గొప్పకుటుంబములలోఁ బుట్టినవారము. కొంతవిద్యఁ గూడ నేర్చినవారము. మాకు సరిగఁ బ్రాయము వచ్చునరికి మాతండ్రులు కాలధర్మము నొందిరి. యుక్తకాలమందు మమ్ము దిద్దువారు లేక పాడుకావలసినచిట్టచివరమితివఱకుఁ బోయితిమి. ఇప్పటికి మీరు మమ్ముద్ధరించుటకుఁ గానఁబడినారు. మాదుష్టవృత్తు లడఁగినవి. ఇదిగో! లెంపలు కొట్టుకొనుచున్నాము. కొట్టుకో! అలవకా! (కొట్టుకొందురు.) లోకగురు లగుమీరు మాకేదైనఁ దారకమార్గము బోధించి మమ్ముఁ గృతార్థులను జేసినఁగాని మీపాదములను వదలము. పడు. అలవకా! (సాష్టాంగముఁ జేయుదురు.)

బుద్ధ—ఆనందా! పాపము నేలఁ బడినారు. వారిని లేవఁదీసి యిటఁ గూర్చుండఁబెట్టుము.

ఆనం—లెండు; లెండు!

బుద్ధ—మనుజు లేయేపనులు సేయకుండఁ బ్రవర్తింపవలయునో దానిని గూర్చి చెప్పెదను.

ఆనం—నీతిమార్గమునుగూర్చి మహాత్ములు బోధింతురు. సావధానులై వినుఁడు.

బుద్ధ—మీకిప్పటికిఁ గావలసినదియుఁగూడ నదియే చూడుము! అలవకా! కత్తితీసికొని నిన్ను నీవు కొట్టుకొనవల దని యెవఁడైన నీకు బోధింపవలయునా?

అల—అట్టిబోధనము వెఱ్ఱివానికైన నక్కఱలేదు.

బుద్ధ—ఏల? అంగుళిమాలా!

అంగు—ఎవనిని వాఁడే కొట్టుకొనునా?

బుద్ధ—నొప్పులుపెట్టుచున్నతనకాళ్లను దాను గుద్దుకొనఁగూడదా? ఏమి ఆనందా!

ఆనం—అది తనబాధను నివారించుకొనుటకుఁ గాని తన్ను బాధించుకొనుటకుఁ గాదు.

బుద్ధ—సరే! గీ. ఒకతనువులోన నొకభాగ ♦ మొక్కభాగ
మున కొసఁగుసుఖదుఃఖముల్ ♦ తనువు విడియు
నొండెయంత్రభాగంబు వే ♦ ఱొంట నంట
వన్నియుఁ జలించు నద్దురా ♦ నన్ని యాఁగు.

ఆనందా! కావున—

ఆనం—కొట్టునది కొట్టఁబడునది యొక్కదేహభాగములే కావున నెవనిని వాఁడు బాధించుకొనఁడు.

బుద్ధ—అంగుళిమాలా! పుత్త్రునిదేహము తండ్రిదేహమునుండియే కదా వచ్చును?

అంగు—అభ్యంతర మేమి?

బుద్ధ—అలవకా! అందుచేఁ బుత్త్రిదేహమే తండ్రిదేహము కాదా?

అల—నిస్సందేహముగ—

బుద్ధ—అటులైన తండ్రి కొడుకు నెన్నఁడైనఁ గొట్టఁడా?

అంగు—తప్పొనర్చినప్పుడు—

బుద్ధ—ఆనందా! ఇచ్చట తనదేహమును దా నేల కొట్టుకొనినాఁడు?

ఆనం—తనదేహమే పుత్త్రునిదేహ మనుజ్ఞానము లేక—

బుద్ధ—అలవకా! తెలిసినదా?

అల—తెలిసినది. మహాత్మా!

బుద్ధ—అలవకా! ఇట్టిజ్ఞానము తండ్రికిఁ బుత్త్రునియెడలనే లేనపుడు పరులయెడల నుండునా?

అల—ఉండదు; ఉండదు!

బుద్ధ—జను లట్టియజ్ఞానావృతులు కావుననే—నిన్ను నీవు హింసించుకొనఁ గూడదని చెప్పనక్కఱలేకపోయినప్పటికి నీసాటిప్రాణులను హింసింప వలదని చెప్పవలసి వచ్చినది.

గీ. పరమతుచ్ఛకీటముమొదల్ ♦ నరులవఱకు
నెట్టిప్రాణిని నీవు హిం ♦ సింపఁగూడ;
దెవరిచే నట్టిహింస సే ♦ యింపవలదు;
హింసఁ జేసెడువారి మ ♦ న్నింపఁ దగదు.

గీ. స్వల్పబాధ నైనను జంతు ♦ సమితి కెపుడు
నీవు సేయకు మొరునిఁ జే ♦ యింప కయ్య!
బాధకరులకు తిఁ జె ♦ ప్పం గదయ్య!
యొట్టపెట్టనియెడల వే ♦ ఱుండు మయ్య!

ఆనం—మహాత్మా! నీతిబోధమున నొట్టపెట్టనివాఁ డుండునా?

అంగు—అందులకు మేమే దృష్టాంతములము.

బుద్ధ—గీ. అజ్ఞతను దెచ్చుకొన్నదొం ♦ గమ్మవారి
చలువకై నోరులేనియ ♦ జంబుచెవిని
జనుఁడు కోయుట సత్యదృ ♦ ష్టిని గనంగఁ
దనదుగొంతుకఁ దాఁ గోసి ♦ కొనుట గాదె?

అంగు—అలవకా! వినుచున్నావా? బలిరూపక మగునత్యల్పహింసయుఁ
గూడ వలదు.

బుద్ధ—గీ. ఇచటికాంతలు చాలక ♦ యెటనొ యున్న
యూర్వశిని దనకుండలా ♦ లూఁగ ముద్దుఁ
గొనఁ దలఁచి హాహామవహ్ని ♦ మేఁ కను దహింప-
వ్యసనములఁ దన్ను మాడ్చుకొం ♦ టగును గాదె?

ఇఁక బుద్ధభిక్షుకులయహింసాధర్మము వృక్షలతాదిప్రపంచమందుఁగూడ
వ్యాపింపవలసియున్నది.

గీ. తీఁగపైఁ గ్రాలుపూలను ♦ ద్రెంపుకంటెఁ
దనదుకను లూడఁదీసికోఁ ♦ దగును యతికి;
ధరణిలోనుండుమూలముల్ ♦ త్రవ్వుకంటెఁ
దనదునెముకలు పెకికికోఁ ♦ దగును యతికి.

అంగు—ఆహా! ఆచార్యోత్తమా! మీహృదయమునఁ గరుణ యెంత
మట్టునకు వ్యాపించినది!

అల—అట్లైన మాంసభక్షణము పూర్ణముగ మానివేయవలసినదే-

బుద్ధ—అందునుగూర్చి నీమట్టునకు నీవిదివఱకే దృఢనిశ్చయుఁడ వైతి
వి కాదా?

అల—అయితిని. మహాత్మా! అందఱుకూడ మాన్పదగినదే కదా యను
చున్నాను.

బుద్ధ—ముఖ్యముగ మానివేయఁ దగినదే కాని, అంతకంటె మొదట
తృష్ణ మానఁదగినది. అది మానినపిమ్మట నీప్రశ్న కవకాశ
ముండునో లేదో యోజించుకొనుము.

ఆనం—మహారాజులయుద్ధములఁ గూర్చి మీయభిప్రాయ మేమి?

బుద్ధ—గీ. ఒడలు విఱుచుచుఁ జఱచుచుఁ ♦ దొడలఁ గయ్య
మునకుఁ బని లేక కాల్దువ్వఁ ♦ జనదు కాని

యన్నివిధములఁ బోరాట ♦ మాఁగనప్పు
డాత్మరక్షకై తగునంతె ♦ యర్హ మయ్య!
అహింసనుగూర్చి యిది చాలును. ఇఁకఁ జౌర్యము.

గీ. తృష్ణను హరింప నేపాటు ♦ లేని పడవ
లపిననరునికిఁ దనసొమ్మె ♦ మసిగఁ దోఁప
నొకనిసొమ్మేల? నన్యాపి ♦ కున్న సతియె.
వ్యర్థమైయుండఁ బైదేవు ♦ లాట లేల?

గీ. బలమునను గాని మాయల ♦ వలనఁగాని
పరులధనమును హరియింపఁ ♦ బాపకృత్య
మొకనిచేఁ హరింపించుట ♦ యును వృజినమె.
చోరులను బాపజనులుగఁ ♦ జూడవలయు.

గీ. ఇచ్చినది పుచ్చుకొనువాఁడె ♦ యిచ్చువాని
కంటె గౌరవహీనుఁడు ♦ గాఁగ నీయ
కుండ గ్రహియించునాతనిఁ ♦ కున్న ఘనత
యెంత యని చెప్పనలయునో ♦ యెఱుఁగరాదె?

ఇంకఁ జమత్కారములైన దొంగతనములు గొన్ని యున్నవి.
అంగు—మహాత్మా! జన్మచోరుల మగుమాకుఁగూడఁ జమత్కారము లేనా?

బుద్ధ—గీ. కడుపులోబిడ్డ యాడమి ♦ వడఁకుగర్భ
వతిని బగటికత్తి కటారి ♦ బందిపోటు
బంటగుభిషక్కు గని సొమ్ము ♦ వడిని వేయు;
నపుడె తనకడుపులో బొమ్మ ♦ యాడుటకును.

గీ. తప్పనేరముచే శిక్ష ♦ తగులు ననుచు
వడఁకునరుఁగని జలతారు ♦ పాగజుట్టు

కోరమీసాలవడిసేతి ♦ బీరకాయ
న్యాయవాది గుల్లనుజేయు ♦ నతనికొంప.

గీ. మనసులోఁ దృష్ణ, నాల్కపై మధువు, తాసు
నందు దాళువ, సవ్యహ ♦ స్తాగ్రమందు
నెగుపు, కుడిచేతిలోఁ బొల్లు ♦ నెదుటిబుట్ట
ధనముగలచేరి చోరర ♦ త్నంబుగాఁడె?

ఇట్టిపెద్దమనుష్యుల నెందఱిని జెప్పఁగలను? ఇఁకఁజాలును. దప్పిచేఁ బ్రాణములు తహతహనొంది యవసానము సిద్ధించునప్పుడైనను సరె కాని యొక్క వేఁపపండునైనఁ దల్లతాధికారి నడుగకుండఁ ద్రుంపఁగూడదు.

అంగు.—(తనలో) పరధనమందలిగౌరవ మింతదూరము వ్యాపింపవలసియుండ నెట్టిపాపుఁడ నైతిని.

బుద్ధు.—గీ. పరులకనకంబు హరియించు ♦ వాఁడు దొంగ
పరులకాంతల హరియించు ♦ వాఁడు విటుఁడు
గానఁ జౌర్యము వ్యభిచార ♦ కలన తృష్ణ
కడుపునఁబుట్టినకవల ♦ కాన్పు లగును.

గీ. ఈతఁ డతనిపని నతఁడు ♦ నితనిపనిని
వడినిఁ జేయుదు రలవాటు ♦ వలనఁ దఱుచు
తరుణితలఁ బ్రాలవేళ ని ♦ దమిద మన్న
మష్టవర్షపారణ నను ♦ నగ్రజులటు.

గీ. సుదతి నెన్నఁడు కనఁబోకు; ♦ చూచినపుడు
చూడనట్లె రొంచుము; మాట ♦ లాడవలయు
నపుడు తలవంచి మెల్లగా ♦ స్వచ్ఛబుద్ధిఁ
గొలఁదిమాటలు మృదువుగాఁ ♦ బలుకు మయ్య.

తే. గీ. వృద్ధసతియైనఁ దల్లిగా ♦ నెన్నవలయుఁ
దరుణియైన సోదరిగాఁగఁ ♦ దలఁపవలయు
బాలయైన నీబిడ్డగాఁ ♦ జూడవలయుఁ
బరవనితఁగూర్చి నాల్గవ ♦ వరుస లేదు.

తే. గీ. ఒకఁడు విడిచినగుడ్డ వే ♦ ఱొకఁడు దాఁకఁ
డొకఁడు కొఱికినపండు వే ♦ ఱొకఁడుముట్టఁ
డొకఁడు మూత్రించుచోట వే ♦ ఱొకఁడు వంగఁ
డెట్టితుచ్ఛాత్ములో వీటు ♦ లెంచరాదె?

వ్యభిచారమునం దొకవింత మాహాత్మ్య మున్నది.

తే. గీ. అగ్గి నంటక వస్తువు ♦ బుగ్గికాదు
మట్టి నంటక వసనంబు ♦ మైలపడదు
కొండి యంటకుండఁగ దేలు ♦ కుట్టఁజాల
దొడలు తాఁకకే యిది నరు ♦ నుడిచివేయు.

నాయనలారా! ఈదిక్కుమాలినప్రసంగ మింకఁ జాలునా?

ఆనం—చిత్తము.

బుద్ధ—అంగుళిమాలా! నీపే రలవకుఁడే కాదా యని నిన్నెవ్వఁడైన నడిగినయెడల నీవేమనఁ దగినది?

అంగు—కాదనఁదగినది.

బుద్ధ—అట్లనక నీవూరకుండు వనుకొనుము. అది తప్పేనా?

అంగు—చిత్తము.

బుద్ధ—అట్లూరకుండక నాపే రలవకుఁడే యందు వనుకొనుము. అదియో?

అంగు—అదియుఁ దప్పే—

బుద్ధ—అలవకా! మొదటితప్పునకు రెండవతప్పునకుఁ భేదమున్నదా?

అల—ఉన్నది.

బుద్ధ—అది యేదో చెప్పఁగలవా?

అల—మొదటిదానిలో యథార్థమును వెల్లడిపఱచనితప్పు. రెండవదాని లోఁ బ్రత్యక్షమగుసత్యమును జెప్పనతప్పు.

బుద్ధ—శ్లో॥. గీ. సత్యగోపన మనుచు న ♦ సత్యకథన
మనుచు ముఖములు రెండుండు ♦ నయ్య మృషకుఁ
గళుకుజల్తారుబట్టదారు ♦ కాశిపట్టు
బట్టలను మెఱుంగును మోట ♦ వైపులట్లు.

బుద్ధ—అలవకా! ఈరెండుతప్పులలో నేది దోషతరము?

అల—మిథ్యాకథనము.

బుద్ధ—అంగుళిమాలా! నీయభిప్రాయముగూడ నదియేనా?

అంగు—చిత్తము.

బుద్ధ—అలవకా! అన్న మిడక తండ్రి నొకఁడు చంపును. ఇది తప్పేనా?

అల—చిత్తము.

బుద్ధ—విషముపెట్టి తండ్రి నింకొకఁడు చంపును. ఇది తప్పేకద!

అల—చిత్తము.

బుద్ధ—ఇద్దఱు పితృవధపండితులే కద!

అల—చిత్తము.

బుద్ధ—గీ. సత్యమును దాఁచి జనుని మో ♦ సంబు సేయఁ
బస్తుపెట్టి తండ్రిని జంపు ♦ పగిది సుమ్ము;
మృషల వచియించి యొరుని బా ♦ ధించు పేత
విషము పెట్టి తండ్రిని జంపు ♦ విధము సుమ్ము.

బుద్ధ—అలవకా! ఆలోచించి యీరెంటిలో దోషతర మేదియో తిరిగి చెప్పఁగలవా?

అల—రెండును సమాన దోషములే.

బుద్ధ—అంగుళిమాలా! నీయభిప్రాయముగూడ నదియేనా?

అంగు—చిత్తము.

బుద్ధ—అలవకా! విషము పెట్టి తండ్రిని గొడు కెంతకాలములోఁ జంపఁగలఁడు?

అల—ఎంతో కాల మెందులకు? ఒక్కజాములో—

బుద్ధ—అంగుళిమాలా! పస్తుపెట్టి తండ్రి నెంతకాలములో సామాన్యముగఁ గొడుకు చంపఁగలఁడు?

అంగు—రెండుమూఁడువారములలో—

బుద్ధ—ఆనందా! అన్ని బాధలలో నేబాధ దుస్సహతమ మైనది?

ఆనం—క్షుద్బాధ—

బుద్ధ—అలవకా! చావుకతప్పనితండ్రి కొకజామువిషబాధ మంచిదా? మూఁడువారములక్షుద్బాధ మంచిదా?

అల—విషబాధయే మంచిది.

బుద్ధ—అట్టిచోఁ బైతప్పులు రెండు సమానదోషము లగునా?

అల—కావు.

బుద్ధ—అంగుళిమాలా! కాక?

అంగు—సత్యగోపనమే దోషతరము.

బుద్ధ—నిజమే! నాయనా.

తే. గీ. శయ్యఁగోఁ బాము సత్యసం♦ఛాదనంబు
కనఁబడినపాము మిథ్యాప్ర♦కల్పనంబు
తుప్పచాఁటుపులి నిజము ♦ గప్పు టగును
బడిదెగినపులి యగు మృషా ♦ వాదనంబు.

సోదరులారా! సత్యవాదులని బిరుదముగలజనులలో నూటికేఁబదిమంది సత్యగోపనము చేయువారై కానఁబడుచున్నారు. వారు ప్రత్యక్షమృష లాడరు. అంతవఱకు వారిని గౌరవింపఁదగును. సత్యగోపనము తప్పుకాదను దురభిప్రాయమునుచే నట్లు చేయుచుందురు. వారిని

నిండితపఁ బగదు. తెలిసియుండినయెడల వారట్లు చేసియుండరు. ఒకతప్పును దిద్దువారు రెండవదానిని దిద్దుకొనలేకపోవుదురా?

ఆనం—మహాత్మా! అసత్యము ప్రత్యక్షస్వరూపము. సత్యగోపనము ప్రచ్ఛన్నస్వరూపము. సత్యగోపనమును మనము దెలిసికొనుట యెట్లు?

బుద్ధ—అంగుళిమాలా! ఆనందుఁ డడిగిన ప్రశ్నము నీకర్థ మైనదా?

అంగు—ఒకమనుష్యుఁడు సత్యగోపనము చేసినట్లు మన మెట్లుగ్రహింపవచ్చు నని యడిగినాఁడు.

బుద్ధ—సీ. ఒకమాట యెఱుగ వే ♦ఱొకమాటఁ జెప్పఁచుఁ
దలవాంచునట్టి యా ♦ తండు దొంగ
ప్రత్యక్షముగఁ బల్కఁ ♦ బడినమాటల విని
విననట్లు లుండు నా ♦ జన్ముఁడు దొంగ
మాటాడుమనుజుని ♦ మాఱుమాటలతోడ
మఱపించునట్టి యా ♦ నరుఁడు దొంగ.
చెప్పంగఁదగినది ♦ చెప్ప నిష్టము లేక
దరికి రానీని యా ♦ తండు దొంగ
పలుకు పలుకులకును దల ♦ నిలువుగాను
యడ్డముగను రెండునుగూడ ♦ నట్లొయూపి
కణుగు మెఱుగు లేక చిఱున ♦ గవులచేత
మనుజు సాగనంపఁగఁ జాలు ♦ జనుఁడు దొంగ..

సత్యగోపనము చేయఁదలఁచువా రిట్లు తఱుచుగఁ జేయుదురు.

అంగు—ఇట్లాచరించుట కెంతమాత్రమును వీలు లేక యేదియో యొకమాటఁ బలుకక తప్పనప్పుడు జనులు ప్రత్యక్షముగ నసత్యమాడుదురు కాఁబోలు!

బుద్ధ—ఇట్టి బలాత్కారముచేతనే కాదు. పనికట్టుకొని పోయి యస

త్యము కొంద ఆడుదురు. విలాసార్థముగఁ గొంద ఆడుదురు. ఏవిధముగ నాడినను మిథ్యావాదియొక్క ముఖ్యోద్దేశ మేమై యుండును?

అంగు—జనుల మోసపఱచుట.

బుద్ధు—అలవకా! మోసపఱచి.

అల—ధనలాభము నేదో పొందును.

బుద్ధు—నేరగానికి న్యాయసభలలోఁ బ్రమాణ మేల లేదు?

అల—అతఁ డసత్యమాడు ననునిశ్చయముచేత—

బుద్ధు—అసత్య మేల తఱు చాడును?

అల—శిక్షను దప్పించుకొనుటకు—

బుద్ధు—ఇక్కడ ధనలాభ మున్నదా?

అల—లేదు.

బుద్ధు—మఱేమున్నది?

అల—రాఁబోవునాపదను దప్పించుకొనుట—

బుద్ధు—ధనాపేక్ష లేనప్పుడుగూడ గొందఱు కూటసాక్ష్యము లేల యిచ్చెదరు?

అల—ఒకని నాపత్తుఁ దెచ్చుటకు—

బుద్ధు—అసత్యకథనమునకు ధనలాభముమాత్రమే ఫలము కాదుకదా!

అల—నిశ్చయము. కాదు. మఱికొన్నిగూడఁ గలవని బోధపడినది.

బుద్ధు—ఇట్టిఫలము లన్నిఁటిని నసత్యవాది మోసముననే పొందును గాదా?

అల—నిశ్చయము.

బుద్ధు—జనసమ్మర్దముగా నుండుసమయము కనిపెట్టి నిమ్మళముగఁ దూములోనుండియో గోడ దాఁటియో కుక్క లోనికి వచ్చి

యన్నము నేల తినవలయును? సింహద్వారము వెంబడిని వియ్యం
కునివలెఁ బ్రత్యక్షముగ రాఁగూడదా?

అల—జనులు చావమోదుదు రనుభయముచే నది యట్లు రాదు.

బుద్ధు—కుక్క మనుజునికంటెఁ బిఱికి దగుటచేత నేకదా?

అల—చిత్తము.

బుద్ధు—జనులకనుల మూసి లాభమును బొందువాఁడుమాత్రము ధై
ర్యము గలవాఁడా?

అల—కాదు. పిఱికివాఁడు.

బుద్ధు—మనుజులకు జడియుటయందు దొంగకుక్కకు, నసత్యవాదికి
భేద మున్నదా?

అల—లేదు.

బుద్ధు—కుక్క యుదరపూరణాదివిషయసుఖములే ప్రధాన మగుజం
తువు కాదా?

అల—అట్టిదే.

బుద్ధు—నరుఁ డట్టివాఁడా?

అల—కాఁడు.

బుద్ధు—కాక, ఆనందా!

ఆనం—విషయసౌఖ్యముకంటె శాశ్వతసౌఖ్యము ననుభవింపవలసిన
వాఁడు.

బుద్ధు—నీచసుఖాపేక్షగలకుక్క,నీచసుఖముకై యెట్టినీచకృత్యమునైనఁ
జేయును గాని, జ్ఞానానందసంపాదనదక్షుఁ డగుమనుజుఁడు నీచ
సుఖముకై నీచకృత్యము నట్లు చేసినయెడల—

అల—అతనికంటెఁ గుక్కయే మెఱుఁగు.

బుద్ధు—కుక్కకున్నమంచిగుణ మేది?

అల—విశ్వాసము.

బుద్ధ—అట్టివిశ్వాస మొకజనునియందు మఱియొకని కుండవలసినదే కద!

అల—ముఖ్యముగ నుండవలసినదే.

బుద్ధ—వైద్యులకు రోగులకు నన్యోన్యవిశ్వాసము లేనియెడల భేషజతంత్రమే లేదుకద?

అల—లేదు.

బుద్ధ—భార్యకు భర్త కట్టిది లేకపోవునెడల—

అల—సంసారమే జరుగదు.

బుద్ధ—గురునకు శిష్యునకు లేకపోవునెడల—

అల—విద్యావ్యాసంగము సున్న.

బుద్ధ—రాజునకు జనుల కన్యోన్యవిశ్వాసము లేనియెడల—

అల—ఆరాజ్య మింక వల్లకాడే.

బుద్ధ—కావునఁ బ్రపంచతంత్ర మంతయు విశ్వాసముననే తిరుగుచున్నట్టు కనఁబడుటలేదా?

అల—చిత్తము.

బుద్ధ—అసత్యవాదియెడల జనులకు విశ్వాస ముండునా?

అల—ఉండదు.

బుద్ధ—అసత్యవాదికి జనులయెడలనో?

అల—ఉండదు.

బుద్ధ—గీ. మత్తులేనప్డు మధువు న ◆ మ్మంగవచ్చు
మగతనంబూడ విటుని న ◆ మ్మంగవచ్చు
నంగవికలుఁడౌ చోరు న ◆ మ్మంగవచ్చు
మృషలనాడువానిని విశ్వ ◆ సింపఁ కెపుడు.

అనం—నాలుకఁగోసినపిమ్మట నమ్మవచ్చునేమో?

బుద్ధు——బ్రదికియుండునెడల సత్యగోపనమునకు మఱింతయవకాశ ము న్నదికాదా? అందుచే లోకతంత్రసమంజసత కసత్యవాది యడ్డు కాఁడా?

అల——చిత్తము.

బుద్ధు——యంత్రములం దొక్క చక్రము పండ్లూడిపోయినదో వంగినదో యుండునెడల యంత్రాధికారి యేమిచేయును?

అల——ఆచక్రము నూడఁదీసి మఱియొకచక్రము వేయించును.

బుద్ధు——అట్లైతే. -అసత్యవాదిని?

అల——సంఘమునుండి రాజు బహిష్కరింపవలయును.

బుద్ధు——అంగుళిమాలా! భర్త భార్యను విడచి మఱియొకదానిని జేరు ను. వాని నేరమేది?

అంగు——వ్యభిచారము.

బుద్ధు——భార్యనుగూర్చి తానొనర్చినప్రమాణమునకుఁ దాబద్ధుఁడై యుం డునెడల వ్యభిచరింపఁగలఁడా?

అంగు——లేఁడు.

బుద్ధు——వ్యభిచారమునకు మూలము?

అందు——అసత్యము.

బుద్ధు——న్యాయాధికారి లంచములు తీసికొని ప్రజల కన్యాయ మొన ర్చును. ఈతనితప్పున కేదిమూలము?

అంగు——అసత్యము——

బుద్ధు——అటులే.

గీ. జనుఁ డొనర్పంగఁదగినదో ♦ పంబు లన్ని
తఱచిచూడ నసత్యత ♦ త్వంబుతోడఁ
గలిసియుండని నేరమొ ♦ క్కటియు లేదు
శాంతిలేనికపాయంబుఁ ♦ జూడఁగలమె?

కొందఱు చమత్కారమునకై మాటలలో నసత్యమును జేర్చె
దరు. ఇదివిలాసార్థ మగు ననత్యము.

గీ. పలుకులందున రుచులుట్టి ♦ పడఁగ నేమొ
మృషను సత్యంబుతోఁ గొంత ♦ మేళవింత్రు
పెఱుగువడలలోపలఁ గొత్తి ♦మిరియమట్లు
యవలరొట్టెలందునఁ బచ్చి ♦ యల్లమట్లు.

మొదట లీలకొఱకుఁ జేసినపని యలవా టగును. తరువాత వ్యస
నమగును. తరువాత తీఱనివ్యాధి యగును. తరువాత దేహమ
నోనాశనము చేసి మఱివిడుచును. కావున—

గీ. కల్ల లాడవలదు; వివే ♦ కంబు గల్గి
కరుణగలబుద్ధితోడ ని ♦ ష్కారణాప
కృతిని జేయక నిజము వ ♦ చింపుమయ్య!
ఎవనిచేతను గల్ల లా ♦ డింప కయ్య!

అల—(వివేకంబుగల్గి) యని యింక నేమో సెలవిచ్చినారు. అవి నా
కుఁ దెలియ లేదు.

బుద్ధ—నాయనా! ఒకబ్రాహ్మణుఁ డత్తవారింటికిఁ బోయెను. అత్త
యింటితలుపు మూసియుండఁగఁ దలుపుసందులనుండి యాతఁడు
చూచి-యూరకుండెను. పిమ్మట యాతనియత్త తలుపుతీసి "నా
యనా! ఎప్పుడు వచ్చితి" వనియడుగ "నీవు దొండపాదుక్రిందఁ
గూర్చుండి బుట్ట గొఱిగించుకొనునప్పు" డని చెప్పఁగూడదు.
అదియే సత్యమైనను నొకపావుగడియక్రింద ననియో యసత్య
ముగానిమఱియేవిధముగనో చెప్పవచ్చును.

అంగు—"కరుణగలబుద్ధితోడ, నిష్కారణాపకృతిని జేయక" యని కూ
డ సెలవిచ్చినారు.

బుద్ధ—ఒకఁడు విశేషవ్యాధిగ్రస్తుఁడై యుండఁగ దూరదేశముననున్న యాతనిపుత్త్రుఁడు మరణించె ననువార్త వచ్చినది. సత్యము చెప్పకుండినయెడల దోషము. చెప్పినయెడల ముసలివాఁడు వృథగఁ జచ్చునేమో? ఇట్టిసంధిలో నేమి సేయవచ్చును?

అల—ఆవ్యాధి యాతనికిఁ గొంత కుదిరినపిమ్మటఁ జెప్పవచ్చును.

అంగు—ఆవార్త యేమని యాతఁడే యడుగునెడల నేమిసేయవలసినది?

అల—అప్పుడు కొంచెము సత్యగోపనము సేయవచ్చునా?

బుద్ధ—తగదు. ఆతనికిఁ జెప్పక తీరనప్పుడు చెప్పవలసినదే. కాని ధైర్యయొకమాటు గుండె గుభెల్లుమనునట్లు చెప్పక యాతనిమనస్సునకు నింద్రియనిగ్రహమును గూర్చియు జగదనిత్యతను గూర్చియు బాగుగ నచ్చునట్లు చెప్పి దుఃఖసహనమున కాతని సిద్ధపఱిచి మఱి జాగరూకతగఁ జెప్పవలయును. దేశకాలపాత్రాదుల నెఱిఁగి పలుకవలయును. సత్యమునకు నివ్వరిముల్లంతవ్యత్యయముగఁ దనప్రాణము మీఁదికి వచ్చునప్పుడైనఁ బలుకఁగూడదు. కూడదు. సత్యము శాశ్వతము. దేహములు క్షణభంగురములు. తోలుతిత్తులు. సోదరుఁడా! అలవకా! నీతోలుతిత్తిని భద్రముగనే యుంచితివి కద!

అల—క్షమింపవలయును. (పాఱవైచి వచ్చును)

బుద్ధ—అందులోనున్నది కల్లే కాదా?

అల—చిత్తము. క్షమింపవలయును.

బుద్ధ—దానిని బాఱవైచితి వేమి?

అల—ఇఁక దానితోఁ బని నాకు లేదు.

బుద్ధ—ఇదివఱకే విశేషముగఁ ద్రాగితివి కాఁబోలు నేమి?

అల—మహాత్మా! త్రాగితిని.

బుద్ధు—అంగులిమాలా! సంతతపరిశ్రమమువలన క్షీణించు దేహమును మన మెట్లు తిరిగి పుష్టిగలదానిగాఁ జేయుచున్నాము?

అంగు—ఆహారముచేత—

బుద్ధు—అలవకా! ఱొట్టెను క్షీరముల నందుకొఱకే పరిగ్రహించుచుంటిమి కాదా?

అల—చిత్తము.

బుద్ధు—అలవకా! యవలఱొట్టెను మాని తవిటిఱొట్టెను దినఁదగదా?

అల—తినవచ్చును గాని దేహమునకుఁ బుష్టి కలుగదు.

బుద్ధు—కావున—ఆనందా?

ఆనం—దేహక్షయమును నివారింపలేని యాహారమును విసర్జింపవలయును.

బుద్ధు—అలవకా! ఱొట్టెలోపమును గల్లు నివారింపఁగలదా?

అల—లేదు. మహాత్మా! లేదు.

బుద్ధు—క్షీరములఁ ద్రావనేల? వేరుసెనగనూనెను ద్రావరాదా?

అల—వేరుసెనగనూనె తల త్రిప్పును; వాంతి చేయించును.

బుద్ధు—కల్లో?

అల—అది యంతకంటె నెక్కువ—

బుద్ధు—అప్పుడప్పుడు పంచదార పానకమును ద్రావనేల? నల్లయులవకట్లు త్రాగరాదా?

అల—నల్లయులవకట్లు గొడ్లకు దోమ్మలో నిచ్చెదరు, దానితో బ్రాతైనఁ బగులును. అంతయుష్ణాధిక్యత గల్గువస్తువది.

బుద్ధు—సారాయియో?

అల—అబ్బో! అదికూడ మంచివేఁడిగలవస్తువు. పశువులకు దాని బలవంతముగ గొంతులోఁ బోయుదురు.

బుద్ధు—బలాత్కారమున నేల పోయవలయును?

అల—ఆవాసన వానికి గిట్టదు కాఁబోలు!

బుద్ధు—ఊలవకట్టు నంతబలాత్కారముగఁ బోయవలయునా?

అల—అబ్బే! ఏల? అది ప్రాణికోటి కాహారపదార్థముల లోనిది.

బుద్ధు—కల్లాహారపదార్థము కాదు; దానివాసన పశువులకైన గిట్టు నది కాదు; అని కదా చెప్పితివి? అందుచేత దాని నెప్పు డుప యోగింపఁగూడదుకద!

అల—కూడదు; కూడదు.

బుద్ధు—దొమ్మవంటిరోగము వచ్చి చావునకు సిద్ధమైనపశువే దానివా సనగిట్టక యది త్రాగుట కొల్లక చావునకైన నొప్పుకొని నీతిమా లినజనులు పోయుదు రేమో యనుభయముచేఁ బండ్లు గిట్టకఱ చుకొని పడియుండఁగ నేరోగము లేనిమనుజుఁడు దానివాసనను ఘ నసారవాసనగా నెంచి దానికొఱకె చేచ్చుకొని పోయి నోరంత తె ఱచి ముక్కులోనుండి కల్లుచుక్కలు పడువఱకుఁ ద్రాగుటయే కాక లోకనిర్మాణమున కిన్ని భూతము లేల యొక్కకల్లు భూత మే యుండవలయు ననియు, తనదేహమున కిన్నియవయవము లేల యొక్కనోరే యుండవలయు ననియుఁ గాళికమ్మతల్లిని ప్రార్థిం చుచుండునప్పు డాత డెట్టివాఁ డనఁదగును?

అల—గడ్డి తినుపశువుకంటె నధమాధముఁడు.

బుద్ధు—నాయనా! పాపము! విషమజ్వరములలో రోగి బుద్ధిచెడి యొ డలు తెలియక ప్రేలునుగదా!

అల—చిత్తము.

బుద్ధు—అట్టివానికి మందిప్పించి యావ్యాధి కుదుర్పవలసినదే కద!

అల—అయ్యయ్యో! ఇంక సందేహమేమి?

బుద్ధ—సంధిపోవుట కెవఁడైన మందు పుచ్చుకొనును గాని సంధివచ్చుట కెవఁడైన మందు పుచ్చుకొనునా?

అల—అట్టివాఁ డెవ్వఁ డుండఁడు.

బుద్ధ—నాయనా! నీవుంటివి కాదా?

అల—మహాత్మా! నేను సన్నిపాతజ్వరము నెట్లు తెచ్చుకొంటిని.

బుద్ధ—కల్లుసేవకమునకు సన్నిపాతమునకు భేద మేమున్నది? మెదడు చెడుటలో, నుడలు తెలియకపోవుటలో, వాంతులలో, మితిమీరినప్రేలుటలో, వెఱ్ఱిచేష్టలలో, తలదిరిగి తూలుటలో, దేహతాపములో, నాలుక కొంగుపోవుటలో, నరములపట్లు తప్పుటలో, హెచ్చుగునెడలఁ జచ్చుటలో సన్నిపాతరోగికిఁ ద్రాగుబోతునకు భేద మేమున్నది?

అల—చిత్తము. లేదు.

బుద్ధ—ప్రకృతిలోఁ గలుగుచిరంకుశము లగుమార్పులచేత సంధి వచ్చినయెడల దానిని నివారించుకొనుట మనుజధర్మము కాని, సంధిని బుద్ధిపూర్వకముగఁ బహువులైన మూర్ఖనవికల్లును ద్రావి తెచ్చుకొనుట యెట్టికృత్యమో చెప్పఁగలవా?

అల—చెప్పుటకు సాధ్యము కాదు.

బుద్ధ—విషమజ్వరముమాట యేల? సామాన్యజ్వరము వచ్చినవాఁడైనను జ్వరము నిలిచియుండఁగఁ ద్రావునా?

అల—ఆదినములలో దానిపేరైనఁ దలపెట్టుటకిష్టపడఁడు.

బుద్ధ—ఆదినములలోఁ బొగచుట్టఁ గాల్చునా?

అల—కాల్పఁడు.

బుద్ధ—పొడుము పీల్చునా?

అల—పీల్పఁడు.

బుద్ధ—అంగుళిమాలా! అందువలన నేమి తెలియవలసి యున్నది?

అంగు—నాకు బోధము కాలేదు.

బుద్ధ—నాయనా! కొలిమితిత్తి చిఱతలను బిగించి తిత్తిని నొక్కఁగఁ గాలిమిలోనికి బుస్సుమనుధ్వనితోఁ బోవున దేది?

అంగు— లోని గాలి—

బుద్ధ—గాలి యట్లు పోయినఁదిత్తి యెట్లుండును?

అంగు—మెత్తగ—

బుద్ధ—తిరిగి చిఱతలు దెఱచి తిత్తిని పైకి లాగఁగ నేమగును?

అంగు—గాలి తిత్తిలోఁ బ్రవేశించును.

బుద్ధ—ఈగాలి యెటనుండి తిత్తిలోనికి వచ్చినది?

అంగు—వెలుపలినుండి—

బుద్ధ—ఏల వచ్చినది?

అంగు—తిత్తిలోగాలి చాలఁ దక్కువగా నుండుటఁ జూచి యట్టియవకాశమును నిండించుటకు వచ్చినది.

బుద్ధ—దీనివలన నేమి తెలిసినదో చెప్పఁగలవా?

అంగు—ప్రకృతిలో గాలి యొకచోట తక్కువగ నొకచోట హెచ్చుగ నుండఁగూడదు.

బుద్ధ—ఉండినయెడల నట్టివిషమత్వ మెట్లు తీఱును?

అంగు—పెద్దవాయువు ప్రసరించుటవలనఁ దీఱును.

బుద్ధ—కావున గాలివానతో వచ్చుమహాప్రభంజన మేమి చేయును?

అంగు—గాలిలో సమత్వమును స్థిరపఱుచును.

బుద్ధ—అటులే—ఉప్పెన?

అంగు—నీటిలోని సమత్వమును స్థిరపఱుచును.

బుద్ధ—నీటిలోనిసమత్వ మనఁగ నీటిమట్ట మనియేనా నీయభిప్రాయము? శ్లేష్మవాతపైత్యము లని మూఁడుతత్త్వములు ప్రతిదేహ

మా దున్నట్లు చెప్పఁగవింటివా? దేహమునఁబైత్యతత్త్వముభోజ
నమజ్జనాది కృత్యవిషమత్వమునఁ దగ్గినయెడల నేమగును?

అంగు—శ్లేష్మము హెచ్చి పైత్యస్థానమును గ్రమ్మును.

బుద్ధు—అప్పుడు శ్లేష్మజ్వరమో, ఇతరశ్లేష్మరోగ మేదియో సంభవిం
చును. శ్లేష్మము హెచ్చుకాక వాతము పొంగి పైత్యస్థానము
ను గ్రమ్మినచో—

అంగు—వాతజ్వరమో, ఇతరవాతరోగ మేదియో వచ్చును.

బుద్ధు—రెండునుగూడ హెచ్చినచో?

అంగు—శ్లేష్మవాతరోగములు వచ్చును.

బుద్ధు—ఇవియే సన్నిపాతరోగములు. మిగులు తత్త్వములు తగ్గినపుడు
కూడ నిటులే కాదా?

అంగు—చిత్తము.

బుద్ధు—కావున వ్యాధి యనఁగ నేమి?

అంగు—దేహ ప్రకృతిలోని తత్త్వములందు సమత్వమును స్థాపించు
మార్పు.

బుద్ధు—కావున, వ్యాధి యనఁగ బాగుపడుట కాని?

అంగు—చెడిపోవుట కాదు.

బుద్ధు—వ్యాధిలోఁ జుట్టయందుఁగాని సురయందుఁగాని యిష్టముండ
దని యప్పలవకా! నీవు చెప్పితివి కాదా?

అల—చిత్తము.

బుద్ధు—వ్యాధి యనఁగ నేమో తెలిసినది కావున—నిప్పు డేమని చె
ప్పఁగలవు?

అల—బాగుపడు నవస్థలో దుర్వ్యసనములందు వాంఛ యుండదు.

బుద్ధు—ప్రకృతితత్త్వములు సమత్వములోనికి వచ్చుకాలములోను, వ
చ్చినకాలములోను నివియేవియు నక్కఱలేదు కాదా?

అల—చిత్తము.

బుద్ధ—కావున యథోచిత మగు దేహమున కివి తగనేతిగవు కాదా?

అల—చిత్తము.

బుద్ధ—తగనవ్వి యెట్లు వచ్చినవి? ఆనందా!

ఆనం—దేహతత్త్వములు స్వల్పముగ విషమము కాఁగానే తద్విషమత్వమువలనఁగలుగు కొన్ని తీవ్రతల నుద్రేకముల నివారించుటకై వచ్చియున్నవి

బుద్ధ—వచ్చి యాపనిని జేయుచున్నవా?

ఆనం—విషమత్వమును మఱింత వృద్ధిపఱిచి దేహముల విధ్వంసము సేయుచున్నవి.

బుద్ధ—కావున నలవకా! దేహసౌఖ్యమున కెంతమాత్రము త్రాగుడు పనికిరాదు కాదా?

అల—పనికిరాదు; మహాత్మా! పనికిరాదు. దేహనాశనమునకే పనికి వచ్చును.

బుద్ధ—ఇఁకఁ జిత్తమునకే దెట్టియుపయోగ మిచ్చునో చూతము. నాయనా! అలవకా! ఏనుఁగుతుండ మొక్కనిమునమైన స్థిమితము గలదిగనుండునా?

అల—ఉండదు.

బుద్ధ—ఏల?

అల—దానినైజ మది.

బుద్ధ—జనునిచిత్తమో?

అల—చంచలము.

బుద్ధ—ఏల?

అల—దానినైజ మది.

బుద్ధ—ఏనుఁగు మక్కెక్కినయెడల?

అల—తుండము మఱింత చంచలముగ నుండును.

బుద్ధు—జనుఁడు సురాపానమున మత్తెక్కినయెడల?—

అల—అతనిచిత్తము మఱింతచంచలముగ నుండును.

బుద్ధు—నీవు పరుగెత్తుచుండఁ గానఁబడినవస్తువును బాగుగఁ బరీక్షింపఁ గలవా?

అల—లేను.

బుద్ధు—ఏల? అంగుళిమాలా.

అంగు—పరిశీలించుకన్నులకుఁ గొంచెము స్థిమితత యున్నఁగాని గ్రహణము సంభవింపదు.

బుద్ధు—వస్తుగుణముల్ల గ్రహించునది చిత్తమగునప్పుడు కన్నులు చంచలములై యున్న నేమి?

అంగు—బాగుగఁ జూడని దే చిత్తమునకు జ్ఞానమెట్లు?

బుద్ధు—కావున దేహేంద్రియములు చంచలములుగ నుండినయెడల బుద్ధి స్థిమితముగ నున్నను జ్ఞానమున కవకాశము లేదుకాదా?

అంగు—లేదు.

బుద్ధు—ఒకనికి దేహము స్థిమితముగనే యున్నది. భయము చేతనో దుఃఖము చేతనో చిత్తము బహుచంచలముగ నున్నది. అట్టివాఁ డెదుటివస్తువునైనఁ బరిశీలింపఁగలఁడా?

అంగు—లేఁడు.

బుద్ధు—ఏల?

అంగు—గ్రహణప్రధానసాధన మగుచిత్తము చంచలముగ నున్నది కాన జ్ఞానముకలుగదు.

బుద్ధు—కావున?

అంగు—దేహేంద్రియములు స్థిమితముగ నున్నను జిత్తము చంచలముగ నుండునెడల జ్ఞానసంపాదనమున కవకాశము లేదు.

బుద్ధ—కల్లుఁద్రాగినవానికి దేహేంద్రియములు చంచలముగ నుండు నాఁ? చిత్తమా? అలవకా!

అల—రెండును.

బుద్ధ—కావున?

అల—జ్ఞానసంపాదనమునకు బొత్తుగ నవకాశము లేదు.

బుద్ధ—పిచ్చివానికి జ్ఞానమున్న దా?

అల—లేదు.

బుద్ధ—కావున?

అల—సురాపాయి పిచ్చివాఁడు.

బుద్ధ—కల్లుత్రాగునప్పుడు కలుగుతాత్కాలికోన్మాదము క్రమక్రమముగ వృద్ధియై స్థిరోన్మాద మగును. నాయనలారా! త్రాగుడు వలనఁ జిత్తమునకుఁ గల్గునుపయోగ మిదియైనపుడు త్రాగవచ్చునా? దేహనాశనము, మనోవిధ్వంసనము, ప్రతిష్ఠారాహిత్యము, ధనవ్యయము, సిగ్గుమాలినతనము, జనహాని మొదలగునవి సురాపానమువలనఁ గలుగుమహాపకారములు కావా?

అల—చిత్తము.

బుద్ధ—గీ. ఈఁతకల్లైనఁ ద్రాటికల్లేని జీల్గు
కల్లయిన నారికేళపుఁ గల్లు నయిన
నిట్టి వెవియైనఁ దత్సార మెట్టిదైన
నీవు డాగకు మొదని ద్రాగింప కయ్య!

గీ. అభము శుభ మెఱుంగని కాళికమ్మవారి
పేరు నీనోరు గొట్టంబు వేయవలదు;
ప్రక్క-సోమినమ్మయధర పాన మెదుట
నంజు డునునంజీ సోమపానంబువలదు;

సీ. మడతలో రొంటను ♦ మారేడుకాయయు
నెడమదానఱచేయి ♦ నడుమ డాగు
నపసవ్యకరమున ♦ నుపదేశముద్రయుఁ
బఱఁబీఁక్కుపూనిక లో ♦ పలను బుట్టి
నాసికాక్షేత్రంబు ♦ నను నెఱ్ఱనఱదయు
బ్రక్కమానిసినెత్తి ♦ పైన డఱ్ఱు
కొండనాల్కను గాటు ♦ కొఱ్ఱును తలచుట్టు
మడచు గావంచలో ♦ మరుగుదొడ్డి
యగుమహాసన్యాసరూపంబు ♦ నందువల్ల
నస్యమును ఛీల్చకయ్యో! యే ♦ నరునిచేత
నైనఁ బీల్పించకయ్య! న ♦ న్యప్రియులను
నెప్పుడు గౌరవ ముత్సాహ ♦ మీయ కయ్య!

సీ. ముంబండ్లసందునఁ ♦ బొగపీకె కొప్పును
ముక్కుముందర నుసి ♦ యెక్కునిప్పు
నోటిమూలల ధూమ ♦ ధాతుల గుప్పును
గుబ్బునోట ముత్తికి ♦ కుండుగప్పఁ
బొక్కిచచ్చినయోష్ఠ ♦ ములపైనఁ గప్పును
సాగినదౌడలఁ జప్పియొప్పు
నంగిటిలోనఁ బొ ♦ గాకువిసపుముప్పు
గుండెవేగము గొట్టు ♦ కొనెడుచొప్పు
గలుగునగముగాలిన కొఱ ♦ కచ్చుకాటి
కర్హుఁడేకాని సభకుఁగాఁ ♦ డందువలనఁ
జుట్టఁగాల్పకు; కాల్పింప ♦ కట్టివారిఁ
గూడకుము గాఁచువారినిఁ ♦ గూడకయ్య!

గీ. అక్షుల కునుకు, నోటిపై ♦ నావులింత,
శిరముపైఁ దూలు, మనసులో ♦ మఱపు, పేగు
లఁదు దిబ్బు, నోరునగబ్బు ♦ నైననల్ల
యొుడ వేయకు వేయింప ♦ కోరునిచేత.

ఆ. వె. ఎడమచేతఁజిలుము; ♦ తడిపాత గుడిచేయి
ముష్టి గోనమూతి ♦ మొగముమీఁద
మబ్బు గొంతులోన ♦ నుబ్బసమును గూర్చు
భంగ నిప్పును గొనను ♦ పరునకీను.

త్రాగుడుతోఁ గలసినపాపము లింకనైదున్నవి.

గీ. నట్టనడురేయి నిలుదాఁటి ♦ నడువవలదు;
పాటలకు నాటలకును బో ♦ వంగవలదు;
జూదమాడకు దుష్టుల ♦ చొప్పుగనకు;
మెపుడు సోమరివగుచు జీ ♦ వింపవలదు.

సోదరులారా! ఇట్టి దుష్కృత్యషట్కము నెన్నఁడును జేయరు కదా!

అంగు—ఎన్నఁడు చేయను.

అల—తమపాదములతోడు ఎన్నఁడునుగొనను.

బుద్ధ—నాయనా! అలవకా! తమపాదాలతో డని యేల యనవలయును?

అల—నామాటయందు నమ్మక ముండుటకొఱ కట్లొట్టు పెట్టుకొంటిని.

బుద్ధ—ఒట్టుకూడ మాట యే కాదా?

అల—ఔను.

బుద్ధ—అట్లైన నొట్టునుమాత్రము నేనెట్లు విశ్వసింతు ననుకొంటివి?

అల—చిత్తము. తెలిసినది కాదు.

బుద్ధ—అట్లైనఁ దెలిపెదవినుము:

గీ. కవులొనర్చు రసహీన ♦ కల్పనలకు
వాగలంకారడంబమై ♦ భవముకాని
మహితకల్పనలకుఁ బోడి ♦ మాటలెతఁగు
యతికి గొంగళి, గోఁచియు ♦ నైనయట్లు.

గీ. వాఁడుమొగమునకే పూఁత ♦ పసలు వలయు
నామహీనునకే వస ♦ నాలతళుకు
శక్తిహీనునకే స్వసం ♦ స్తవనపటిమ
సత్యహీనునకె ప్రమాణ ♦ జల్పనంబు.

నాయనా! ఒకనిపాదము లోకనికిఁ దోడెట్లగును? ఒకనిశిర మొకనికిఁ దోడగునా? ఎవనికి వాఁడే తోడు. ఎవనిబాగు వానిచేతిలోనే యున్నది. ఎవనితారకమార్గము వానిచేతిలోనే యున్నది. ఎవనిముక్తి వానికరతలామలక మయ్యేయున్నది.

నావంటివాఁడు చేయున దెంతవట్టున కనఁగ—

"ఇది కొంచెము మంచిమార్గమని తోఁచుచున్నది. నీవుకూడ నాలోచించుకొని యిష్టమైనయెడల నవలంబింపవచ్చును." అను నంతవట్టునకే—తరువాత గ్రహించుటకుఁ గాని, యవలంబించుటకుఁ గాని, యాచరించుటకుఁ గాని నీస్వాతంత్ర్యమే. పాడుకావలయునన్న నొక్కనిముసములో బుద్ధిపూర్వకముగఁ బాడు కాఁగలవు. ప్రయత్నించి యోగ్యతను సంపాదించుకొనువానిక గలుగునెడల యోగ్యుఁడవు కాఁగలవు. కనఁబడనిదేవిమహిమనో యొక్కఁడు భ్రష్టుఁ డగునని శిష్టుఁ డగునని నామతము కాదు. నాయనా! నాపాదములు నిన్నుద్ధరింపఁ జేయవు. నాపాదములకుఁ దప్పి నీవు చెడిపోవు. తెలిసినదా? నాయనా! ఒట్లు నొవ్వడు పెట్టుకొనవుకద!

అల—చిత్తము. పెట్టుకొనను.

బుద్ధు—నాయనా! అంతేకాక యెప్పుడును బరికిమాలినమాట లాడకుము. అసందర్భమైనట్టియు, నయుక్తికమగునట్టియు, నకాలకమగునట్టియు, ననుచితమగునట్టియు నాలాపముల నెప్పుడాడకుము. అంతకంటె నోరు మూసికొని యుండుట మంచిది. దేశప్రభువులఁగూర్చి, స్త్రీలఁగూర్చి కాల్పనికవస్తువులఁగూర్చి యెన్నఁడును బురాణము విప్పవలదు. దారి నడచువాఁడు నడచినదది యెంతనడచినాఁడో యికముందెంత నడువవలయునో యొకసారి చూచుకొనునట్లు నావలన మీఁదివఱకేది వినిరో చూచుకొందము. మొదటిది అలవకా!

అల—జీవహింస—

బుద్ధు—రెండవది—

అల—చౌర్యము.

బుద్ధు—ఊఁ.

అల—మూఁడవది వ్యభిచారము. నాల్గవది యసత్యము. అయిదవది మదద్రవ్యపానము. ఆఱవది యసంబద్ధప్రలాపము.

బుద్ధు—ఇఁక నేడవది. ఒకనినిగూర్చి యెప్పుడు దొంగవాఁడుకలు వైచి వానికపకీర్తి సేయుట. ఇవి యసత్యముయొక్క వివిధములగురూపములే కావా?

అల—ఔను.

బుద్ధు—కావున విశేషించి చెప్పనక్కఱ లేదు. ఒరుఁడు యోగ్యుఁడుగాను, తాన యోగ్యుఁడుగాను జనుఁ డెప్పుడెంచుకొనవలసినది. ఇందువలన యానందా! యేమిప్రయోజనము?

ఆనం—ఒరుని యోగ్యతను గ్రహించుటకుఁ బ్రయత్నించును. తనయయోగ్యతను విడువఁ బాటుపడును. రెండువిధములఁ లాభమున్నది.'

బుద్ధ—ఇఁక నెనిమిదవది. నాయనా! అలవకా! నీపొరుగువాని కున్న మేడఁ జూచి నీ వసూయపడిన లాభ మున్నదా?

అల—లేదు.

బుద్ధ—వానిసౌఖ్యముఁ జూచి నీవు ఖేదపడిన లాభమున్నదా?

అల—ఎంతమాత్రమును లేదు.

బుద్ధ—అంగులిమాలా! లేకపోఁగా?—

అంగు—నష్టముకూడ నున్నది.

బుద్ధ—ఎట్లు?

అంగు—తనకు లేదనునేడ్పొకటి, పరునకు కున్నదనునేడ్పొకటి కలియుటచేత నాత్మదుఃఖము ద్విగుణమై బాధపడును.

బుద్ధ—ఆనందా! అసూయ దేనివలనఁ బుట్టినదై యుండును?

ఆనం—ఆత్మసుఖైకలోలతవలన—

బుద్ధ—అలవకా! తెలిసినదా? అన్నిసుఖములు దనకే రావలయును దనకే రావలయు నను మహావాంఛ క్రమక్రమముగ వృద్ధియై పరున కేమాత్రపుసుఖము వచ్చిననైన నేడ్పులోనికి దిగును. ఆత్మసుఖాపేక్ష కడపటనత్యంతముగ ముదిరి యసూయ యగును. కాని, ఆనందా! ఆత్మసుఖమునే కోరుకొనువారి కది సిద్ధించునా?

ఆనం—సిద్ధింపదు.

బుద్ధ—నిజమే.

గీ. అత్యసౌఖ్యానుభూతి వాం ♦ ఛైకశీలుఁ
డైనయాతఁడు సుఖ మెప్పు ♦ డంద లేఁడు
గుఱికి నడుమను నూటిగాఁ ♦ గొట్టఁదలఁచు
చాపహస్తుఁడు గుఱివేయఁ ♦ జాలునొక్కొ!

అట్లాతనికి సుఖ మేల కలుగదో యంగుళిమాలా! నీకుఁ దెలియునా?

అంగు—తెలియదు.

బుద్ధ—తనకు సుఖము కావలయును; దనకు సుఖము కావలయు ననుకొను వానికి మనస్స్థిమితత యుండునా?

అంగు—ఉండదు.

బుద్ధ—స్థిమితత లేకపోవుట యాందోళనమేనా?

అంగు—చిత్తము.

బుద్ధ—హృదయాందోళనము సుఖమా? కష్టమా?

అంగు—కష్టమే.

బుద్ధ—“తనకు సుఖమో తనకు సుఖమో,” యని సతతము కోరుకొనుచుఁ దానేమిబుద్ధిపూర్వకముగఁ దెచ్చుకొనిన్నాఁడు?

అంగు—కష్టము.

బుద్ధ—ఈకష్టము దనకున్నంతకాలము సుఖము రాఁగలదా?

అంగు—రాలేదు.

బుద్ధ—కావున ముందీకష్టమును నివారణము చేసికొనవలయునుగద!

అంగు—చిత్తము.

బుద్ధ—ఈకష్టము దేనివలన సిద్ధించినది?

అంగు—ఆత్మసుఖమును గోరుకొనుట చేత.

బుద్ధ—కావున నది యెట్లు పోవును?

అంగు—ఆత్మసుఖమును గోరుకొనకపోవుట చేత—

బుద్ధ—ప్రపంచములోఁ దాను, పరుఁడు తప్ప నితర మేమైన నున్నదా?

అంగు—లేదు.

బుద్ధ—ఆత్మసుఖము గోరుకొననివాఁ డెవనిసుఖము గోరవలయును?

అంగు—పరులసుఖము.

బుద్ధ—కావున, పరసుఖమును గోరువారి కాత్మసుఖము సిద్ధించును గాదా?

అంగు—చిత్తము.

బుద్ధ—ఇంటియొద్ద రెండుయామములు త్రిస్థాయి సాధకముచేసిచేసి గడితేరిన వైణికుఁడు సభలో నొకగంట సేపు రాజహృదయామోదముగ వాయింపలేఁడా?

అంగు—అతిసులభముగ—

బుద్ధ—వైణికునియుద్దేశము రాజప్రీతియే.

అంగు—చిత్తము.

బుద్ధ—రాజుగారెప్పుడో యొకమాఱు గంటకంటె నెక్కువకాలము వినరుకదా!

అంగు—వినరు.

బుద్ధ—ఎన్నఁడో యొకసారి యొకగంటసేపు సభలో వాయించుటకు మాత్రమే తగినంతసాధక మింటియొద్దఁ జేసినవైణికుఁడు—

అంగు—అరగంటసేపైన సభారంజకముగ వాయింపలేఁడు.

బుద్ధ—కావున, ఆనందా! దీనివలన నేమి తెలియఁదగినది?

ఆనం—జనున కెంతయావశ్యకమో యంతయే ప్రయత్నింపక దానిపై దానికొఱకుఁ బ్రయత్నింపవలయును.

బుద్ధ—అట్లుచేసినయెడలఁ బైదియుసామాన్యముగ సిద్ధించును. అది సిద్ధించుటఁబట్టి జనున కావశ్యకమగున దెంతయో యది సంపూర్ణముగ సిద్ధించును గాదా?

అం—చిత్తము.

బుద్ధ—స్త్రీలకు వ్రతకల్పములఁ జెప్పుటకుఁ దగినపాండిత్యము సంపాదించు కొనఁదలఁచినవాఁడు పురాణములు బాగుగఁ జదువవలయును. పురాణకాలక్షేపమును జేయఁదలఁచినవాఁడు కావ్య

పాండిత్యమును బూర్ణముగ సంపాదింపవలయును. కావ్యపాఠములు చెప్పదలంచినవాఁడు శాస్త్రాధ్యయనము చెయ్యవలయును కావున నెక్కువదానికై ప్రయత్నించినఁగాని తక్కువది బాగుగ రానట్లు కనఁబడుట లేదా?

అల—చిత్తము.

బుద్ధు—నీకంటెఁ బరులు సంఖ్యలోనైన హెచ్చు గారా?

అల—కారా?

బుద్ధు—వారిసౌఖ్యము నీసౌఖ్యముకంటె మొత్తములోనైన హెచ్చు కాదా?

అల—అవును.

బుద్ధు—నీవు నీసౌఖ్యమును గోరుకొనినయెడల నేమి చేయవలయును?

అల—పరసౌఖ్యమునకుఁ బ్రయత్నింపవలయును.

బుద్ధు—కేవల లౌకికమార్గమునుబట్టి చూచినను పరసౌఖ్యమును నీవు చేయుటకే తప్పదుగదా?

అల—అవును.

బుద్ధు—అట్లు చేయ మాని వైచుట సరేకదా మీఁదుమిక్కిలి పరులసుఖమునకే నీ వసూయపడుచుండినయెడల నీగతి యేమి కావలసినది? పరమార్థచింతమాట యటుంచుము. లౌకికబుద్ధి లేశమైన గలవాఁడు ఎప్పుడైనఁ బరునియున్నతగతి కసూయపడునా?

అల—పడఁడు.

బుద్ధు—సోదరులారా! అసూయనుగూర్చి యిది చాలునా?

అంగు—చిత్తము.

బుద్ధ—ఇఁకఁ దొమ్మిదవది. నాయనా! అంగుళిమాలా! నీవు నన్నుఁ జంపుటకే వచ్చినవాఁడవు కావా?

అంగు—చిత్తము. క్షమింపవలయును.

బుద్ధ—అలవకా! నీవు నన్ను మ్రింగుటకే వచ్చినవాఁడవు కావా?

అల—చిత్తము. క్షమింపవలయును.

బుద్ధ—మీకోపము, శత్రుత్వము నాయెడలఁ బనిచేసినదా?

అల—మహాత్ములయెడఁ బనిచేయునా?

బుద్ధ—అదేమిమాట! అంగుళిమాలా! ఏల పనిచేయలేదు?

అంగు—మీయోరిమి, మీశాంతచిత్తత చూడఁగనే మామనస్సులు తిరిగిపోయినవి.

బుద్ధ—అలవకా! నీవు నాపైఁ బడినప్పుడు నేనుఁగూడ నిన్ను సాధింపనెంచి తీవ్రతను వహించినయెడల నీకోపము వృద్ధియైపోదా?

అల—అగును.

బుద్ధ—కావున, కోపము దేనివలన శాంతించును?

అల—అనురాగమున—

బుద్ధ—శత్రుత్వము?

అల—మైత్రివలన—

బుద్ధ—సర్వప్రాణులయెడ మైత్రి కనఁబఱచువానికి—

అల—సర్వజీవలోక మనురాగమును గనఁబఱచును.

గీ. తిట్లు దీవనలను గాని ♦ తిట్లఁ బోవు;
ప్రేట్లు ముద్దుల నడఁగును ♦ ప్రేట్లఁ బోవు;
కత్తి కౌఁగిలిచేఁ దెగుఁ ♦ గత్తిఁ దెగదు;
రుష కరుణచేతఁ బోవును ♦ రుషను బోదు.

గీ. మాయ ధారాళతను బోవు ♦ మాయఁ బోదు
శాత్రవత శాత్రవతఁ బోదు ♦ మైత్రిఁ బోవు;

మిథ్య సత్యంబుచేఁ బోవు ♦ మిథ్యఁ బోదు;
చెట్ట మంచిచేఁ బోవును ♦ చెట్టఁ బోదు.

కావున సోదరులారా! సర్వప్రాణిసమానమైత్రిని సంపాదించుకొ
నుట ప్రతిజనున కావశ్యకము కాదా?

అల & అంగు—చిత్తము. చిత్తము.

బుద్ధు—ఇఁకఁ బడియపడికూడ విందురా? మీకు నిద్రవచ్చుట లేదుకద!

అల—అజ్ఞానధ్వంసకమగునీతిమార్గమును మీరు బోధించుచుండ నీసమ
యమున నావులించువానికంటె శుంఠ మఱియొకఁ డుండునా?

బుద్ధు—అజ్ఞానధ్వంస మగునది నీతిమార్గము గాదు. పరాపకారచింతా
ధ్వంసమగునదియే నీతిమార్గము. ఆలవకా! తెలిసినదా?

అల—తెలిసినది. పరుల కపకారము జరుగకుండ నొకఁడు ప్రవర్తించు
కొనుమార్గము నీతిమార్గము.

బుద్ధు—ఔను. ఈపదియుఁ జేయఁగూడనిపనులు. చేయవలసినపను లే
వో మీకింకఁ దెలియ లేదు. ఎట్టిప్రయత్నమునఁ చిత్తశుద్ధి స్థిర
తలు గలుగునో ప్రజ్ఞ కలుగునో యనిర్వచనీయనిర్వాణానంద
ము కలుగునో యది జ్ఞానమార్గము. మీరు నావెంటఁ గపిలవ
స్తుపురమునకు రా నిచ్ఛగించునెడల మీకు సత్యచతుష్టయము,
అష్టాంగశీలము, ఆత్మతత్త్వము, జ్ఞానతత్త్వము, నిర్వాణతత్త్వ
మును బ్రయాణములలో బోధింతును.

అల—మహాత్మా! నేనుమీదాసుఁడను. మీమతములో నన్నుఁ జేర్చు
కొనుఁడు.

అంగు—మహాత్మా! నన్నుఁగూడఁ గటాక్షింపుఁడు.

ఆనం—మీరు బుద్ధసంసారు లగుదురా? సన్యాసు లగుదురా?

అల—సంసారపుపసలు తెలిసినవి. సన్యాసి నయ్యెదను.

అంగు—నేను నంతే.

బుద్ధ—అట్లైన సన్యాసులముఖ్యధర్మములుగూడ మీకుఁ జెప్పి మిమ్ము సంఘమునఁ దీసికొందును.

అల & అంగు—అనుగ్రహింపఁబడితిమి.

బుద్ధ—మార్గస్థుల కడ్డులేకుండునట్లు మన మీతావు విడిచి యాచెట్టు నీడను రాత్రి నిదురింతము. రండు.

(నిష్క్రమింతురు.)

ఇది పంచమాంకము.

శ్రీ

# బుద్ధబోధసుధ



## షష్ఠాంకము.

—:0:—

ప్రదేశము—కోసల.

ప్రవేశము.—అనిరుద్ధుఁడు. సోమదత్తుఁడు.

అని—ఏమోయి! సోమదత్తా! మనకోసలదేశములోనికి బుద్ధుఁడు వచ్చినాఁడఁట! నిజమేనా?

సోమ—మరణవార్త యొకటి, మదనవార్త యొకటి, మతగురువార్త యొకటియుఁ దఱచుగ నూరక పుట్టునవి కావు.

అని—అట్లైన నెందుల కాతఁ డిక్కడకు వచ్చెనో చెప్పెదవా?

సోమ—ఎందులకు? మతబోధనమునకు—

అని—యథార్థమత మెప్పుడు బోధనార్హ మగునది కాదు.

సోమ—అటు లనెద వేల?

అని—సృష్ట్యాదినుండి వచ్చుచున్న మనయార్ష మతములోనికి జను లందఱు రావలసినదని మనము బోధించుచున్నామా? పిఱికిముండ కొడుకు తనభయనివారణముకొఱకుఁ జుట్టుప్రక్కలనున్న పది మందిని బోగుచేసికొనునట్లు నూతనమైనతప్పుమతమును దనస్థిరత్వముకొఱకుఁ దలమాసినముండకొడుకులను గొందఱను జేర్చుకొనును. తనది మతమా? మతమనఁగ నేమో తుదమొదలు తనకుఁ దెల్లియునా? తనకు మతముగొడవ యెందులకు? నిష్ఠే

పముపంటిరాజ్యము, యోగ్యురా లగుభార్య, కనులునిండిన కొడుకు—మహేంద్రవైభవముతో రాష్ట్రములోఁ గ్రిందు మీఁదు దెలియకుండున ట్లుండక—ఆ! తల గొరిగించుకొని - దాసరి కుంకలతోఁ గూడుకొని - తగుదునమ్మ యని - ఊళ్లవెంట నుపన్యాసములా? ఇతనికి మతి యున్నదా లేదా? తానెవఁడు? క్షత్రియున కధ్యయనాధికారమే కాని బోధనాధికార మెక్కడిది? దానాధికారమే కాని ప్రతిగ్రహాధికార మెక్కడిది?

సోమ—లేకపోవుట యేమి?

అని—వేదము లొప్పుకొనువా?

సోమ—వేదములను దుడిచిపెట్టినవానికి?

అని—గ్రుడ్లగూబ కన్నులు మూసికొనినంతమాత్రముచే సూర్యతేజమును దుడిచిపెట్టఁ గల్గునా? ప్రమాణగ్రంథమే లేనప్పుడు మతము దేనిపై స్థాపించినాఁడు? ఐన నీతనిమతసాంప్రదాయము నీకుఁ గొంత తెలిసిన నాకుఁ జెప్పెదవా?

సోమ—నాకుఁగూడ బాగుగఁ దెలియదు. ప్రపంచము దుఃఖపూర్ణమఁట! అట్టిదుఃఖముల కన్నిఁటికి మూలకారణము తృష్ణ యఁట! కావునఁ దృష్ణను నిర్మూలింపవలయు నఁట!

అని—ఆఁగు. ఒకయజీర్ణరోగి యొకవైద్యునియొద్దకు మందునిమిత్తము పోయెనఁట! వైద్యుఁడు పట్టుకారుతో రోగిపండ్లూడఁదీయవలయునని పల్కెనఁట

సోమ—అదెందులకు?

అని—అజీర్ణమునకుఁ బండ్లు మూలకారణ మఁట!

సోమ—అదెట్లు?

అని—సంవత్సరములోపున శిశువులకుఁ బండ్లువచ్చుసమయమున వాంతులుభేదు లగును. కావునఁ బండ్లు మందాగ్నికి మూలకారణ

ము కాదా? ఈబుద్ధుని తెలివి యీవైద్యుని తెలివి యొక్కరీతిగ నున్నది. కాని జనుల కీపిచ్చి యేమి?

సోమ.—అంగుళిమాలుఁ డలవకుఁ డనునరరూపరాక్షసులు నాలుగువేలపరివారముతో సంఘమునఁ జేరిరి. ఇంతవఱకు కెందులకు? మహాబుద్ధిమంతుఁ డనుకొనినమగధదేశరాజు బింబిసారుఁడు బుద్ధమతావలంబకుఁడు కాలేదా?

అని.—వెంటనే ప్రాయశ్చిత్తముకూడఁ గాలేదా?

సోమ.—ఆయువు లేకపోయినది.

అని.—ఆయువు లేకపోవుట కాదు. రూఢి నాకుఁ దెలియును. ఆతని కొడుకగునజాతశత్రుఁడు తనమిత్రుఁ డగుదవదత్తుని ప్రోత్సాహముచేఁ దండ్రిని జంపెను. చంపఁడా? చంపినఁ దప్పేమున్నది? పూర్వుల కెవరికి లేనిదిక్కు మాలినయీనాస్తికమతము తన కిప్పు డెందులకు?

సోమ.—దేవదత్తుఁడు బుద్ధమతద్వేషుఁడే కాక సర్వమతద్వేషుఁ డని వాడుకగనేయున్నది. ఆదేవదత్తుని ప్రోత్సాహముచేతనే మక్కలాచార్యులు మొదలగుమతగురువులు నలుగురు కొంతల వేయఁబడినారఁట! ఇప్పుడు బుద్ధునికజాతశత్రునిమూలకముగ నాతఁడనేకబాధలు కలిగించుచున్నాఁ డఁట?

అని.—బాధలు కలిగింపవలయునా? ఇంక నిట్టిమాలమతమును బోధించువానిని ద్రొక్కవలయునా?

సోమ.—మాలమత మన నాకు జ్ఞప్తికివచ్చినది. నిన్నయుదయమున బుద్ధునిప్రధానశిష్యుఁ డగునానందుఁడు మాలవాండ్రనూతియొద్దకు మంచినీరు త్రాగుటకై పోయెనఁట!

అని.—ఔను. మననూతులయొద్ద కీమతబాహ్యుల రానిచ్చెదమా?

సోమ—తనయొద్దఁ జేతఁ ద్రాడు లేకపోవుటచేత నక్కడ నీరు దోడుకొ
నుచున్న యొకమాలదానిని దనకుఁ గొంచెము నీరిమ్మని యాతఁ
డడిగెనఁట!

అని—హరహరా!

సోమ—నానీరము మీరు త్రాగిన నపవిత్రు లగుదురు. నేను జండాలిని
యని యది చెప్పెనఁట!

అని—సెబాస్! మాలదానికున్నమాత్రపునీతి యీనిర్భాగ్యునకు లేక
పోయెను.

సోమ—అంతట నానందుఁడు చెల్లెలా! నీవర్ణ మేదో నే నడుగ లేదు;
నీనీర మడిగితి నని ప్రత్యుత్తర మిచ్చె నఁట!

అని—అటుపైన?

సోమ—ఆచండాలిని యాతనికి నీరుఁబోసెనఁట!

అని—సరి; సరి! ఇఁకఁజాలు చెవులు చిల్లులు పడుచున్నవి.

సోమ—చెవు లూడిపోవుమాట లింక ముందున్నవి. అంతట నామా
లది బుద్ధాశ్రమమునకుఁ బోయి యాతనిమతోపదేశమును విని
బుద్ధసన్యాసిని యయ్యెనఁట!

అని—ఆహా! ఆహా! లోకము తలక్రిందుగా నున్నదా? ఇందఱురాజులు
దేశదేశముల నున్నారు కదా? ఒక్కఁడైన నీతనిని మతిలేనివాఁ
డని, మోసగాఁ డని నిందనారోపించి చెఱసాలలో నుంపలేక
పోయినాఁ డేమి?

సోమ—వర్ణభేద మింతభయంకరముగ బుద్ధుఁడు ధ్వంసము చేయుచు
న్నాఁ డని తెలిసిన మనప్రసేనజన్మమహారాజుగారి కాతనియెడ
లఁ గోపముగనే యున్నది.

అని—పుంస్త్వహీనుఁడు సంసారమున నున్న నేమి? సన్యాసమున నున్న
నేమి?

సోమ—అట్లు కాదు. కొంతపని చేయుచున్నాఁడు.

అని—ఏమది?

సోమ—పొషరసాద్యాచార్యులవారి శిష్యుఁ డగునంబష్ఠాచార్యులవారి నాతనియొద్దకు వర్ణవిభాగమునుగూర్చిన వాదమునకై పంపినాఁడు.

అని—కలుచుటకుఁ గుక్క మీఁదఁ బడునప్పుడు కోపమునుగూర్చిన నీత్యుపన్యాసమా? ఏడిచినట్లే యున్నది. చెప్పు తీసుకొని నాల్గు తన్నక యీవాద మెందులకు? పనికిమాలిన పని!

సోమ—వాదమున లొంగకపోయినపిమ్మట నదియే జరుగునేమో తెలియదు.

అని—అంబష్ఠాచార్యులు గంగ్రడముండకొడుకే! ఏమగునో చూతము.

సోమ—మనముగూడ నక్కడకుఁ బోవుదమా?

అని—తప్పేమున్నది. గంగిగోవులకు మాలపల్లెలోనికిఁ బోయిననైనఁ బ్రాయశ్చిత్త మున్నదా? నడు; నడు.

(నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.



శ్రీ

# బుద్ధబోధసుధ.

## షష్ఠాంకము.

---:o:---

ప్రదేశము బుద్ధాశ్రమము.

ప్రవేశము బుద్ధుఁడు, అంబట్టుఁడు.

బు—అంబట్టాష్ఠార్యా! శాంతి నొందుము. వాదములోఁ గోప ముత్తే
ర మగున్నా? తిట్లు హేతువు లగునా?

గీ. మొఱకుపలుకు లూరక వాద ♦ మునను రుపను
విడుచువాఁడు వేగ జయింపఁ ♦ బడును నిజము
వృథగ నూపిరి రోషాప్తి ♦ విడుచువాఁడు
త్వరగ సాములోన్న జయింపఁ ♦ బడెడుకరణి.

అంబ—నా కీనీతు లన్నియుఁ దెలియును. నేను క్రొత్తగా నీదినమున
నే వాదించినవాఁడను గాను.- కుఱ్ఱముండకొడుకుతోఁ జెప్పినట్లు
చెప్పెద వేల? మీరే మహాధికులా? నేనే శుంఠనా?

బుద్ధు—నే నటు లంటినా?

అంబ—అట్లుకూడ ననవలయునా?

బుద్ధు—ఈమాట లేల? సోదరుఁడా! వివాదాంశమును జూచుకొం
దము.

అంబ—అదిగో! „సోదరుఁడా" యని నన్నుఁ బిలువవల దని చెప్పలే
దా? నేను బ్రాహ్మణోత్తముఁడను నీవు క్షత్రియాధముఁడవు.

బుద్ధ—బ్రాహ్మణుఁడు క్షత్రియునికంటె నుత్తముఁ డని నీ విచ్చటికుం వచ్చినప్పటినుండియుఁ జెప్పుచునేయున్నావు. ఇప్పుడుకూడ నా మాటయే చెప్పినావు. పునరుద్ఘాటనమే సిద్ధాంత మనుకొనుచున్నారా? ఈమాటలు నీవునన్నుఁ బ్రశ్నలువేయుమువా? నేను నిన్ను వేయనా? ఎట్లయిన నాకిష్టమే.

అంబ—ప్రశ్నములు నేనే వేయుట కిదివఱ కంగీకరించి వేయుచుండఁగ "నదిగో! అట్టిరీతిగఁ బ్రశ్న మడుగఁగూడదు." అని నీవు నన్నెన్ని మాఱులు నీవు వారింపలేదు? ప్రశ్న మడుగుటకు రీతి యేమిటి? తత్సందర్భమున నుచితమని నాకుఁదోఁచినరీతి నడిగెదను.

బుద్ధ—కావున నీవీమాఱు నన్నుఁ బ్రశ్నింతువు కాదా?

అంబ—నే నందుల కంగీకరింపను.

బుద్ధ—అట్లైన సరే. వినుము. క్షత్రియబీజముచే బ్రాహ్మణక్షేత్రమునఁ గలిగినపుత్రునికి బ్రాహ్మణులగుమీ రంద అర్ఘ్యపాద్యములు నిచ్చి గౌరవింతురా?

అంబ—గౌరవింప కేమి?

బుద్ధ—వానికి దేవతానివేదితాన్నమును పైతృకభుక్తశేషమును నిచ్చెదరా?

అంబ—ఇచ్చుట కాక్షేపణము లేదు.

బుద్ధ—వానికి వేదములు మీరు చెప్పుదురా?

అంబ—ఆఁ

బుద్ధ—మీస్త్రీల నాతఁడు చూచి వారితో సంభాషింపవచ్చునా?

అంబ—అభ్యంతరము లేదు.

బుద్ధ—క్షత్రియులందఱు అట్టివానికి క్షత్రియోచితగౌరవము నిచ్చెదరా?

అంబ—ఈయరు.

బుద్ధ—ఎందుచేత నీయరు?

అంబ—ఆతఁడు తల్లివంకఁ బరిశుద్ధుఁడు కాకపోవుటచేత—

బుద్ధ—ఆచార్యా! బ్రాహ్మణబీజముచే క్షత్రియక్షేత్రమునఁ గలిగిన పుత్త్రునికి మీ రర్ఘ్యపాద్యాసనలను దైవపైతృకాన్నముల నిచ్చి వేదములఁ జెప్పి మీయింట స్వేచ్ఛగ మెలఁగనిత్తురా?

అంబ—ఆ.

బుద్ధ—అట్టివానికి క్షత్రియులు తమవంశోచితగౌరవము నిచ్చెదరా?

అంబ—ఈయరు.

బుద్ధ—ఎందుచేత?

అంబ—ఆతఁడు తండ్రివంకఁ బరిశుద్ధుఁడు కాకపోవుటచేత—

బుద్ధ—కావునపురుషులను బురుషులతో సరిచూచినను స్త్రీలను స్త్రీలతోఁ బోల్చినను క్షత్త్రియులే బ్రాహ్మణులకంటె నధికులవలెఁ గానఁబడుచున్నారు కారా?

అంబ—కానఁబడుచున్నారు. ఇట్టికానఁబడుట కెక్కడికి? మీయాచారములు మీవి! మాయాచారములు మావి! మీయాచారములలో మీరు మమ్ముఁ దక్కువ సేయఁజూతురు. మాయాచారములలో మేము మిమ్ముఁ దక్కువ సేయఁ జూతుము. ఇది యొక మహాకారణమా? ఇంతమాత్రమునకే బ్రాహ్మణత్వము క్షత్రియత్వముకంటెఁ దగ్గిపోయినదా? అబ్బో! పొడిపొడిమాటలకుఁ బోవునది కాదు.

బుద్ధ—అదిగో! విశేషించి చదువరు. ఒకతప్పున కొకబ్రాహ్మణుని బ్రాహ్మణు లందఱు శిరోముండనము చేయించి నెత్తిపై బూడిదఁ జల్లి బహిష్కరించి రనుకొందము. అట్టి బ్రాహ్మణునికే బ్రాహ్మణుఁడైన నర్ఘ్యపాద్యాదిగౌరవమిచ్చునా?

అం—ఈయఁడు.

బుద్ధ—ఇటులే క్షత్రియులచే బహిష్కరింపఁ బడిన క్షత్రియునకు మీ
రర్ఘ్య పాద్యాదు లిచ్చెదరా?

అంబ—ఇచ్చెదము.

బుద్ధ—శ్రాద్ధాన్నమునుగూడఁ బెట్టెదరా?

అంబ—పెట్టెదము.

బుద్ధ—వేదము లాతనికిఁ జెప్పెదరా?

అంబ—చెప్పెదము.

బుద్ధ—మీ స్త్రీలయెదుట మెలఁగ నిచ్చెదరా?

అంబ—మెలఁగ నిచ్చెదము.

బుద్ధ—ఇట్టి క్షత్రియున కేక్షత్రియుఁడైన వంశోచితగౌరవ మిచ్చునా?

అంబ—ఈయఁడు.

బుద్ధ—కావున దోషముచే నధమస్థితి నొందిన క్షత్రియుఁడైన బ్రా
హ్మణునికంటె నధికుఁడని తెలియుట లేదా?

అంబ—నీకుఁ దెలియుచున్న దేమో? క్షత్రియుఁ డెక్కువవాఁడని మీ
రనుట సహజము. బ్రాహ్మణు లధికులని నేననుటసహజము.
ఇట్టిదే యీయాచారమును గూడను. ఇంతమాత్రమునకుఁ దేలె
డు సంశయము కాదు. ఊరక యెందులకు శ్రమ పడెదవు?

గీ. శస్త్రజన్మ విప్రులకె దో • షములు; బ్రాహ్మ
ణేతరులకు దోషము లెల్ల? • హీనములకె
కాక దోసముల్ త్రాలక్కుఁ • గలవె? గుఱ్ఱ
ములకె సుడిదోసములు గాడి • దలకుఁ గలవె?

బుద్ధ—నాదవైఖరి యెఱుగకుండ నింత యసందర్భముగ మాటలా
డుచున్నావు? సోదరుఁడా! ప్రకృతిమృదుత్వము తప్పి మాటలాడు
చున్నావు! గుఱ్ఱములు గాడిదలని జంతువులలో జాతిభేదమున్న

ట్లే మనుజులలో బ్రాహ్మణులని బ్రాహ్మణేతరు లని భేదము గ
లదా? ఆలోచించి చెప్పుము.

అంబ—ఆలోచింప నేల? ఉన్నదా? ఉండి తీఱదా?

బుద్ధు—గుఱ్ఱమేదో గాడిద యేదో యెట్టివాఁడైన సులభముగఁ జెప్ప
వచ్చును గద!

అంబ—ఇంతసులభమైన ప్రశ్నము వేయఁదగదు గద!

బుద్ధు—బ్రాహ్మణుఁ డెవఁడో యబ్రాహ్మణుఁ డెవఁడో యట్లు చెప్ప
వచ్చునా?

అంబ—హే హే హే! మొగము చూచునప్పటికిఁ జెప్పవచ్చును.

బుద్ధు—తెచ్చుకొన్న విభూతి రేఖలచేఁ గాని యజ్ఞోపవీతముచేఁ గాని
గుఱుతుపట్టుట కాదు. దూరదేశజను లట్టివిభాగము సేయఁగ
లరా?

అంబ—వర్చసు! బ్రహ్మవర్చసము! తపస్తేజస్సు! ముఖముమీఁద బ్రా
హ్మణునకుఁ బ్రకాశించు మండ నెవఁడైనఁ జేయఁగలఁడు.

బుద్ధు—అప్రయోజక మైనరంగునుబట్టియా బ్రాహ్మణుని విడఁదీయు
టు! అట్లులే యగునేని ఱంబానీకులు మీకంటెఁ దేజస్వంతు లా
గుటచే వారే బ్రాహ్మణు లగుదురే! కారణాంతరములచే వర్చ
స్సు తక్కువ గలవానిని బ్రాహ్మణుఁ డని గుర్తుపట్టుట దూరదే
శస్థునకుఁ గష్ట మగును గాదా?

అంబ—అది కొంచెము కష్టమే.

బుద్ధు—అట్లు లెట్టిదూరదేశస్థునకైన గుఱ్ఱమును గాడిదెను వేఱుదీయు
టయం దేమాత్రపుఁగష్టమైన నుండునా?

అంబ—ఉండఁగూడదు.

బుద్ధు—బ్రాహ్మణు లనుజాతి మనదేశమందే యున్నదా? ఇతరదేశము
లఁగూడ నున్నదా?

అంబ—ఇతర దేశముల నున్నట్లు వినలేదు.

బుద్ధ—ఇతర దేశముల మనుజు లున్నారా?

అంబ—ఉన్నారు.

బుద్ధ—బ్రాహ్మణజాతి యనుజాతి మనుజులలో జాతిభేద మని నీవను నప్పు డితర దేశములలోఁ గూడ బ్రాహ్మణు లేల యుండఁగూడదు?

అంబ—ఆ దేశజనులకర్మము.

బుద్ధ—ఈదేశజనులు చేసికొన్న కర్మమే యిది. జనులలో భాగ్యవంతులు బీదవా రన్ని దేశములలో నున్నారుగద!

అంబ—ఉన్నారు.

బుద్ధ—బీదవాఁడు భాగ్యవంతుఁ డగుటయుఁ దద్వ్యతిరిక్తుఁ డగుటయు నన్నిచోట్ల నున్నదా?

అంబ—ఉన్నది.

బుద్ధ—బీదవానికి భాగ్యవంతునికి జాతిభేద మున్నదా?

అంబ—లేదు.

బుద్ధ—ఈదేశములో బీదబ్రాహ్మణుఁడు భాగ్యవంతుఁడగు బ్రాహ్మణో తరునిగొల్చి బ్రదుకుచున్నాఁడా?

అంబ—ఆ.

బుద్ధ—బ్రాహ్మణునియాధిక్య మేమున్నది? ఆవులు నలుపు, తెలుపు, ఎఱుపు, కపిల, పుల్ల, బట్ట యనువర్ణభేదములు గలవియై యున్నవా?

అంబ—ఉన్నవి.

బుద్ధ—తెల్లనియావునకును నల్లనియావునకును జాతిభేద మున్నదా?

అంబ—లేదు.

బుద్ధ—అటులే మనుజజాతిలో నల్లనివారు, తెల్లనివారు, చామనచాయవారు, పచ్చనివారు, నున్నారు కారా?

అంబ—ఊరకే యందఱకుఁ దెలిసినప్రశ్నముల నేల యడుగుదువు? ఉన్నారు.—

బుద్ధ—చామనచాయగల బ్రాహ్మణునకు, నల్లనిచండాలునకు జాతిచేత నేమిభేద మున్నది?

అంబ—జాతి జాతి యనెద వేమి? వర్ణమున భేద మున్నది. బ్రాహ్మణులు వర్ణముగాని జాతికాదు.

బుద్ధ—వర్ణమనఁగ రంగేనా?

అంబ—కావచ్చును.

బుద్ధ—అట్లైన చామనచాయవారందఱు బ్రాహ్మణులు, నల్లనివారందఱు చండాలులునా?

అంబ—నేను నల్లఁగ నుంటచేత నన్నుఁ జండాలుఁడని యధిక్షేపించుచుంటివా?

బుద్ధ—సోదరుఁడా! నే నట్లు చేయుదునా? నీవాదమునకుఁ బర్యవసానమట్లున్న దని చెప్పుచున్నాను. ఏవస్తువునకైన వర్ణము స్థిరముగా నుండునా? నల్లనివెంట్రుకలు గొంతకాలమునకుఁ దెల్లబడునా?

అంబ—పడును.

బుద్ధ—అంతటితో వెంట్రుకజాతి మాఱునా?

అంబ—మాఱదు. ఏమో! మీతో మాటలాడుట నాకు బాగుగ లేదు.

బుద్ధ—తెల్లగఁ బుట్టినగేదెదూడలు కొన్ని పెద్దవై నల్లనగుచున్నవి వానిపశుజాతి మాఱునా?

అంబ—మాఱదు.

బుద్ధ—తెల్లని బ్రాహ్మణుఁ డత్యుష్ణప్రదేశమునకుఁ బోయినయెడలసూ
ర్యకాంత్యధికతచే నల్లఁబడఁడా?

అంబ—పడును.

బుద్ధ—నల్లఁబడినవెంటనే బ్రాహ్మణుఁడు చండాలుఁ డగునా?

అంబ—కాఁడు.

బుద్ధ—నల్లనిచండాలుఁడు పాండురోగమునఁ దెల్లఁబడినయెడల నాతఁ
డు బ్రాహ్మణుఁ డగునా?

అంబ—కాఁడు.

బుద్ధ—నీవుచెప్పినవర్ణమనుమాటకూడ సరికాదు. జాతి మొదలే కా
దు. ఇఁక బ్రాహ్మణుఁ డెట్లు గలిగెను?

అంబ—పుట్టుకచేతనే యొకఁడు బ్రాహ్మణుఁ డగును గాని నడుమను
గాఁడు.

బుద్ధ—అట్లు చెప్పుము. పుట్టుకచేతనే యనఁగ నేమి?

అంబ—బ్రాహ్మణపితకు, బ్రాహ్మణమాతకుఁ బుట్టినవాఁడు బ్రాహ్మ
ణుఁడు.

బుద్ధ—ఆతల్లిదండ్రులకు బ్రాహ్మణ్య మెట్లువచ్చె నయ్యా!

అంబ—వారితల్లిదండ్రులవలన—

బుద్ధ—ఆలాగునఁ బైకిఁ బోఁగఁ బోఁగ నాదియందు బ్రాహ్మణుఁ డె
ట్లుపుట్టెను?

అంబ—బ్రహ్మయూర్ధ్వభాగమువలన—

బుద్ధ—అబ్రాహ్మణులు?

అంబ—అధోభాగమువలనఁ బుట్టిరి.

బుద్ధ—సరే. రోగికి నెత్తిజడలలోఁ బేనుపుట్టి గడ్డపువెండ్రుకలలోఁ
దేలు పుట్టదు గద! ఏమి? మాటలాడ వేమి?

అంబ—గడ్డములోఁగూడఁ బేనే పుట్టును.

బుద్ధ—ఆపేనునకు నీపేనునకు భేద మేమైన నున్నదా?

అంబ—లేదు.

బుద్ధ—అట్టిచో ముఖజులకు నితరావయవజులకు భేద మెట్లు? ఉం. ఉన్నదా? లేదా? చెప్పు.

అంబ—లేదు.

బుద్ధ—ఆ! అదిగాక, బ్రహ్మయొక్క యవయవములనుండి చాతుర్వర్ణములు బుట్టిన వని యెచ్చట నున్నది?

అంబ—వేదములలో.

బుద్ధ—ఆవేదము లెవరు వ్రాసిరి?

అంబ—వ్రాయువా రెవరు? వేదములు సృష్ట్యాదినుండి యున్నవి. చతుర్ముఖబ్రహ్మముఖమునందు వ్యక్తములైనవి.

బుద్ధ—అలాగా? బ్రహ్మముఖమునందు ముందు బ్రాహ్మణులు పుట్టిరా? వేదములు వ్యక్తము లైనవా?

అంబ—బ్రాహ్మణులే.

బుద్ధ—సరే. వేదజ్ఞానదూరుఁడైనవాఁడు బ్రాహ్మణుఁ డగునా?

అంబ—కాఁ—డు—

బుద్ధ—అటులైన వేదములేనికాలమందు పుట్టినవాఁడు బ్రాహ్మణుఁ డెట్లయ్యెను?

అంబ—కాదు. వేదములే ముందు పుట్టిన వని వాడుకగూడఁ గలదు.

బుద్ధ—అటులైన, బ్రాహ్మణులు బ్రహ్మముఖమునుండి పుట్టినా రని పుట్టని బ్రాహ్మణులఁగూర్చి వేదములలో నేల చెప్పఁబడినది?

అంబ—ఆమాటమాత్రము తరువాతివా రెవరైనఁ జెప్పిరేమో?

బుద్ధ—ఏదైన దొంగపనిచేయుట స్వలాభమున కేనా?

అంబ—ఇందులో దొంగతన మేమున్నది?

బుద్ధ—నాయనా! నీ లేఖను నేను దిద్దినఁ దప్పుగాదా?

అంబ—ఔను.

బుద్ధ—అటులే బ్రహ్మముఖోద్గతము లగుమాటలలో సవరణలు చేయుట తప్పు కాదా?

అంబ—అంత తప్పేమున్నది?

బుద్ధ—సరే! నీయభిప్రాయానుసారముగఁ దప్పే లేదనుకొందము. బ్రహ్మ సత్యవాదికదా!

అంబ—ఔను.

బుద్ధ—తనముఖమునుండియే బ్రాహ్మణులు పుట్టినమాట సత్యమగునెడల నామాట తన వేదములలోఁ దానేల చెప్పలేదు? పొరబాటువలనఁ జెప్పకపోయియుండవచ్చునా?

అంబ—జ్ఞానస్వరూపునకుఁ బొరబాటు కలుగునా?

బుద్ధ—జ్ఞానస్వరూపునకుఁ బొరబాటు లేనప్పుడు నీవంటి బ్రాహ్మణుఁడా తనిమాటల దిద్దుట యేల సంభవించెను?

అంబ—బ్రహ్మముఖమునుండియే వేదములు బయలుదేర లేదనియు, సమాధిలోనుండు ఋషులు బ్రహ్మావేశబలముచే వానిని బల్కిరనియు మఱియొకప్రతీతి యున్నది.

బుద్ధ—ఎటులైనఁ బలికినవారు బ్రాహ్మణులు. పలుకుట లోకోపకారార్థముకాదు. స్వలాభమునకై—అట్టిమాటలు విశ్వసింపఁ దగునా? నీవు నీబ్రాహ్మణత్వమును మఱచిపో. సహేతుకముగ నుత్తర మిమ్ము.

అంబ—విశ్వసింపఁదగనట్లే యున్నది.

బుద్ధు—నాయనా! నిజము; ఉదరపోషణార్థమై కల్పించఁబడిన వెఱ్ఱికథ లు విశ్వసింపఁ దగదు. కావున మన మనుకొనినయాది బ్రాహ్మణ్యము బ్రహ్మచేఁ గలుగ లేదు.

అంబ—లేదు.

బుద్ధు—అటులైన నీతల్లిదండ్రులకు బ్రాహ్మణ్య మెట్లు వచ్చినదో యీసారి చెప్పుము.

అంబ—నేను జెప్ప లేకుండ నున్నాను.

బుద్ధు—నాయనా! తొందర లేదు. ఆలోచించుకొనుము. కావునఁ బుట్టుకవలన బ్రాహ్మణ్యము గలుగదని తోఁచుచున్నదా?

అంబ—కొంచెము తోఁచుచున్నది; కాని నామనసున కింక బాగుగఁ బట్టినది కాదు.

బుద్ధు—నాయనా! స్పష్టముగఁ జెప్పెదను వినుము. బ్రాహ్మణుఁడు వేఱు. చండాలుఁడు వేఱని నీయభిప్రాయమే కదా!

అంబ—అలాగే.

బుద్ధు—చండాలునివలన బ్రాహ్మణస్త్రీకిఁ గలిగినపుత్త్రుఁడు బ్రాహ్మణునికంటెను జండాలునికంటెను దేహాదితత్త్వములచే భిన్నముగ నుండునా?

అంబ—ఉండఁడు.

బుద్ధు—అట్టివానిని మీరు బ్రాహ్మణునిగ నెంచుకొందురా?

అంబ—తెలిసినయెడల నిద్దఱను బహిష్కరింతుము.

బుద్ధు—తెలియకుండునెడల నాతఁడు బ్రాహ్మణుఁడేనా?

అంబ—ఆ.

బుద్ధు—బ్రాహ్మణుఁడు కానివానిని బ్రాహ్మణుఁ డని నీవేల యనుకొంటివి?

అంబ—బ్రాహ్మణస్త్రీకిఁ బుట్టుటచేత—

బుద్ధు—పుట్టుక ప్రధానము కాదని యిదివఱకు నీ వొప్పుకొంటివి కాదా?

అంబ—ఆ.

బుద్ధు—అటులైన బ్రాహ్మణత్వము దేహాదితత్త్వలక్షణములవలన భర్త చేతనైనఁ దండ్రిచేతనైనఁ బుత్త్రునిచేతనైన గ్రహించుటకు సాధ్యము కానిదే కద?

అంబ—ఔను.

బుద్ధు—నల్లకుక్కకుఁ దెల్లకుక్కకుఁ బుట్టినపిల్ల తల్లిదండ్రులకంటె భిన్నతత్త్వము కలదై యుండునా?

అంబ—ఉండదు.

బుద్ధు—ఎందుచేత?

అంబ—తల్లిదండ్రు లొకజాతి యగుటచేత.

బుద్ధు—నాయనా! "బ్రాహ్మణస్త్రీకి జండాలునివలనఁ గలిగినపుత్త్రుఁడు దేహాదితత్త్వములఁ దల్లిదండ్రులకంటె భిన్నముగ నుండఁడు." అని నీ విదివఱ కొప్పుకొంటివి కాదా?

అంబ—ఒప్పుకొంటిని.

బుద్ధు—అ దెందుచేత నుండును?

అంబ—బ్రాహ్మణుఁడు చండాలుఁ డొక్కజాతి యగుటచేత నని యే తోఁచుచున్నది.

బుద్ధు—మగగుఱ్ఱము నాఁడుగాడిదెతోఁ గూడినయెడలఁ బుట్టుజంతు వేది?

అంబ—కంచరగాడిదె.

బుద్ధు—ఇది తల్లిదండ్రులకంటె భిన్నతత్త్వము కలదే కద?

అంబ—ఔను.

బుద్ధు—ఎందుచేత?

అంబ—తల్లిదండ్రులు భిన్నజాతిజంతువు లగుటచేత—

బుద్ధ—బ్రాహ్మణాబ్రాహ్మణులుకూడ నట్లే విజాతీయులైనచో వారి సంతతి వారికంటె ఎన్నుముగ నుండవలసినదే కద!

అంబ—ఆ!

బుద్ధ—అట్లున్నదా?

అంబ—లేదు.

బుద్ధ—కావున?

అంబ—చాతుర్వర్ణము లేకజాతివారే యగునట్లు నీమాటలవలనఁ గాని పించుచునే యున్నది. కాని వేదవేదాంగాదుల నంగీకరింపక కేవలము సద్యస్కాలయుక్తి చేతనే నిలువఁబెట్టఁబడినవాద మగు టచే నేమో చెప్పనెప్పోయినట్లును, ఫట్టులేనట్లును గానఁబడు చున్నది.

బుద్ధ—నాయనా! వాదమునకు హెచ్చుపట్టు యుక్తికాని ప్రమాణము కాదు. యుక్తిని వదలి ప్రమాణమును గ్రహింపుమనుట న్యాయమా? అయినను నీకొఱ కొకపావుగడియ నేను శుద్ధఛాందసుఁడ నయ్యెదను. మానససరస్సులో నొకహంస కురుక్షేత్రములో బ్రాహ్మణుఁడై పుట్టెనుగాదా!

అంబ—ఔను

బుద్ధ—కొన్నిచతుష్పాదజంతువులు బ్రాహ్మణులై పుట్టినట్లుకూడ వేదములలోఁ జెప్పఁబడ లేదా?

అంబ—అవును.

బుద్ధ—వేదవేదాంగవిజ్ఞాని యైనబ్రాహ్మణుఁడు శూద్రునియొద్దనుండి దానమును బరిగ్రహించునెడల నాతఁడు పంద్రెండుజన్మములు గాడిదయై పుట్టు నని పెద్దలు వ్రాసినారు కారా?

అంబ—వ్రాసినారు.

బుద్ధ—పక్షిలోని ప్రాణము బ్రాహ్మణునిలోని ప్రాణ మగుచున్నది. బ్రాహ్మణునిలోని ప్రాణము పందిలోని ప్రాణ మగుచున్నది కాదా?

అంబ—అవును.

బుద్ధ—కావున బ్రాహ్మణ్యమనఁగ బ్రాహ్మణత్త్వము కాదని యర్థ మగుచున్నదా?

అంబ—అగుచున్నది.

బుద్ధ—ఇది కాక—ఏనుఁగునకు బ్రాహ్మణుఁడు పుట్టలేదా? గ్రుడ్లగూ బకు బ్రాహ్మణుఁడు పుట్టలేదా?

అంబ—ఆలాగే.

బుద్ధ—బ్రాహ్మణోత్తముఁ డగువ్యాసుఁ డేక్షేత్రమున జన్మించెను?

అంబ—పల్లెదాని—

బుద్ధ—కౌశికముని?

అంబ—శూద్రక్షేత్రమున—

బుద్ధ—బ్రాహ్మణేతరక్షేత్రమునఁ బుట్టినవారుకూడ బ్రాహ్మణులు కాలేదా?

అంబ—అయిరి.

బుద్ధ—బ్రాహ్మణక్షేత్రమునఁ బుట్టినవానికైన బ్రాహ్మణ్యప్రాప్తికొఱకుపనయనమును బ్రాహ్మణుఁడు చేయుచున్నాఁడా?

అంబ—ఆ.

బుద్ధ—కావున బ్రాహ్మణ్యము జన్మముచేత రాదుగద!

అంబ—రాదు.

బుద్ధ—బ్రాహ్మణ్య మీదేహముచేతనే వచ్చునేమో విచారింపఁదగి నదా?

అంబ—అక్కఱలేదు. బ్రాహ్మణత్వము దేహముతో నశించునది కాదు. దేహము పోయినతరువాతఁగూడ బ్రాహ్మణ్యఫలమును పైలోకమున జీవుఁ డనుభవించును.

బుద్ధ—సరి. ఇఁక నేమి? వేదాధ్యయనము సేసినశూద్రుఁడు బ్రాహ్మణుఁ డగునా?

అంబ—కానేరఁడు.

బుద్ధ—వైదికకర్మాచారములు దీక్షతో నొనర్చినయబ్రాహ్మణుఁడు బ్రాహ్మణుఁడు కాఁగలఁడా?

అంబ—కాలేఁడు.

బుద్ధ—కావున—వేదాధ్యయనమువలనఁ గాని, వైదికకర్మాచారసమాచరణమువలనఁ గాని బ్రాహ్మణ్యము రానట్లు స్పష్టపడినది కదా!

అంబ—స్పష్టపడినది. కాని బ్రాహ్మణా బ్రాహ్మణ వివక్షత యెట్లు?

బుద్ధ—గీ. ద్వేష రాగసంయుక్తుఁడు ♦ ద్విజుఁడు కాఁడు;
వానిఁ జంపినయాతఁడే ♦ బ్రాహ్మణుండు
ప్రాణిహింసావిలోలుఁ డ ♦ బ్రాహ్మణుండు;
పతితె తాననుకొనువాఁడె ♦ బ్రాహ్మణుండు.

గీ. పరజనధనాపహర్త య ♦ బ్రాహ్మణుండు;
దీనజనదానశీలుఁడే ♦ ద్విజవరుండు;
వ్యభిచరించెడునాతఁ డ ♦ బ్రాహ్మణుండు;
పరసతుల మాతలుగఁ జూచు ♦ వాఁడె ద్విజుఁడు.

గీ. అతిథి మొడఁబట్టి త్రోయువాఁ ♦ డద్విజుండు
భూతతృప్తిఁ జేసెడువాఁడె ♦ భూసురుండు
రెండునాల్కలవాఁడు ద్వి ♦ జుండు కాఁడు
పలుకు దిరుగనియాతఁడే ♦ బ్రాహ్మణుండు.

గీ. సవనముల వహ్నిలోఁ బశు ♦ సంతతులను
మాడ్చి యుపహ్వంగువాఁడు బ్రా ♦ హ్మణుఁడు కాఁడు;
జ్ఞానవహ్నిలో నాంతర ♦ శత్రుసమితి
మాడ్చి శాంతించువాఁడు బ్రా ♦ హ్మణుఁడు సుమ్ము.

గీ. నాకు దక్షిణ నిచ్చిన ♦ నీకు ముక్తి
యనుచు బోధించువాఁడు బ్రా ♦ హ్మణుఁడు కాఁడు;
ముక్తతృష్ణుఁడై జ్ఞానియై ♦ మోక్షమార్గ
మందఱకుఁ దెల్పువాఁడె బ్రా ♦ హ్మణుఁడు సుమ్ము.

గీ. అతనిఁ జేర కితనిఁ దాఁక ♦ కతని జూడ
కనుచు విడఁదీయువాఁడు బ్రా ♦ హ్మణుఁడు కాఁడు;
సర్వజీవైక్యతత్వైక ♦ సత్యమార్గ
మందఱకుఁ జెప్పువాఁడె బ్రా ♦ హ్మణుఁడు సుమ్ము.

గీ. పరుల కుపవాసములఁ జెప్పి ♦ స్వగృహమందు
నన్ని చెడ మెక్కువాఁడు బ్రా ♦ హ్మణుఁడు కాఁడు;
తనకుఁ గలయన్నమంత ని ♦ తరుల కిచ్చి
పస్తునైనను బడువాఁడె ♦ బ్రాహ్మణుండు.

గీ. తనువు చెడఁదోమి యొడల బు ♦ గ్గిని రచించి
మంత్రముల నూదువాఁడు ♦ బ్రాహ్మణుఁడు గాఁడు
మనసుఁ దోమి స్వసుఖము బు ♦ గ్గిని రచించి
పరుల కుపకరించెడివాఁడె ♦ బ్రాహ్మణుండు.

గీ. వర్ణవిభజనవైఖరి ♦ వట్టిమిథ్య
పంచముఁడు జ్ఞానియైనచో ♦ బ్రాహ్మణుండు
బ్రాహ్మణుఁడు జ్ఞానదూరుండు ♦ పంచముండు
జన్మమునఁగాదు నడతచే ♦ జాతికలుగు.

అంబ—మహాత్మా! అట్టి బ్రాహ్మణోత్తములు మీరే. శిష్యుని సాష్టాంగనమస్కారము లంగీకరింపుఁడు. నేనింక నింటికిఁ బోయి మా గురువుగారితోడను మా ప్రభు వగు ప్రసేనజన్మహారాజుగారితోడను దిరిగిదర్శింతును.

బుద్ధ—ఇప్పుడు వారికడ కేల?

అంబ—మేమందఱ మొక్కసారి బుద్ధమతావలంబు లగుటకు—

బుద్ధ—నీతో వారుగూడఁ గా నేల?

అంబ—నేను దమవాదమున నోడిపోయి తమమతములోఁ గలిసినయెడల వారందఱుఁ గలియుటకు మొదటనే యంగీకరించిరి.

బుద్ధ—నాయనా! నీవేమో యోడిపోయితి ననుకొనుచున్నావు కాఁబోలు! అయ్యయ్యో! అట్లనుకొన వలదు. నాకు సత్యమని తోఁచిన దేదో నేను జెప్పితిని. నాయందు దయచే నీవు నామాటల కామోదించితివి. నాయనా! నీవింకఁ బొమ్ము. నాకుఁగూడ భిక్షాసమయ మైనది కావున నూరువెంటఁ బోయెదను.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది షష్ఠాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ.

## సప్తమాంకము.

—:o:—

ప్రదేశము—మగధ.

ప్రవేశము—చంద్రశేఖరుఁడు.

చం—విరూపాక్షా! విరూపాక్షా! ఇటు; ఇటు!

(విరూపాక్షుఁడు ప్రవేశించును.)

విరూ—ఏమోయి చంద్రశేఖరా! ఏల పిలిచితివి?

చం—నీవు పోవుచున్నదారి సరికాదు. ఇటు పోయినయెడల బుద్ధాశ్రమమునకు శీఘ్రముగఁ బోవుదుము. అదిగాక యాదారి బహుజనాశ్వగజోష్ట్రభటసంకులమై యున్నది. ఇది సందుదారియైనను జేరువదారి.

విరూ—అప్పుడే మగధప్రభువుగా రగునజాతశత్రుమహారాజుగారు బుద్ధదర్శనమునకుఁ బోయినారా?

చం—పోయినారఁట! వారిపరివార మంతయు నిమ్మళముగ వెనుక నిప్పుడే యాశ్రమము జేరఁ బయలుదేరినది.

విరూ—పరివారమునకంటెఁ బ్రభుఁ డేల ముందుఁ బోవలయును?

చం—బుద్ధునియందలి పరమగౌరవమున—

విరూ—తనతండ్రిగారిని జంపినప్పు డీగౌరవ మెచ్చటకుఁ బోయెను? బుద్ధాచార్యు నష్టకష్టములఁ బెట్టినప్పు డీగౌరవ మెటకుఁ బోయెను?

చం——పడఁతులచిత్తములు ప్రభువులచిత్తము లెవ్వ రోకలా గుం
డునా? ఠా! ఇచ్చట నాఁగ నేల? మాటలాడుకొనుచు నిమ్మళ
ముగఁ బోవుదము. రాజిప్పుడు పశ్చాత్తాపదందహ్యమానమా
నసుఁడై యున్నాఁడు.

విరూ——బుద్ధిలేని క్రౌర్య మొనర్చినవాని ప్రారబ్ధము తుద కదియే కదా

చం——ఇప్పుడు దేవదత్తాచార్యులవా రెట్లున్నారు?

విరూ——నూతనముగ నెత్తి వెండ్రుక లూడిన బ్రాహ్మణవితంతువువలె
నున్నాఁడు.

చం——పైకి వచ్చుటకు సిగ్గుపడుచున్నాఁడు కాఁబోలు!

విరూ——లోపలఁ దన మొగమైనఁ దాను జూచుకొనుట కంతకంటె నవ
హ్యత కాదా?

చం——బుద్ధాచార్యుఁడు నోరుఁదెఱచి మాట్లాడ నక్కఱలేదు. ఆకర్ణాం
తనేత్రుఁడు, ఆజానుబాహుఁడు, స్వర్ణచ్ఛాయాసహితుఁడు, పరి
పూర్ణశాంతకళాంచితుఁడు, కాషాయమాత్రధారియైనఁ జేయె
త్తుపాడవుదివ్యమంగళస్వరూపుఁడు కంటఁ బడుసరికి స్వపాపచింత
లుడిగి మనఃకాలుష్యరహితులై యొక్కసారి పెద్దలు, చిన్నలు,
దొంగలు, దొరలు, జైనులు, అజీవకులు, బ్రాహ్మణులు, చం
డాలులు, పురుషులు, స్త్రీలు కట్టకట్టలై బుద్ధపాదములఁ బడు
చున్నారు. ఇదివఱ కెన్నిలక్ష లెన్నికోట్లశిష్యు లున్నారో తె
లియదు. కౌశాంబిదేశపురాజు, కోసలదేశపురాజు, కాశీదేశపు
రాజు, సాక్యవంశరాజులు స్వపరివారముతోఁ గూడ బుద్ధమత
మునఁ గలసిపోయిరి.

విరూ——మనమగధదేశమహారాజు బింబిసారుఁడుగారుకూడ బుద్ధశిష్యుఁ
డు కాలేదా? ఇఁక నార్యావర్త దేశ మంతయు నొక్కబుద్ధదేశ
ము కానున్నది కాఁబోలు.

చం——ఈబుద్ధుఁడు భూమిని వదలి పైకిఁ బోయి యచ్చటినుండి యుచ్చై
స్స్వరముతో జనుల కందఱకుఁ దనమతము బోధించునెడల భూ

లోక మంత యొక్కమాటు బుద్ధలోకము కాఁగల దన్నుధైర్య
ము నాకున్నది.

విరూ—అటు చూడుము. ఎన్నివేలబుద్ధసన్యాసు లచ్చట నిల్చిరో! వా రం
దఱముందు బుద్ధుఁడు గాలిగోపురమువలె నెట్లున్నాఁడో!

చం—జనసంఘమున కంతకు బాగుగఁ గానఁబడునట్లు నిలువఁబడి యు
పదేశించుచున్నాఁడు.

విరూ—ఈదినమున దేనిఁగూర్చి యుపన్యసించునో?

చం—తెలియ లేదు. స్వవిహారము జనసంఘమునకు సరిపోవక కాఁబో
లు బహిరాకాశమునవే సభ చేసినాఁడు. రాజుగారు కానఁబడ
రేమి?

(నేపథ్యమున) లే! రాజా! లే!

విరూ—బుద్ధునికాళ్లపైఁ బడినాఁడు కాఁబోలు. నడునడు! త్వరగ నడు.
అత్యధమస్థితినుండి యొక్కసారి యున్నతస్థితికి వచ్చుజనుని జూ
చుట జనుల కెట్టివినోదమో యత్యున్నతస్థితినుండి యొక్క
సారి యధమస్థితిని బడువానిని జూచుట యట్టి వినోదమే.

చం—ఇతని కిదియే యున్నతస్థితి యని నాయభిప్రాయము.

గీ. మిన్నుముట్టెడునేడవ ♦ మిద్దెగద్దె
నుండుక్రూరావనిపుఁడథ ♦ ముండు సుమ్ము;
పరమశాంతవిగ్రహబుద్ధ ♦ పాదపాంసు
పటలసంఛన్న శీర్షుఁడే ♦ బహుఘనుండు.

విరూ—అట్లయినను మనకు వినోదము తప్పనే తప్పదు కాదా? న
డు. నడు.

(ఇద్దఱు నిష్క్రమింతురు.)

ఇది విష్కంభము.

శ్రీ

# బుద్ధబోధసుధ

## సప్తమాంకము.

—:o—

ప్రదేశము—మగధలోని బుద్ధారామము నెదుటిబయలు.

ప్రవేశము—బుద్ధుఁడు, అజాతశత్రుఁడు.

బుద్ధ—అజాతశత్రుఁడా! లెమ్ము.

గీ. నన్ను బాధలఁ బెట్టితె ♦ నిన్ను నీవు
హింసఁ బెట్టుకొంటని గ్రహి ♦ యింపలేక
నన్ను బాధించితి క్షమించి ♦ నాఁడ నిన్ను
నజ్ఞకృతులు క్షమార్హంబు ♦ లగును గాదె?

అజా—కరుణాస్వరూపు లగుమీరు నన్ను దిద్దుకొని మీమతమున న న్నుఁ జేర్చుకొనవలయు నని నేను ప్రార్థించుచున్నాను.

బుద్ధ—ముందటులే చేయవచ్చును గాని యిపుడు లెమ్ము.

అజా—ఇప్పుడే చేర్చుకొనవలయును.

బుద్ధ—అటులే చేర్చుకొనెదను.

అజా—(లేచి) అనుగ్రహింపఁబడితిని.

బుద్ధ—గీ. సౌఖ్య మొందఁగఁ దలఁచిన ♦ జనుఁడు సతము
చిత్తశుద్ధిని సుకృతులే ♦ చేయవలయుఁ
బాపకర్మములను జేయు ♦ వాని కెప్పు
డాత్మసౌఖ్యము సేకూరే ♦ దయ్య! నిజము.

గీ. ఎంతో నమ్మియుండి నీలోన ♦ సించునట్టి
లున్న ప్రాణమె నినుఁ బాసి ♦ యురుకునపుడు
నీది యనిచెప్పఁదగువస్తు ♦ వేది యిచట?
యపుడు నీవెంట వచ్చెడు ♦ నద్ది యేది?

గీ. ఏవియును గూడరా వన్ని ♦ యిచటె నిలుచు
సుతులు భ్రాతలు బంధువుల్ ♦ సుతలు సతులు
తోడబుట్టువుల్ హితులు నీ ♦ తోడరారు
ధనము రాదయ్య! వెంట్రుకాడ ♦ యినను రాదు.

గీ. వాఙ్మనఃకాయముల దేని ♦ వలననైన
నీవు చేసినకర్మమే ♦ నీదిసుమ్ము;
ఇదియె వదలక ని న్వెంబ ♦ డించు నద్ది
నీది యనఁదగినది; మఱి ♦ యేది లేదు.

గీ. నీడలాగునఁ గర్మంబు ♦ నిన్ను విడువ
దెపుడు దుష్కృతు లుపసంహ ♦ రింపఁబడవు
ధర్మకార్యంబు లెపుడు వ్య ♦ ర్థములు కావు
భావిఫలదానచర్య నై ♦ భవము లగును.

గీ. అందుచేతనె పుణ్యకా ♦ ర్యంబు లెపుడు
జనులు సేయఁగవలయు, నీ ♦ జననమందు
నాచరించుపుణ్యము ఫల ♦ మందు ముందు
కర్మ ముత్తరఫలమూల ♦ కంద మెపుడు.

అజా—మహాత్మా! మీ రుత్తరజన్మ మంగీకరింతురా?

బుద్ధ—అంగీకరింతును గాని దానికి నార్షమతస్థాపిత మగుజన్మాంతర మునకుఁ గొంతభేద మున్నది.

అజా—అది నాకు బోధించి నన్నుఁ గృతార్థుని జేయ వేఁడెదను.

బుద్ధు—కాని, జన్మాంతరతత్త్వ బోధనమునకుఁ బూర్వము జన్మాంతర మేతత్త్వమునకుఁ గలదని చెప్పుదురో యట్టితత్త్వమును దెలిసికొన నావశ్యకము గాదా?

(నేపథ్యమున) గురూత్తమా! బుద్ధాచార్యవర్యా! అట్టియాత్మతత్త్వమునుగూర్చియే బోధింపుఁడు.

అజా—జనులారా! సోదరులారా? మీరాయందఱితోఁ గలసి నేను గూడ నీమహామహునివలననుండి యాత్మతత్త్వబోధనమే సంతోషపూర్వకముగ విందును; గాని మీరు సందడి చేయక నిశ్చలదీక్షాన్వితులై వినుఁడు.

(నేపథ్యమున) చిత్తము. చిత్తము. అవహితులమై యున్నాము.

బుద్ధు—మగధదేశవాస్తవ్యులారా! మదీయసోదరులా!

(నేపథ్యమునఁ బెద్దచప్పటలు) జయబుద్ధాచార్యా! జయబుద్ధాచార్యా!

బుద్ధు—ఆర్షమతానుసరణముగ—"నేను, నేను" అని చెప్పఁబడున దేది?

అజా—అదియే యాత్మ కాదా?

బుద్ధు—అది చేతన మని చెప్పఁబడినదా? అచేతన మనియా?

అజా—అదియే చేతనము.

బుద్ధు—అది శాశ్వతమేనా?

(నేపథ్యమున) ఆ. ఆ. ఆ. ఆ.

బుద్ధు—అదియేనా సుఖదుఃఖముల ననుభవించునది?

(నేపథ్యమున) అదే! అదే!

బుద్ధు—దానికేనా యుత్తరజన్మము వచ్చు నని చెప్పుదురు?

(నేపథ్యమున) ఔను. దానికే—దానికే—

బుద్ధు—అట్టియాత్మ ప్రతిజనునిలో నొక్కొక్కటి యుండునుగాదా?

(నేపథ్యమున) ఉన్నది—ఉన్నది—ఉన్నది.

బుద్ధ—ఇదియేకదా యాత్మనుగూర్చి మీయందఱియభిప్రాయము?

(నేపథ్యమున) ఇదియే. ఇదియే. దీనికంటె భిన్నముగ మీరు బోధింతురా యేమి?

(మఱియొకధ్వనితో) ఎందుకు బోధింతురురా?

(మఱియొకధ్వనితో) బోధింప కేమి? ఇదివఱకు బోధించినవన్నియు చార్వాకమతానుసరణముగనే యుండెనా?

(మఱియొకధ్వనితో) ప్రసంగములు వలదు. శ్రద్ధగా వినుఁడు.

అజా—జనులారా! సందడి వలదు.

బుద్ధ—సోదరులారా! చేతనస్వరూప మగునాత్మ మీలో నున్నదని మీరు చెప్పునెడల—

(నేపథ్యమున) బాధ యేమున్నది?

బుద్ధ—అట్లు చెప్పునెడల—దానియందు మీకుఁ బ్రేమము మమకారము గలుగునుగాదా?

(నేపథ్యమున) కలుగును.

బుద్ధ—అందుచేతఁ దద్వ్యతిరిక్తము లగునితరాత్మలయం దుదాసీనభావముకూడఁ గలుగును గాదా?

(నేపథ్యమున) కలుగవచ్చును.

బుద్ధ—కావున మీ రిచ్చటనో, దేహాంతరమున మఱియొచ్చటనో స్వసుఖతత్పరులై యుందురు కాదా?

(నేపథ్యమున) ఉందుము.

బుద్ధ—స్వసుఖతత్పరత పరసుఖాచరణనిర్లక్ష్యతను గలుగఁజేయును గాదా?

(నేపథ్యమున) చేయును.

బుద్ధ—స్వసుఖాపేక్ష ముదిరి పరసుఖద్వేషముగ మాఱదా?

(నేపథ్యమున) మాఱును.

బుద్ధ—స్వసుఖమునే కోరుకొనువాఁ డెప్పుడైన సుఖ మొందునా?

(నేపథ్యమున) పొందఁడు.

బుద్ధ—నిజమే—పొందఁడు. పరద్వేషము గలవానికిమాత్రము సుఖ ముండునా?

(నేపథ్యమున) ఉండదు.

బుద్ధ—రెండునుగలవానికి?—

(నేపథ్యమున) సుఖము బొత్తుగ నుండదు.

బుద్ధ—అనఁగ నేముండును?

(నేపథ్యమున) దుఃఖము ద్విగుణముగ—

బుద్ధ—మతముయొక్క ముఖ్యోద్దేశములలో నొకటి సంసారదుఃఖవిమోచనమే కద?

అజా—మహాత్మా! నిశ్చయము.

బుద్ధ—భవదుఃఖవృద్ధి నొనర్చుమత మెట్టిమతమై యుండవలయును?

(నేపథ్యమున) దుర్మతము. దుర్మతము.

బుద్ధ—అంతకఠినమగుమాటేల? కావున నాత్మ శాశ్వతచేతనస్వరూపమనుకొనుట తగనట్లు కనఁబడుట లేదా?

(నేపథ్యమున) ఆ. ఆ. ఆ.

బుద్ధ—అజాతశత్రుఁడా! ఇంద్రియవ్యాపారము లెట్లు జరుగుచున్నవో స్వతత్త్వస్వభావమెట్టిదో యెఱుఁగినవాని కాత్మ చేతనుఁడని యూహించుటకుఁ గారణ మగపడదు.

(నేపథ్యమున) ఇంద్రియవృత్తి స్వతత్త్వజ్ఞానములుమాకుబోధింపవలయును.

అజా—జనులారా! తొందరపడెద రేల? సావకాశముగ వినుఁడు.

బుద్ధ—నాయనలారా! మీకుఁ గావలసినయంశము లన్నియుఁ గ్రమ క్రమముగ బోధింతును. ఆత్మ శాశ్వతమైనప్పుడు దానికి మార్పింతమాత్రము వీలులేదుకదా?

(నేపథ్యమున) లేదు. లేదు.

బుద్ధ—ఆత్మకు మార్పే లేనియెడల నిఁక సద్వృత్తులతోను ముక్తిప్రయత్నములతో నేమిపని యున్నది?

(నేపథ్యమున) మహాత్మా! మఱియొకసారి మఱియొకసారి.

బుద్ధ—సోదరులారా! మీలోఁ గొందఱకైన నాబోధము వినఁగూడదని, నాకు హాని చేయవలయు నని మిక్కిలి పట్టుదల యిదివఱకున్నది కదా. మాటలాడరేమి?

(నేపథ్యమున) ఇప్పుడు మీయెడల భక్తివిశ్వాసములు గలిగియున్నాము.

బుద్ధ—ఇప్పుడట్టి మార్పు కలిగినదని మీరొప్పుకొనుచున్నారు కదా? ఇట్లుకలిగినమార్పు మీదేహములలోఁ గలిగినదేనా?

(నేపథ్యమున) మాయాత్మలలో—

బుద్ధ—మీమతానుసరణముగ నాత్మలు మార్పఁబడనివైనచో నిట్టి మార్పెట్లుకలిగెను? అసత్యవాది సత్యవాది యగుటకు యత్నించుచున్నాఁడు కాఁడా? భ్రష్టుఁడు ధర్మమును స్వీకరించి సంఘమునఁ జేరి ముక్తి ప్రయత్నమును జేయుచున్నాఁడుకాఁడా? అట్లైనచో నెందులకుఁ జేయవలయును? కావున సోదరులారా! ఇందువలన నేమి చెప్పఁగలరు?

(నేపథ్యమున) ఆత్మమార్పఁబడఁగలదని—

బుద్ధ—వికారసహిత మగునది శాశ్వత మగునా?

అజా—కాని మహాత్మా! ఆత్మ శాశ్వత మను భ్రమము కలుగుట కేమి కారణము?

బుద్ధు—సోదరుఁడా! చెప్పెదను. సోదరులారా! మీ ప్రభు వేసిన ప్రశ్న మేమో మీకుఁ దెలిసినదా?

(నేపథ్యమున) తెలిసినది.

బుద్ధు—అదిగో! అటు చూడుఁడు. అది బుద్ధసన్యాసుల యాగారమే కద?

(నేపథ్యమున) ఆ ఆ!

బుద్ధు—ఏవేవి సంఘీభవించి యాగారమైనది?

(నేపథ్యమున) గోడలు, దూలములు, వాసములు, వెదురుతడకలు, పెంకులు, మేకులు, తలుపులు, గొళ్లెములు కలిసి యిల్లైనది.

బుద్ధు—ఇవన్నియుఁ దీసివైచినయెడల నిల్లనువస్తు వున్నదా?

(నేపథ్యమున) లేదు.

బుద్ధు—అటులే కరచరణాద్యవయవములు, చక్షురాదింద్రియములు, మనస్సుకలిసికదా "నే" నని వాడఁబడుచున్నది?

(నేపథ్యమున) ఔను.

బుద్ధు—ఇవి యన్నియుఁ బోయినపిమ్మట నింక 'నే' ననునది యుండునా?

అజా—మహాత్మా! మనము చేతనులము, ఆగార మచేతనము. సామ్యము పూర్ణముగ సిద్ధింపదని తోఁచుచున్నది.

(నేపథ్యమున) సెబాస్! సెబాస్! ప్రభువుగారు మంచిప్రశ్నమే యడిగిరి. ఔను. నిజమే. మనము నడువఁగలము; పరుగెత్తఁగలము. ఇల్లట్లుచేయఁగలదా?

అజా—జనులారా! సందడి వలదు.

బుద్ధు—సోదరులారా! నడుచుటకుఁ గాని పరుగెత్తుటకుఁ గాని యాత్మ యుండవలయునా?

(నేపథ్యమున) ఉండవలదా మఱి!

బుద్ధ—సోదరులారా! అటు చూడుఁడు. అది మీరాజుగారిగుఱ్ఱపుబం
డియేకద!

(నేపథ్యమున) ఆ. ఆ. ఆ.

బుద్ధ—చక్రాదిపరికరము కలసియేకద బండి యైనది?

(నేపథ్యమున) ఔను.

బుద్ధ—అట్టిబండికి గుఱ్ఱములఁ బూన్చి సారథి తోలిన గుఱ్ఱపుబండి న
డచునా?

(నేపథ్యమున) నడచును.

బుద్ధ—పరుగెత్తును గూడనా?

(నేపథ్యమున) ఆ. ఆ!

బుద్ధ—పరుగెత్తుచున్న గుఱ్ఱపుబండికి బండియాత్మ యని యొక్క శాశ్వ
త జీవాత్మ లోనుండనక్కఱ లేదుకద!

అజా—అదెట్లు? ఇక్కడఁ దోలువాఁడే జీవాత్మగ నెంచఁగూడదా?

(నేపథ్యమున) బాగు—అది బాగు—అది బాగు—

బుద్ధ—సోదరులారా! సారథి దారిలో బండిపైనుండి పడిపోయినపిమ్మ
టఁ గూడ బండి పరుగెత్తుచుండవచ్చునుగదా?

(నేపథ్యమున) ఉండదు కాని యుండవచ్చును.

బుద్ధ—అజాతశత్రుఁడా! జీవాత్మ. లేనప్పుడుకూడ గమనకృత్యము జ
రుగుచున్న దేల?

అజా—(ఆలోచించుచుండును.)

(నేపథ్యమున) గుఱ్ఱము లున్నవికావా?

బుద్ధ—నాయనలారా! కావున గుఱ్ఱములే జీవాత్మ యందురా?

(నేపథ్యమున) ఆ. అనవచ్చును.

బుద్ధ—గుఱ్ఱములు వానియంత నవి వచ్చి బండికిఁ దమ్ముఁ బూన్చుకొ
నునా?

(నేపథ్యమున) గుఱ్ఱములు, సారధి కలసి జీవాత్మ యని చెప్పిన బాధ యేమున్నది?

బుద్ధ—ఆత్మ యొక్క టేవస్తు వని నీశాస్త్రములు ఘోషించుచుండఁగ రెండువిజాతీయవస్తువులు గలిసి యాత్మ యగు నని మీ ర నుచున్నా రేల? కానిండు. బండివాఁ డున్నాఁడు; గుఱ్ఱము లున్నవి. ఇరుసు విఱిగినది. బండి నడువఁ గలదా?—మాట లాడ రేమి?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—ఇరుసుగూడ జీవాత్మభాగములలోనే చేర్తునా యేమి?

అజా—ఈయుపమానమును నరదేహమునకు వర్తింపఁజేసి బోధింపుఁడు!

బుద్ధ—సోదరుఁడా! ఉపమాన మెప్పుడు విశేషముగ సాగఁదీయఁ గూడదు. అదృశ్యతత్త్వములను బోధించుటకు దృశ్యపదార్థసాహాయ్యము గొంత యావశ్యకము కాన నిట్లు చెప్పుచున్నాను. ఒకవస్తువుతోఁ బోలినవస్తువు మఱియొకటి సృష్టిలో లేదు.

అజా—చిత్తము. బోధమైనది.

బుద్ధ—. సోదరులారా! జ్ఞానరహిత మగుమనస్థూలశరీరమే బండివంటిది. సంకల్పములే గుఱ్ఱములు. బుద్ధియేసారథి. సారథికి బండిదోలువృత్తి కలిగినవెంటనే కళ్లెములు కొరడ మొదలగువాని సాహాయ్యమున బండిని దోలినట్లు, బుద్ధికి గమనేచ్ఛ గలిగినవెంటనే నాడీతత్త్వాదిమూలకముగ దేహమును గదలఁజేయును. కదలుచున్న బండికి జీవాత్మ యెట్లనావశ్యకమో పరుగెత్తుమనుజునకుఁ గూడ నది యనావశ్యకము. సోదరులారా! ఏమందురు?

(నేపథ్యమున)ఇఁక నాత్మలేదా? లేదా? లేనే లేదా?

(మఱియొకధ్వనితో)నేను జెప్పలేదటరా? వేదాలు తుడిచిపె

ట్టినవానికాత్మ లెక్కయేటరా? దేవుఁడుమండకొడుకు బ్రతు
కుగూడ నిట్లేకాలిపోవును గాఁబోలు!

బుద్ధు—(మందహాసము సేయును.)

అజా—ఉస్సు! ఉస్సు! నోరు మూయుఁడు. కాఱు లఱవకుఁడు.

బుద్ధు—సోదరుఁడా! వా రసత్య మాడ లేదు. వారిపైఁ గోపము సేయ
వలదు. సోదరులారా! మీకు నామాట అనిష్టములుగ నుండు
టసహజమే.

గీ. మతనిహితపాప మెద్దియైన ♦ మంచి దగును
వృద్ధయాజియోడవ పెండ్లి ♦ విధముగాఁగ;
మతవిరుద్ధపుణ్య మెద్దైన ♦ మంచి గాదు
బాలికావితంతుపునర్వి ♦ వాహ మట్లు.

ఒడలినిండఁ గప్పుకొనినశాలువను దొంగ లూడఁ బెఱికికొనిననైన
బ్రాహ్మణుఁ డూరకుండును గాని దానితోపాటు యజ్ఞోపవీత
ముకూడఁ బోవఁగ మొఱ్ఱోమొఱ్ఱో యనును. మూఁడుదినము
లకు రెండుమాఱులైన భుజించుట కాతఁ డొప్పుకొనును గాని
మూడువ్రేళ్లతోఁ బాముకొను తిర్యక్పుండ్రమును రెండువ్రేళ్ల
తోనే పెట్టుకొమ్మన నూహుహ్హూనును. మతవిషయకము లగు
నిరర్థకాచారములనే విడుచుట దుస్సహముగా నుండునప్పుడు
మతప్రధాన మగుజీవాత్మతత్త్వమును విడువు మని చెప్పుట మీ
కిష్టముగ నుండునా? కాని—

గీ. గ్రుడ్డినమ్మకములవాఁడు ♦ కుమతినుండి;
హేతుబద్ధుఁడు సుమతి; త ♦ న్నితరు లుద్ధ
రింతు రనువాఁడు శఠుఁడు; యా ♦ త్మీయశక్తి
నమ్మి కడతేరువాఁడు వి ♦ జ్ఞానయుతుఁడు.

అజా—జనులారా! సోదరులారా! మీరు వృథగ నేదో యసందర్భము లాడుటచేఁ గదా బుద్ధాచార్యులవా రాత్మవిషయమును గొంత వదలి యితరాంశములఁ గూర్చి యుపన్యసించు శ్రమము గలిగినది. కావున సందేహ మున్నప్పు డడుగఁదగినదే కాని నడుమ నడుమ మీయభిప్రాయముల వెల్లడింపకుఁడు ఆచార్యవర్యా! మహాత్మా! కానిండు.

బుద్ధ—నాయనలారా! మీయిష్టానుసార మడుగ వచ్చును. అభిప్రాయముల వెల్లడింపవచ్చును.

(నేపథ్యమున) చిత్రము. ఆత్మ యనునది మిథ్య యనియే మీ యభిప్రాయమా?

బుద్ధ—శాశ్వత మగుజీవాత్మ యుండవలసినయావశ్యకత లేనట్లు కానఁబడుట లేదా? అట్టియాత్మ లేకున్న నట్టిది యున్నదనుభ్రమమును గలిగించుమఱియొకతత్త్వముమాత్రము లేకపోలేదు.

(నేపథ్యమున) అదియే యాత్మగ భావింపఁగూడదా?

బుద్ధ—భావింపవచ్చును గాని యది యనిత్యము అచేతనము.

(నేపథ్యమున) అబ్బే! అబ్బే! అట్టి దెందులకు? మహాత్మా! అట్టితత్త్వమేది?

బుద్ధ—అదియే 'అహం' తత్త్వము. అదియే 'నేను' అని మీరందఱు ను కొనునది.

(నేపథ్యమున) ఇది మఱింత చిత్రముగా నున్నది. 'నే' నున్నది గాని యాత్మ లేదఁట! హే హే హే!

బుద్ధ—నాయనలారా! చిత్రమే.

గీ. అంతరం బగుకొలవిద ♦ య్యంబె యాత్మ
యాంతరమరీచికాప్రవా ♦ హంబె యాత్మ

యాంతరాకాశతత్త్వేనం ♦ వ్యాప్తి యాత్మ్నా
ధ్యాంతరాహాంస్వరూపవి ♦ భ్రాంతి యాత్మ.

సోదరులారా! రాలలో నాత్మ యున్న దని మీయభిప్రా యమా?

(నేపథ్యమున) లేదు. లేదు.

బుద్ధ—వృక్షలతాదులలోనో?

(నేపథ్యమున) వానిలోఁగూడ లేదు.

బుద్ధ—పశుపక్షికీటకాదులలోనో?

(నేపథ్యమున) లేదు. లేదు.

(మఱియొకధ్వనితో) లేదందు వేమి? ఉన్నది.

(మఱియొకధ్వనితో) ఆసంగతి నిశ్చయముగఁ జెప్ప వీలులేదు.

బుద్ధ—కావున నాత్మ వానిలో నున్నదని నిశ్చయముగఁ జెప్పలేరు. మనుజులలోమాత్ర మున్నదని నిశ్చయముగఁ జెప్పఁగలరు.

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధ—వృక్షాదిసంఘమునుండియే పశుపక్షికీటకాదిపరిణామము గలిగిన దనియును, పశుపక్షికీటకాదులనుండియే నరరూపపరిణామము గలిగిన దనియు నొకసృష్టివిధానక్రమము పూర్వార్హతులు చెప్పినట్లు మీరు విని యున్నారుకదా?

(నేపథ్యమున) ఆ! ఆ!

బుద్ధ—నాయనలారా! ఒకచిన్నదృష్టాంతము. చెట్టువేళునకు దాని కొమ్మకు శాఖాతత్త్వమున నేమైన భేదమున్నదా?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—చెట్టుకొమ్మకు దానియాకునకు నుద్భిజ్జతత్త్వమున భేద మున్నదా?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—ఆకునకుఁ బుష్పమునకు?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—పుష్పమునకు ఫలమునకు?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—కాని వేరునకు ఫలమునకు స్వరూపాదుల నెంతభేదమైన నున్నదా?

(నేపథ్యమున) ఉన్నది.

బుద్ధ—కాని శాఖానైజమున భేద మెంతమాత్రము?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—చైతన్యము వృక్షములలో నున్నది. పశ్వాదులలో నున్నది. నరులలోనున్నది. కాని యొకదానిపరిణామ మొక్కటగునపుడు మొదటిరెంటిలో లేనియాత్మ నరులలోని కెక్కడనుండి వచ్చినది?

(నేపథ్యమున) వృక్షపశ్వాదులకంటె భిన్నముగ నరుఁడు జ్ఞానస్వరూపుఁడుకాఁడా? అందుల కేమి చెప్పెదరు?

బుద్ధ—జ్ఞానము నరునకుఁ గలిగినంతమాత్రమున నది ప్రత్యేకతత్త్వమని చెప్పఁదగునా? నాయనలారా! చెట్టుబెరడు వగరుగనో చేదుగనో యుండును. దానిపుష్పము మకరందపూర్ణమై యుండునా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధ—అందుచేత మకరందమనుతత్త్వము పైగా నెక్కడనుండియైన వచ్చినదా?

(నేపథ్యమున) లేదు.

బుద్ధ—వివిధము లగుశాఖాసామగ్రులు సూక్ష్మసూక్ష్మవిభేదములుగ నొకవిధ మగుక్రమమున సమావేశము లగునపుడు మకరంద ముద్భవించినదని చెప్పవచ్చును. కాని మకరందము స్వర్గము నుండిజారి పడినదనిగాని, యావిరుద్ధతత్త్వమును భగవంతుఁ డనువాఁ డొకఁడు పుష్పములందుమాత్రమే సృష్టించినాఁ డని కాని యెంచుటకు వీలు లేదుకదా!

(నేపథ్యమున) వీలు లేదు. కాని వివిధములగుశాఖాసామగ్రులు సూక్ష్మసూక్ష్మవిభేదములుగ నని చెప్పినారు. మాకు బాగుగఁ దెలియ లేదు.

బుద్ధ—పోఁకచెక్కను, సున్నమును, దములపాకుల నొకవిధమైనభాగ క్రమమున నమలినయెడల రక్తిమ పుట్టునా?

(నేపథ్యమున) ఆ. ఆ!

బుద్ధ—ఈరక్తిమ యీవస్తుత్రయసమావేశమునుండి కలిగినదేనా?

(నేపథ్యమున) ఆ. ఆ!

(నేపథ్యమున) ప్రాణవాయువు మఱియొక్కవాయువుతో నొక్క భాగవిధానమునఁ గలిసిన నీరము పుట్టునుగాదా?

(మఱియొకధ్వనితో) పుట్టవచ్చును గాఁబోలు!

(మఱియొకధ్వనితో) పుట్టవచ్చు నేమి? నీకుఁ దెలియదు. పుట్టును.

బుద్ధ—సోదరులారా! ఇట్టినీర ముభయవాయువిభేదసంయోగమువలన నే కలిగినదికదా! అట్లే. శాఖాతత్త్వవిభేదసమావేశముననే మకరంద ముద్భవించె నని చెప్పితిని.

(నేపథ్యమున) సరే. సరే! అట్లు కలియుటవలన నరునిలో జ్ఞాన మావిర్భవించినదో దయచేసి బోధించెదరు గాక!

బుద్ధు—నాయనలారా! చెప్పెదను. నాయనలారా! నాచేతిలో నే మున్నది?

(నేపథ్యమున) శాటి! శాటి! హేహేహే!

బుద్ధు—ఈశాటి యేరంగుకలది!

(నేపథ్యమున) జేగురురంగు.

బుద్ధు—అది మీరెట్లు గ్రహించిరి?

(నేపథ్యమున) కన్నులమూలమున.

బుద్ధు—ఆకన్నులమూలముననే దీనిపొడుగు, వెడల్పు, వైశాల్యమును గ్రహింపఁగలుగుకాదా?

(నేపథ్యమున) ఆ.

బుద్ధు—దీనిని మీపైఁ బడవేయనా?

(నేపథ్యమున) అట్టిప్రసాదమును స్వీకరించుటకేకదా వచ్చితిమి. పడవేయుఁడు. పడవేయుఁడు.

బుద్ధు—(పడవేయును)

(నేపథ్యమున) నాది. నాది. నాది?

(మఱియొకధ్వనితో) అదిగో! నాది. నీదెట్లు?

(మఱియొకధ్వనితో) నీదిమాత్ర మెట్లు? నీవేమి గడించితివా? నీతాతగారిసొమ్మా?

(మఱియొకధ్వనితో) ఉండుఁడు. ఉండుఁడు. మహాత్ముఁ డేమి చెప్పునో చెప్పనిండు. చీచీ! ఇటుతే. ఇటుతే. అదిగో! ఆఁ! ఆఁ! కన్నులకద్దుకొనియిచ్చెద నుండు. నమలి మ్రింగెద నను కొంటివా?

(మఱియొకధ్వనితో) నీవే ముందు దాని నేల స్పృశింపవలయును? నీవంటివాఁడనే నేనుమాత్రము కానా?

(మఱియొకధ్వనితో) ఉండు. ఉండు! ఆఁగు, ఆఁగు!

అజా—జనులారా! సోదరులారా! అల్లరి సేయకుఁడు. మంత్రీ!

(నేపథ్యమున) చిత్తము.

అజా—నీవది తీసికొని వరుసగఁ బోయి యందఱచే స్పృశింపఁ జేయుము.

(నేపథ్యమున) చిత్తము.

(తిరిగి నేపథ్యమున) ముందు నేను. ముందు నేను.

(మఱియొక ధ్వనితో) ఉండుఁడు. ఉండుఁడు.

(మఱియొక ధ్వనితో) ఇటు. ఇటు. ఇటు.

(మఱియొక ధ్వనితో) ఆహా! ఆహా! ఆహా!

(మఱియొక ధ్వనితో) అయ్యో! వలదు. వలదు. ఇదివఱకే కాలఁడు స్పృశించినాఁడు.

(మఱియొక ధ్వనితో) ఉండుఁడు. ఉండుఁడు.

(మఱియొక ధ్వనితో) ఆహా! ఆహా! ఆహా!

అజా—మహాత్మా! మీకాషాయమును స్పృశించుటకు జను లెంతసంభ్రమోత్సాహముల నొందుచున్నారు? మంత్రీ! అయినదా?

(నేపథ్యమున) మహాప్రభూ! అయినది. మహాత్మా! బుద్ధాచార్యవర్యా! ఈశాటి నాచేతిలో నున్నది. దీనిని నేను స్థిరముగ గ్రహించుట కనుజ్ఞ యీవేఁడెదను.

బుద్ధ—నీవు బుద్ధసన్యాసి వయ్యెదవా?

(నేపథ్యమున) మహాసంతోషపూర్వకముగ—

బుద్ధ—అజాతశత్రూ! ఆతఁడు నీకు ముఖ్యసేవకుఁడు గావున నీయంగీకారము లేకుండ—

అజా—ఆతఁడు, నేను, వీరందఱుఁగూడ మీసేవకులమే కామా? మంత్రీ! ఆచార్యులవారియనుగ్రహము నీపైఁ బ్రసరించినది. సన్యాసుఁడవు కమ్ము.

బుద్ధ—తథాస్తు.

(నేపథ్యమున) కృతార్థుఁడ నైతిని.

(వేఱొకనేపథ్యమున) గొప్పవారైన సరి.

(మఱియొకధ్వనితో) కాకపోయిన మనపెద్దగ మెవరు చూతురు?

(మఱియొకధ్వనితో) ఈయనగూడ వెనుక తాజేకనుక మంత్రి పైనఁ గాక్షికము వదలలేనుతా?

బుద్ధ—(మందహాసము సేయుచు) ఆతఁడు గొప్పవాఁడగుటచే నాతని వలన నేను స్వీకరింపవలసిన మహాభాగ్య మేమి నాయనలారా! మీకందఱకుఁ గూడవలయునన్న నీయకుందునా? ఇప్పటిప్రసంగమున కడ్డురాకుఁడు. మీరందఱు ఆ శాటిని స్పృశించిరి కాదా?

(నేపథ్యమున) ఆ ఆ. ఆ. ఆ!

బుద్ధ—అది మీస్పర్శకు మోటుగ నున్నదా? మెత్తగ నున్నదా?

(నేపథ్యమున) మోటుగ నున్నది.

(మఱియొకధ్వనితో) ఛీ ఛీ! మోటుగ నున్నదం దేమిరా? ఆమోటుదనములో నెంతమెత్తన యున్నది!

(మఱియొకధ్వనితో) ఈపాటికిఁ జాలించు. మోటుదనములో మెత్తన గాదు. మెత్తనలో మోటుదనముగ నున్నది.

బుద్ధ—సరే! సోదరులారా! ఎట్లోయొక ట్లున్నది. అట్టిజ్ఞానము, దాని శీతోష్ణతాజ్ఞానము మీకు స్పర్శవలననే కలిగినవి కావా?

(నేపథ్యమున) ఔను. ఔను.

బుద్ధ—ఇదివఱకు మీకన్నులవలన దానిరంగు వైశాల్యమును గ్రహించిరి కారా?

(నేపథ్యమున) ఔను.

బుద్ధ—ఈ రెంటను గలసి శాటిరూపజ్ఞాన మైనది కాదా?

(నేపథ్యమున) చిత్తము.

బుద్ధ—ఇది జ్ఞప్తి యుంచుఁడు. దీని పేరు రూపము.

(నేపథ్యమున) సరే. రూపము. రూపము.

బుద్ధ—అది మీరుఁ దాఁకునప్పుడు మీకానందముగ నుండెనా దుఃఖముగ నుండెనా?

(నేపథ్యమున) అమితానందముగ నుండెను.

బుద్ధ—అట్టియనుభవము పేరే వేదనము.

(నేపథ్యమున) చిత్తము. వేదనము. వేదనము.

బుద్ధ.—ఆ శాటి మీకు గలిగిన బాగుగ నుండు నని, దానిని ధరించి యితరులకు జ్ఞానబోధనము చేయవచ్చు నని మొదలగు నూహ ములు మీకుఁ గలిగినవా? లేదా?

(నేపథ్యమున) ఓ ఓ ఓ! కలిగినవి.

బుద్ధ—అట్టియూహాము లే విజ్ఞానము.

(నేపథ్యమున) చిత్తము విజ్ఞానము. విజ్ఞానము.

బుద్ధ—ఆ శాటి మీయొద్ద లేనప్పటికి, దానిని మనస్సునఁ దలఁచుకొని దానియాకారాదుల స్మరింపఁగలరా?

(నేపథ్యమున) కన్నులు మూసికొనుసరి కది యెట్టయెదుట సం పూర్ణముగఁ గానఁబడుచున్నది.

బుద్ధ—ఇట్టి స్మృతియే సంజ్ఞ.

(నేపథ్యమున) చిత్తము. సంజ్ఞ సంజ్ఞ.

బుద్ధ—అది జ్ఞప్తి తెచ్చుకొనుకొలఁదిఁ బాపజీవనవ్యాపారము వదలి పవిత్రజీవనమే జీవింపవలయు ననియు, దుఃఖభూయిష్ఠమగు సంసారమును త్యజించి దుఃఖరహిత మగుపదవిని సంపాదింపవలె

ననీయు నెకవిధమైనమార్పు మీలోఁ దాత్కాలికముగ నైనఁ గలిగి యిదివఱకు మీనడవడిలో నున్నసుగుణములను మఱింత యుద్బోధ సేసినట్లు మీకుఁ దోఁచలేదా?

(నేపథ్యమున) ఆ. ఆ. ఆ.

బుద్ధు—దీని పేరే సంస్కారము.

(నేపథ్యమున) చిత్తము. సంస్కారము. సంస్కారము.

బుద్ధు—అజాతశత్రుఁడా! త్వక్చక్షుర్పులగుండ, గలిగినరూపమునకును, ఇవ్వాను గలిగిన వేదనావిజ్ఞానసంజ్ఞాసంస్కారములకును భేద మేమైన నున్నదా?

అజా—ఈనాల్గును మనస్సులో వానియంతనే కలిగినవికారములు. రూపము బహిర్వస్తువువలన మనసునఁ గలిగినవికారము.

బుద్ధు—సోదరులారా! తెలిసినదా? మనస్సుకంటె భిన్నమైనది దేహమే కావున దేహాశ్రయమువలనఁ గలిగినది రూపము. చిత్తాశ్రయమువలనఁ గలిగినవి వేదనావిజ్ఞానసంజ్ఞాసంస్కారములు. ఈనాల్గింటి కొక్కటే పేరు గలదు. అదినామము.

(నేపథ్యమున) నామము. నామము.

బుద్ధు—ఈనామరూపములు గలసి యనఁగా రూపవేదనావిజ్ఞానసంజ్ఞాసంస్కారములు/పంచస్కంధములును గలిసి యహ్మాన్మను తత్త్వమైనది.

(నేపథ్యమున) కలిసి కలిసి యుంటిరి కాదా? వానిని గలిపిన దేది?

బుద్ధు—కలియునవి యవియే. కలుపుకొనునవి యవియే.

(నేపథ్యమున) అదియెట్లు? కలుపునది మఱియొకటి లేకున్నఁ గలయిక సిద్ధించునా?

బుద్ధు—సోదరులారా! సిద్ధింపవచ్చును. తప్పు లేదు. చెఱకుపానకము కొంతకాలము నిలవ యుంచినయెడలఁ బానకపుఁగుండలో నడుగున నేముండును?

(నేపథ్యమున) పంచదారపలుకులు.

బుద్ధ—ఈపలుకు లన్ని చిన్నచిన్నయణువులు గూడియే యైనవి కా వా? యీయణువుల నిట్లు కూర్చిన దేది? అదిగాక మీరు పణ్ముఖము లగుమంచునక్షత్రములఁ జూచినారా?

(నేపథ్యమున) ఓ! ఓ! చూచితిమి.

బుద్ధ—గాలిలోని యావిరి ఘనీభవించునప్పుడు వాని నట్టివిచిత్రరూపముగఁ గూర్చిన దేది?

(నేపథ్యమున) తమ్ముఁ దామే యట్లు కూర్చుకొనినవి.

బుద్ధ—బాహ్యప్రపంచమున నిట్టికూడిక యెట్లు జరుగుచున్నదో యాంతరప్రపంచమునఁ గూడఁ బంచస్కంధసమావేశ మట్లే జరుగుచున్నది. నాయనలారా! కూర్చునదేదియు ననావశ్యకము.

అజా—ఈపంచస్కంధములుగూడ నశాశ్వతములే కావా?

బుద్ధ—సోదరుఁడా! అనిత్యములే. ఈమతమున నిత్యత గలిగినపదార్థమేదియు లేనే లేదు.

(నేపథ్యమున) అవి యనిత్యము లగునపుడు వానిసమావేశము నిత్యమగు 'నేను' నెట్లు కాఁగలదు?

బుద్ధ—నాయనలారా! 'నేను' మాత్రము నిత్యమా? అదిమాత్రము మాఱుచున్నది కాదా? మీ చిన్ననాఁటి 'నేను' నకు నిప్పటి 'నేను' నకు నెంతభేదమున్నదో యోజించుకొనరాదా?

(నేపథ్యమున) అవాంతరపుభేదము లెన్నియున్నను వెనుకటి "నేను" తత్త్వమేయిప్పుడుకూడ మాలో నున్నట్లు మాకు నమ్మకము.

బుద్ధ—దానికేమి లెండు. అట్టియేకత్వ మవిచ్ఛిన్నజ్ఞానసంతానమువలనఁ గలుగుచున్నది. చెంబులోనుండి నూనె ధారగాఁ బడుచు

న్నప్పు డేధార కాధార వేఱయ్యును ధార. యొక్కటిగానే కా
నంబడుచున్నది కాదా? ఉదకబిందువు లేక్షణమున కాక్షణము
ప్రవాహవేగమున మాఱుచున్నను నది యొక్కటియే కాదా?
ఇది గాక మీశరీరములోని పరమాణువులుకూడ మాఱుచు
న్నవి కావా? పోయినపరమాణువుల స్థానములందు నూతనము
గఁ జేరినపరమాణువులకుఁ బ్రాఁతపరమాణువులయనుభవము స్వ
భావము తత్వమువచ్చునట్లు పంచస్కంధములలో నశించినభా
గములందుఁ దిరిగఁ జేరుస్కంధభాగములు స్వస్వభావానుభవ
తత్త్వములై యుండును. అందుచేతనే యహంతత్త్వ మనిత్య
మయ్యును నిత్యమనుభ్రమము కలిగించుచున్నది. అదిగాక—
సోదరులారా! వినుచున్నారా?

(నేపథ్యమున) శ్రద్ధగా వినుచున్నాము. 'అదిగాక' యని సెల
విచ్చినారు. మిగిలినయంశము లుపదేశింపఁ బ్రార్థించుచున్నాము.

బుద్ధ—మీరు పుట్టునప్పుడే మీతలిదండ్రులగుణములు, రుచిభేదములు
సహ్మకములు, వృత్తిచాకచక్యములు, నడవడులు మొదలగునవి
మీకుఁ దప్పక సంక్రమించును. మీయహంతత్త్వమున కీపూ
ర్వార్జితమే ప్రాతిపదిక. తరువాత చిన్నతనములో మీరు గురు
వులదొద్ద నభ్యసించిననీతులు, తెలుచుగఁ జూచుచున్న వస్తువుల
సుఖదుఃఖానుభవములు, శరీరప్రకృతులననుసరించి చేసికొనిన
యలవాటులు, మొదలగునవి మీయహంతత్త్వముచుట్టుఁ జేరి
దానితో నేకీభవించి దానిని బలిష్ఠముఁ జేయును. పంచస్కం
ధములలో నీబలిష్ఠ మగుభాగము మిగిలినభాగములకంటెను
క్షణికము లగునితరానుభవములకంటెను బ్రత్యేకముగ భిన్న
మైనట్లు కనఁబడును. అట్లుండుటయే కాక—సుఖదుఃఖములూ
తానే యనుభవించున ట్లుండును.

(నేపథ్యమున) ఓహో! చిత్రముగనే యున్నది. ఈయహం
తత్త్వముకూడ ననిత్యమేనా?

బుద్ధ—అనిత్యమే కాని యిందులోనిమార్పు లంత శీఘ్రముగ జరుగవు
కాని యనిత్యమే.

(నేపథ్యమున) ఇదియే యాత్మ యనుకొనరాదా?

బుద్ధ—అనుకొనవచ్చును. కాని యిది దేహచిత్తములకంటె భిన్నమగు
నది కాదు. ప్రత్యేకచేతనస్వరూపము కాదు. పైనెక్కడనుండి
యో వచ్చినది కాదు. ఎక్కడకో పోయి సుఖదుఃఖ మనుభ
వించునది కాదు. శాశ్వతము కాదు. ఇట్టిదానిని మీ రాత్మ
యనిన సరే. మఱి యేమనిన సరే. పేరులోఁ బని యేమున్నది?
ఆత్మయైన సరే. అహమైన సరే. బుద్ధుఁడైన నేమి? దేవద
త్తుఁడైన నేమి?

(నేపథ్యమున) మహాప్రభూ! వంట లైనవి. తోము. శ్రీబుద్ధా
చార్యులవారితోడను, వారిశిష్యులతోడను—లోనికి దయచే
యుదురు గాక!

బుద్ధ—ఆతఁడు నాసోదరుఁడగు దేవదత్తుఁడు కాఁడా?

అజా—ఔను.

బుద్ధ—ఆతఁ డిచ్చటకు రాలే దేమి?

అజా—ఆతనిని మఱియొకపనిమీఁద నియమించితిని. నన్నుఁ గటాక్షిం
చినట్లే దోషుఁడగు నాతనినికూడఁ గటాక్షించి తమశిష్యులలో
నొకనిగఁ జేర్చుకొనవలయును.

బుద్ధ—అంతకంటె సంతోషమేమి?

(నేపథ్యమున) మహాత్మా! మామాట మఱచిపోయినారు.

బుద్ధ—నాయనలారా! మిమ్మెట్లు మఱతును? మీలో సన్యాసులు
గాఁదలఁచినవారెవరో బుద్ధసంసారులుగఁ గాఁదలఁచినవా రెవ

రో భోజనకాలమునఁ జూచి మిమ్ము నామూతమునఁ జేర్చుకొం
దును.

(నేపథ్యమున) చిత్తము.

అజా—కావలసినన్ని నూతనకాషాయముల సిద్ధపఱిచి యుంచితిని. కా
వలసినవారికిఁ బ్రసాదింపవచ్చును. స్వామీ! భిక్షాసమయ మై
నది. దయచేయుదురుగాక!

(నేపథ్యమున) స్వామీ, మాకింకజన్మాంతరమును గూర్చి కూ
డ నెప్పుడుబోధింతురు?

బుద్ధు—అది భిక్షానంతరమునఁ జెప్పెదను. రండు.

(నేపథ్యమునఁజప్పటలు) జయబుద్ధాచార్యా! జయబుద్ధాచా
ర్యా! జయ! జయ! జయ!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది సప్తమాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ.

అష్టమాంకము.

——:o:——

ప్రవేశము. మగధ.

ప్రవేశము. బుద్ధుడు, అజాతశత్రుడు.

అజా—సోదరులారా! మగధదేశవాస్తవ్యులారా! పుణ్యవశమున మనమందఱము బుద్ధమతావలంబకుల మైతిమి. మనయాచార్యులవా రిప్పుడు జన్మాంతరమునుగూర్చి యుపదేశింతురు. మీరందఱు శ్రద్ధగా వినవలయును.

(నేపథ్యమున) ఓ! ఓ! సిద్ధముగ నున్నాము.

అజా—మహాత్మా! మీరిఁక నారంభింపవచ్చును.

బుద్ధు—(లేచుచున్నాఁడు.)

(నేపథ్యమునఁ జప్పటులు.) జయబుద్ధాచార్యా! జయబుద్ధాచార్యా!

అజా—ఆచార్యవర్యా! మీరు లేవనేల? కూరుచుండియే యుపన్యసింపవచ్చును.

బుద్ధు—సోదరుఁడా! నా కేమియు బాధ లేదు. బౌద్ధమతావలంబకులారా! బుద్ధసోదరులారా!

(నేపథ్యమున) ,,బుద్ధశిష్యులారా! బుద్ధసేవకులారా!,, యని సంబోధింపఁదగును.

బుద్ధు—(నవ్వుచు) నాయనలారా! శిష్యులుకావున నేనా గురుప్రగ్గాతి యారంభసంబోధనవాక్యములలోనే తప్పుపట్టుకొంటిరి?

(నేపథ్యమున) క్షమించుఁడు. క్షమించుఁడు.

బుద్ధు—నాయనలారా! గురుశిష్యసంబంధము కల్పితము. నాకుఁ దెలియనియంశములు మీకుఁ గొన్ని తెలిసి యుండవచ్చును. అట్టిచో మీరు నాకుగురువులు కావచ్చును. అన్నియుఁ దెలిసినవాఁ డెవ్వఁడును లోకమున లేఁడు. అందుచే నుపదేశకోపదేష్టసంబంధ మసమంజసము. ఇఁక సోదరసంబంధమో సత్యము. సమీచీనము. సహజము. ఆత్మను ద్రోసివైచుటచే నది మఱింత సత్యము. కోట్లయణువులు గలసినయిసుకతిప్ప యొక్కటిగనే పరిగణింపఁబడినట్లు, సంఖ్యాహీనబిందుసంతాన మగుసముద్ర మొక్కటిగనే పరిగణింపఁబడినట్లు మన మందఱము దేహమనస్త్వములు నొక్కటి. ఒక్కటి. ఇట్టిసర్వప్రాణిసంపూర్ణైకతత్త్వము నాత్మవాది సహస్రకోటిధా భిన్నపఱిచి యేముక్క కాముక్కకే స్వాతంత్ర్యస్థితిని స్థాపించినాఁడు. అట్టియేర్పాటు నీతిబాహ్యము. అహంభావవివర్ధనము. అసూయోజనకము. అజ్ఞానోత్పాదకము. కావున సోదరులారా! యనియే మిమ్ము పిలుతును. సద్గేహులారా! సమనస్కులారా! యని పిలిచిన మఱింత యర్థవముగ నుండును గాదా?

(నేపథ్యమున) చిత్తము. చిత్తము.

బుద్ధు—అనిత్యము లగుపంచస్కంధములసమావేశమే 'నేను' అని మీకుఁ దెలిసినదికదా!

(నేపథ్యమున) చిత్తము. చిత్తము.

బుద్ధు—ఈస్కంధములవియోగమే మరణము.

(నేపథ్యమున) చిత్తము.

బుద్ధు—మరణానంతరమున జన్మాంతర మున్నదా లేదా యనునంశమే యిప్పుడు స్థిరపఱచఁదగినది కాదా?

(నేపథ్యమున) చిత్తము.

బుద్ధు—శాశ్వతవాదులు—అనఁగ—సోదరులారా! ఎవరు?

(నేపథ్యమున) ఆత్మ శాశ్వతత్త్వ మని వాదించువారు.

బుద్ధు ఆత్మకు జన్మాంతర మంగీకరింతురు. అనఁగ నొకఁడు మరణించినతరువాత నాతనియాత్మకు దేహాంతరనివాసము పూర్వజన్మార్జితకర్మఫలభోక్తృత్వము నంగీకరింతురుకాదా?

(నేపథ్యమున) ఔను. ఔను.

బుద్ధు—లోకాయతులు మరణముతరువాత జన్మాంతరము లేదనియు మృతియే ముక్తి యనియుఁ జెప్పుదు రని మీరు వినియున్నారు కదా!

(నేపథ్యమున) వింటిమి. వింటిమి.

బుద్ధు—జనుఁడు జీవించియుండునంతకాలము—అనఁగ—పంచస్కంధ సమావేశము నిలిచియున్నంత కాలము—పరమగాఢనిద్రావస్థలోఁదప్ప జనుఁ డేదియో యొకపనిఁ జేయుచునే యుండును గాదా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—ఔను. వాక్కుచేతనో మనస్సుచేతనో కాయముచేతనో యేదియో యొకకర్మము స్వలాభమునకో యితరలాభమునకో పరనష్టమునకో చేయుచునే యుండును గాని యెన్నఁడూరక యుండఁడుగదా!

(నేపథ్యమున) ఉండఁడు. ఉండఁడు.

బుద్ధు—కావున జనునిజీవిత మనఁగఁ గర్మసంతాన మని చెప్పినఁ దప్పు లేదుకదా!

(నేపథ్యమున) లేదు. లేదు.

బుద్ధు—ఈకర్మ మనునది యెప్పు డాత్మవిషయికముగనే యుండక పరు లకుఁ గూడ సంక్రమించునదై యుండునుగద!

(నేపథ్యమున) జనసంఘమున జీవించియున్నంతకాల మట్టిసంబం ధముతప్పనే తప్పదు.

బుద్ధు—జనసంఘమున జీవించియున్నంత కాలమేనా?. మీ రొకకుక్క కాలు విఱుగఁగొట్టి రనుకొనుఁడు, మీరు నశించినను—

(నేపథ్యమున) మాకర్మముమాత్రము నిలుచును.

బుద్ధు—ఎక్కడ?

(నేపథ్యమున) కుక్కలో.

బుద్ధు—మీజీవితమునకును మీకర్మసంతానమునకును భేదము లేదని యొక్కనిమేషముక్రింద మీ రొప్పుకొంటిరి. జ్ఞప్తి యున్నదా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—మీకర్మము కుక్కలో నిలిచె ననఁగ మీజీవనాంశము కుక్క లో నున్న దన్నమాటయేనా?

(నేపథ్యమున) అయ్యో! అయ్యో! ఔను,

(మఱియొకధ్వనితో) తప్పుపని చేసినయెడలఁ బందివై పుట్టుదువు; గాడిదవై పుట్టుదు వని ధర్మశాస్త్రములు చెప్పుమాట లివియే కాఁబోలు!

బుద్ధు—ఆసంగతి తరువాత నాలోచింతము. జీవనమనఁ బంచస్కంధ సమావేశ మనిన బాధయున్నదా?

(నేపథ్యమున) తత్సమావేశమునఁ బుట్టితిమి. తద్వియోగమునఁ జచ్చుచుంటిమి. కావున నట్లనిన బాధలేదు.

బుద్ధు—పంచస్కంధసమావేశమే నేను నని మీకుఁ దెలిసి యున్నది కాదా?

(నేపథ్యమున) తెలియ కేమి?

బుద్ధు—కావున గుక్కను గొట్టిన రు కుక్కలోఁ బుట్టినవారుకా లేదా?

(నేపథ్యమున) ఐతిమి అయ్యో! ఐతిమి.

(మఱియొకధ్వనితో) ఎట్లైతిమి? ఎట్లైతిమి? మేము మొద్దులవలె జీవించియుండఁగనే మాకుఁ బునర్జన్మముఁ జెప్పుచుంటిరేమి?

బుద్ధు—నాయనలారా! మేమనఁగ మీపంచస్కంధము లే కాదా?

(నేపథ్యమున) ఔను.

బుద్ధు—అవి కేవల మనిత్యము లని చెప్పలేదా? భోజనాత్పూర్వ మాత్మమగూర్చి మీ కుపదేశించినబుద్ధుఁడు మరణించినాఁడు. జన్మాంతరమునుగూర్చి యిప్పు డుపదేశించుబుద్ధుఁడు వేఱు. తెలిసినదా? మీరందఱిట్లే మరణించి తిరిగి పుట్టినవారే.

(నేపథ్యమున) అయ్యో! అయ్యో! ఇది యెట్లు?

బుద్ధు—దేహములు క్షణికములు. పంచస్కంధము లనిత్యములు. క్షణక్షణము పుట్టుదుము. క్షణక్షణము చత్తుము.

అజా—మహాత్మా! ఇట్టిక్షణక్షణమృతులకు విచారము లేదు. క్షణక్షణనూతనజన్మములకు సంతోషము లేదు. కాని స్థిరమైనచావొకటిగల్గుచున్న దేల? అదికూడ నిప్పటిమృతులవలెనే క్షణికమై వెంటనే పునర్జన్మ మేల రాఁగూడదు.

(నేపథ్యమున) సెబాస్! సెబాస్! మంచిప్రశ్నము.

బుద్ధు—క్షణక్షణమృతులలోఁ బంచస్కంధములలోనితత్త్వములకు మార్పేకాని వియోగము లేదు. పూర్వస్కంధములు మాఱఁగనే నూతనస్కంధములు తత్స్థానమునఁ జేరును. అందుచేఁ బూర్వాహంతత్త్వమరణము, నూతనాహంతత్త్వజననము సిద్ధించును.

ఈరెండును వేఱువేఱునేను ,లయినను విచ్ఛిత్తిశూన్యతచేత నేకముగనే కానఁబడుచున్నవి.

అజా—ఇఁక స్థిరమరణముననో—

బుద్ధు—దేహమనఃపాటవశూన్యతచేఁ బంచస్కంధములకుఁ గేవలవియోగమే కలుగును. ఇంద్రియాళిగుండ నూతనస్కంధాగమమున కవకాశములేనే లేదు.

అజా—అట్టివానికిఁ బునర్జన్మ మున్నదా?

బుద్ధు—లేకేమి? అవసానావస్థలో నాతఁడుచేసినకర్మమునుబట్టి—

(నేపథ్యమున) హే హే! చచ్చువానికిఁ గర్మమొకఁడు చేయవలయును గాని చచ్చువాఁడు చేయుకర్మ మేమున్నది?

బుద్ధు—భార్యాపుత్త్రులను విడిచిపెట్టలేక యేడ్చును. తనగతి యేమగునోయని మొఱఁబెట్టును. తానులేకపోయినపుడు దనవారిని గాపాడు మని యొకనిఁ గాళులు పట్టుకొనును. మరణశాసనములు వ్రాయించును. మాటలాడుట, చేయుటయే కాక యాలోచించుటయుఁ గూడఁ గర్మమే కానఁ బ్రాణము పోవునిమేషమువఱకుఁ గర్మము చేయనిసమయ మున్న దని చెప్పవీల్లు లేదు.

(నేపథ్యమున) పిడుగుచే హఠాత్తుగాఁ జచ్చినవానిమాట యేమి చెప్పెదరు?

బుద్ధు—తత్పూర్వక్షణమున నాతఁ డొనర్చినకర్మ మూరక పోవునా?

(నేపథ్యమున) ఊరక పోక యేమి చేయును? మాకు బోధమగా లేదు.

బుద్ధు—ఆకర్మమున కేశరీర మధీనమయ్యెనో యచ్చట పునర్జననము సిద్ధించును.

(నేపథ్యమున). ఉండరా! ఉండరా! ఇంతకుఁ బూర్వము మనము కుక్కను గొట్టినప్పుడు కుక్కలో మనము పుట్టలేదఁటరా? అదే కాఁబోలు!

అజా—మహాత్మా! స్కంధసమావేశము వీరిలో నుండఁగనే వీరు కుక్కలో నెట్లు పుట్టిరి?

(నేపథ్యమున) ఔను. ఔను. అది బాగుగా నున్నది. మా స్కంధములు మాలోనే యున్నవి. మాస్కంధములు కుక్కలోనికి వెళ్లినప్పుడుగదా మాకచ్చట జననము.

బుద్ధు—నాయనలారా! అక్కఱలేదు. అక్కఱలేదు. ఒకదీపమునుండి మఱియొకదీపమును ముట్టించినపుడు మొదటదీపమే రెండవదీప స్థానమునకుఁ బోయినదా? మొదటిదీప ముండఁగ రెండవదీపము వెల్గుచున్నదికాదా?(నేపథ్యమున) కాని రెండవదీపము మొదటి దీపస్పర్శచేఁ గలిగినది కాదా? ఇక్కడ నట్టి దేది?

బుద్ధు—కాలు విఱుగఁ గుక్కను గొట్టుట స్పర్శమాత్రమైనఁ జేయదా? అయినను నాయనలారా! అట్టిస్పర్శగూడ నెంతమాత్ర మక్కఱ లేదు.

(నేపథ్యమున) అదెట్లు?

బుద్ధు—"ఆత్మలేదు" ఈరెండు మాటలు మీ రొకసారి గట్టిగ ననుఁడు.

(నేపథ్యమున) ఆత్మ లేదు. ఆత్మ లేదు. ఆత్మ లేదు.

బుద్ధు—నానోట వెడలినయీమాటలు మీనోటిలోనుండి బయలుదేరి నవా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—నేననిన మాటలే మీనోళ్లలో దూరి యక్కడఁ బుట్టినవా?

(నేపథ్యమున) లేదు. లేదు.

బుద్ధు—అటులే మీస్కంధములుగూడఁ గుక్కలోనికిఁ బోకుండనే, యు
క్కడ జన్మాంతరము నొందఁగలవు కద!

(నేపథ్యమున) ఆ. ఆ. ఆ.

(మఱియొకధ్వనితో) ఆ. ఆ! యనెద వేమి? నీవుండుము. ఉండుము. కుక్కనుగొట్టినవాండ్రము మేము. అందుచే మేము కుక్కలోఁ బుట్టితి మని చెప్పితిరి. కానిమాస్కంధము లచ్చటకుఁ బోలేదు. మేమే యచ్చటఁ బుట్టియుండినయెడల మాదుష్కర్మఫలము మే మనుభవింపవలసినది. అట్లుగాక తత్ఫలము కుక్క యనుభవించు చున్నది. అదెట్లు?

బుద్ధు—అయిన వింత యేమున్నది? (మందహాసము చేయును.)

(నేపథ్యమున) వింత కాదా? అట్లు సెలవిచ్చుచున్నా రేమి?

బుద్ధు—వింత యెట నున్నదో స్పష్టీకరించుఁడు.

(నేపథ్యమున) కర్మము చేయువాఁ డొకఁడు. తత్ఫల మనుభవించువాఁడు మఱియొకఁడు. ఇఁక సదసత్కర్మములకుఁ బ్రోత్సాహక మేమున్నది?

బుద్ధు—సోదరులారా! చెప్పవలసిన దంత యైనదా?

(నేపథ్యమున) మాసత్కర్మములవలని ఫల మనుభవించువా రుత్తరజన్మమునఁ బరులగునప్పుడు మేము సత్కర్మములను గష్టపడి యేల చేయవలయును?

బుద్ధు—మఱి యేమైనఁ జెప్పవలసి యున్నదా?

(నేపథ్యమున) మాదుష్కర్మములఫల ముత్తరజన్మముల ననుభవించువారు పరులైనప్పు డిఁక మాకేమి? బాహుశక్తి యున్నంతవఱకుఁ బరుల నందఱను బాధింపనే వచ్చును.

బుద్ధు—కాని మీకర్మఫలము నేకదా పరు లనుభవించునది?

(నేపథ్యమున) ఐన నేమి? ఐన నేమి? అనుభవించువారు పరులు

(మఱియొకధ్వనితో) ఔను. పరులు. పరులు. పరులు.

బుద్ధ—కర్మము భిన్నమైయున్నప్పుడు పరానుభవముతో మీకుఁ గొం
చెమైన సంబంధ మున్న దందురా? లేదందురా?

(నేపథ్యమున) మాకేమిసంబంధ మున్నది? పరునియేడుపు పరు
నిదే.

బుద్ధ—పరునియేడ్పునకు మీకర్మముకొంత కారణమైనను గాలేదా?

(నేపథ్యమున) అయినది.

(మఱియొకధ్వనితో) కొంతకారణమేమి? పూర్ణ కారణమే యై
నది. అయిన నేమి? అనుభవించువారుమాత్రము పరులు.

(మఱియొకధ్వనితో) ఔను. పరులు. పరులు. పరులు. పరులు.

(మఱియొకధ్వనితో) సిద్ధాంతముగాఁ బరులు. పరులు.

బుద్ధ—నాయనలారా! ఒకమాట చెప్పుదురా? పరులు పరు లని య
న్నిమాఱులు మీరంటిరే? ఈపరు లెవరు?

(నేపథ్యమున) మఱెవరు? మేము కానివా రందఱు పరులే.

(మఱియొకధ్వనితో) ఉండు. ఉండు. తొందరపడకు.

(మఱియొకధ్వనితో) బాధ లేదు. అట్లనవచ్చును.

బుద్ధ—నాయనలారా! మేము కానివారు పరు లంటిరి కదా! మీలో
మీకైక్య మున్నదా?

(నేపథ్యమున) లేదు. మాలో నొక్కనికి మిగిలినవా రందఱు ప
రులు. ఇట్లే యందఱకు—

బుద్ధ—మీలో నొక్కఁడుమాత్రము మిగిలినవారికంటె ముందునకు వ
చ్చి నిలువఁబడవలయును.

(నేపథ్యమున) ఇదిగో! నేను.

(మఱియొకధ్వనితో) నీవేల? ఇదిగో! నేను.

(మఱియొకధ్వనితో) ఉండు. ఉండు. నేను వచ్చుచున్నాను. మహాత్మా! నేను వచ్చితి.

(ప్రవేశించును.)

బుద్ధు—నాయనా! నీపేరు?

గో—గోపాలదాసుఁడు.

బుద్ధు—నీవు కానివా రందఱు పరులేకద!

గో—ఔను.

బుద్ధు—నాయనా! ఏకారణముచేత వారందఱు పరులైరో చెప్పెదవా?

గో—వారి శరీరములు వారికి వేఱు. నాశరీరము నాకు వేఱు.

బుద్ధు—శరీరములు భేదములుగ నుండుటచేతనేనా వారు పరులైరి?

గో—ఔను.

బుద్ధు—నీశరీరము నాయనా! నీవే సంపాదించితివా?

గో—లేదు. మాతండ్రిగా రిచ్చిరి.

బుద్ధు—నాయనా! మాంధాతవలె నీతండ్రిగారే నిన్నుఁ బ్రసవించిరా?

(నేపథ్యమున) హే హే హే!

గో—మాతల్లిదండ్రులు నాకీశరీర మిచ్చిరి.

బుద్ధు—నాయనా! కావున నీదేహము నీతల్లిదండ్రులదేహములలో నుండుటచేత వారు నీకుఁ బరులు కారు గద!

గో—కారు.

బుద్ధు—అటులే నీపుత్త్రులు నీకుఁ బరులు కారుగద?

గో—కారు.

బుద్ధు—నాయనా! ఇదివఱకు నీవుగానివా రందఱు పరు లంటివి. కాదా? ఇప్పుడేమి శోధించుచున్నదో చెప్పెదువా?

గో—నేనుగాని వారిలోఁగూడ నావా రున్నారు.

బుద్ధు—నీవా రనఁగ నేమి?

గో—నాదేహమే వారిది! వారిదేహమే నాది యనఁదగినవారు.

బుద్ధు—దేహములు వేఱుగాఁ గానఁబడుచున్న నేక దేహమే యగువా
రు కొంద ఱుండవచ్చును గద!

గో—ఉన్నారు.

బుద్ధు—ఇటులే నీతల్లిదండ్రులనుండి వారితల్లిదండ్రులకు నక్కడినుండి
యింకఁబైకిఁ బోవఁగ నిదివఱకుఁ బుట్టినవారలందఱితో నీ వేక
దేహుఁడ వని తోఁచుచుండుట లేదా?

గో- ఆ. ఆ.

బుద్ధు పరిణామవాదానుసరణముగ సర్వపశుపక్షికీటకాదులతోడఁగూ
డ నీ వేకదేహుఁడవే కద!

గో—ఔను.

బుద్ధు—నాయనా! నీవు కుక్కను గొట్టితివి కదా! కుక్కదేహమే నీదే
హ మనుపరమార్థజ్ఞానము నీకున్న యెడల నీవు దానిని గొట్టి
యుందువా?

గో—ఊహు.

బుద్ధు—నాయనా! అన్నము లేనివానికి నీ వన్నము పెట్టెదవా?

గో—ఆ.

బుద్ధు—ఏల.

గో—ఆతనిదేహమే నాదేహ మగుటచేత—ఆతనియాఁకలిబాధయే నా
బాధయగుటచేత—

(నేపథ్యమున) నేనొక్కఁడను దిని యందఱికడుపులుగూడ నింపి
న వని సంతోషింపఁ గూడదా?

బుద్ధు—నాయనా! యుక్తిమంతుడవు. గొంతుకలోఁ వ్రేలు పెట్టుకొన్న
యెడల మెతుకులు వ్రేలికిఁ దగులువఱకుఁ దినవలయు నని నీ

కేవలమైనఁ జెప్పఁగ కడుపునిండుటకు వేయునవూ మెతుకులు తగుట యే ప్రధానము కదా యని యెంచి క్రిందికి దిగనిముద్ద నంగిటి కడ్డముగఁ బెట్టికొని యీసారి కడుపు నిండినది కదా యనువాఁడు నీవంటివాఁడే కదా! ఏమాట కామాటయేనా? ఏయుక్తి కాయుక్తియేనా? పూర్వాపరసందర్భములఁ గనిపెట్టవక్కఱ లేదా? ప్రపంచము దుఃఖమయ మనియు, తృష్ణాచ్ఛేదనమున దుఃఖనివృత్తి యగు ననియు, అహంభావనాశనమునఁ గాని చిత్తశాంతి కలుగ దనియు బుద్ధమతమున సామాన్యపద్ధతులై యుండ నవి యన్నియు గుంటఁబెట్టి గంటవాయించి వాని యన్నిఁటికి విరోధముగ నిప్పుడు చెప్పినయుక్తి కుయుక్తి యనిపించుకొనును గాని మంచి దనిపించుకొనునా? నాయనా! అయిన నిట్టియుక్తికిఁ బ్రత్యుత్తరమ్ము నీతితత్త్వమున స్పష్టముగఁ జెప్పియే యున్నాను. అది మఱచిపోవుటచేఁ గదా నాయనా! యిటు లంటివి? అది గాక సర్వజీవైక్యతత్త్వము గూడ నష్టాంగశీలములో నుపదేశించి యుంటిని. అది మీరు విన లేదు కాఁబోలు!

(నేపథ్యమున) మహాత్మా! అజ్ఞానమును క్షమింపవలయును.

బుద్ధు—నాయనా! అంతమాట యెందులకు? నీ కిప్పుడు తెలిసినదికదా!

(నేపథ్యమున) మహాత్మా! తెలిసినది. పరునిబాధ నాకు బాధ. పరునిసుఖము నాకు సుఖము.

బుద్ధు—సోదరులారా!

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా,

బుద్ధు—పరోపకారప్రేరకమైనదియు నీతిప్రోత్సాహకమైనదియునామతమున నేమి యున్నదని మీరిప్పుడే యధిక్షేపించితిరి. జ్ఞప్తి యున్నదా?

(నేపథ్యమున)ఇప్పుడు తెలిసినది.

బుద్ధ — ఆత్మ లేదనియే మతసిద్ధాంతము కాదా?

గో — ఔను.

బుద్ధ — తలకొకయాత్మ యున్న దనుకొందము. దేహము లన్నియాత్మల కిప్పుడు చెప్పినట్లొకటియే యైననునాసుఖము నాది; నీసుఖము నీది. నాబాధతో నీకుసంబంధము లేదు; నీబాధతో నాకుసంబంధము లేదు. అని యొకయాత్మ రెండవయాత్మతో ననవచ్చును గద! అందువలన నహంభావము వృద్ధిపొందదా? రాగద్వేషము లమితముగఁ బెఱిగిపోవా? ఏది? ఇక్కడ నీతికిఁ బరోపకృతికిఁ బ్రవేశపక మేది? ఈయాత్మలన్నియును వానికంటెఁ బై యాత్మలోనివిభాగము లనియును, అందువలన నన్నిశరీరము లేకాత్మకము లనియుఁ దత్కారణమున నొకయాత్మ సుఖము మఱియొకయాత్మదని చెప్పవలయును గదా! ఈద్రావిడప్రాణాయామ మెందులకు? అదిగాక, అప్రత్యక్షము లహేతుకము లగు నిన్నియాత్మ లేల కల్పించుకొనవలయును? అంతటితో నూరకుండక వానికన్నిటికి మూలాధారతత్త్వమును గల్పించుకొన నేల? అంతటితోడను సంతుష్టి నందక యాపెద్దమంటలోని స్ఫులింగములే యివి యన్నియు నని మఱియొకకల్పన మేల చేయవలయును? ఇవి యెన్నియుఁ బ్రత్యక్షానుభవములా? నీవు నీతల్లిదండ్రులకుఁ బుట్టితి వనుట ప్రత్యక్షము కాదా? కావున నాత్మ నొప్పుకొనినమతమునకంటె నీతిపరోపకారప్రేరక మైనది, నిరాత్మక మగుమనమతములోనే కొంచెము హేతుబలవత్తరముగను, సమీపతరముగ నున్నట్లు కానఁబడుట లేదా?

గో — చిత్తము. ఆలాగే కనఁబడుచున్నది.

బుద్ధ — కావునఁ బరు లెవ్వరు లేరుగద?

గో—లేరు.

బుద్ధ—లేరుకదా?

(నేపథ్యమున) లేరు. లేరు. లేరు. లేరు.

బుద్ధ—కావున సోదరులారా! కుక్కనుగొట్టి తత్తాడనఫలము కుక్కలో ననుభవించినవా రెవరు?

(నేపథ్యమున) మేము.

బుద్ధ—అహంభావమును వదలి పరోపకారమునే చేయవలయును. బ్రదుకు తనకొఱకని యెంచక సర్వప్రాణిలాభమునకే జనుఁడు బ్రదుకవలయును. ఈయంశమును దెలిసినంతమాత్రముననే విని యోగము లేదు. అనుభవమునకుఁ దెచ్చుకొనవలయును. ఆచరింపవలయును. ఆచరింపవలయును. అట్టివాఁడే మనుజుఁడు. అట్టివాఁడే జ్ఞాని. గోపాలదాసా! ఇఁక నీవు పోవచ్చును.

గో—(పోవును.)

బుద్ధ—నాయనలారా! మనుజుఁడు చనిపోయినతరువాతఁగూడఁ బైని చెప్పినట్లే పునర్జన్మసిద్ధిని గ్రహింపవలయును. పంచస్కంధములు మాఱుచున్నను, దేహములు మాఱుచున్నను, బాల్యయౌవన కౌమారవార్ధకములు క్రమముగ ననుభవించువాఁడు తానే యని జ్ఞానసంతానవిచ్ఛిత్తిశూన్యతచే నెట్లనుకొనుచున్నాఁడో మరణించి పునర్జనన మొందినవాఁడు తానే యని యట్టి విచ్ఛిత్తిశూన్యతచేతనే యెఱుఁగవలయును. పరున కెవ్వనికో పునర్జన్మమని యనుకొనవలనుపడదు. అట్టిపరత్వమెప్పు డుండనేయున్నది. నిన్నటిమీరు కడ తేరిరి. ఈదినము మీరు పరులు ఇట్టిపరత్వము మాత్రమే పునర్జన్మమునందుఁ గూడ నున్నది. కావునఁ బునర్జన్మమునఁ బూర్వజన్మస్మృతియుండును. ఎందువలన ననఁగ స్మార

ధములు పునర్జన్మమున విడి మఱియొకక్రమమునఁ గలియును.
ఇది దురవగాహమైనయంశము. క్రమముగ నాలోచించుకొనిన
కొలఁది బాగుగ బోధపడును. సత్కర్మములకు సజ్జన్మమున్నది.
దుష్కర్మములకు దుర్జన్మమున్నది.

(నేపథ్యమున) చిత్తము.

బుద్ధు—జన్మములు దుఃఖాక్రాంతము లని యెఱుఁగుదురు కదా?

(నేపథ్యమున) చిత్తము. చిత్తము.

బుద్ధు—కావున దుఃఖనివారణమునకు బాహాటమార్గ మేది?

(నేపథ్యమున) జన్మపరంపరలు లేకుండఁ జేసికొనుట.

బుద్ధు—జన్మపరంపరలు దేనివలనఁ గలుగుచున్నవి?

(నేపథ్యమున) మనకర్మమువలన—

బుద్ధు—కావున జన్మపరంపరలోపసంహారణముకొఱ కేమి సేయవలయు
ను?

(నేపథ్యమున) మనకర్మమును నశింపఁజేయవలయును.

బుద్ధు—సోదరులారా! ఇక్కడ నాక్షేపింపఁదగినది యీ క్షేమైనఁగావఁ
బడుచున్నదా?

(నేపథ్యమున) ఆ. ఆ. కర్మమును నశింపఁజేసినంగాని జన్మనివృ
త్తిరాహిత్యము గలుగదు. కర్మమును నశింపఁజేయుట బ్రదికి
యుండునంతకాలము సంభవింపదు. కాఁబట్టి పునర్జన్మసంతానము
తప్పదు. అందువలన నిరంతరదుఃఖము తప్పదు. తప్పని దేదో
నోరు మూసికొని యనుభవింపవలసినదే కాని. మతము వలన ని
ర్ముక్తి లేదు.

బుద్ధు—గట్టియవబీజమును భూమిలో నాటినయెడల మొలకెత్తునా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—ఆయవబీజమును నీళ్ళలో నుడకబెట్టినపిమ్మట నది నాటినచో?

(నేపథ్యమున) మొలువదు.

బుద్ధు—ఏల?

(నేపథ్యమున) లోనిపలుకు నిస్సార మగును.

బుద్ధు—జనునిజీవనమే కర్మసంతాన మని మీ రొప్పుకొంటిరి కాదా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—కర్మమే యవబీజము. అహంతత్త్వమే యందలి లోనిపలుకు.

(నేపథ్యమున) ఏలాగండి?

(మఱియొకధ్వనితో) కర్మమే యవబీజమా? అహంతత్త్వమే యందులోనిపలుకా?

బుద్ధు—నాయనలారా! స్థూలదృష్టిచేఁ జూడఁగ మీరు చేయుకర్మములు స్వలాభప్రధానము లనియుఁ బరలాభప్రధానము లనియు లేవా?

(నేపథ్యమున) ఆ. ఆ.

బుద్ధు—మొదటితరగతికర్మములలో నహంతత్త్వమే ప్రధానము. రెండవజాతి కర్మములలో నహంతత్త్వము ప్రధానమే కాదు.

(నేపథ్యమున) చిత్తము. తెలిసినది.

బుద్ధు—అందుచేతనే కర్మను యవబీజ మనియు నహంతత్త్వమే యందులోనిపలు కనియుఁ జెప్పితిని.

(నేపథ్యమున) చిత్తము.

బుద్ధు—అహంతత్త్వముతోఁ గూడిన కర్మబీజము పరజన్మక్షేత్రమునఁ బడినప్పుడు అక్కడ నహంతత్త్వమునుండి పునర్జన్మ మను మొలక బయలుదేరవలసినదే కద!

(నేపథ్యమున) ఆ.

బుద్ధు—అహంతత్త్వ మనునిస్సారమైనకర్మబీజ మట్లు పడునప్పుడు?

(నేపథ్యమున) మొలకెత్త లేదు.

బుద్ధు—మొలకెత్తని దేది?

(నేపథ్యమున) అహంతత్త్వము.

బుద్ధు—కావున నహంతత్త్వమునకుఁ బునర్జన్మము లేదుకద!

(నేపథ్యమున) లేదు.

బుద్ధు—ఎట్టి కార్యములలో లేదు?

(నేపథ్యమున) పరోపకారకర్మములలో లేదు.

బుద్ధు—ఎట్టికర్మములకుఁ బునర్జన్మ మున్నది?

(నేపథ్యమున) స్వోపకారకృత్యములకు.

బుద్ధు—కావున జన్మపరంపరను బాపుకొనఁదలఁచినవాఁ డెట్టికృత్యము లాచరింపఁగూడదు?

(నేపథ్యమున) స్వలాభప్రదకార్యములను.

బుద్ధు—బ్రదికియుండునంతకాలమును గర్మములు చేయక తప్పనప్పుడును స్వోపకారకృత్యములు పునర్జన్మహేతువు లగుటచేఁ జేయఁ గూడనప్పుడును జేయఁదగిన కర్మము లింక నేవి?

(నేపథ్యమున) పరోపకారకకర్మములు.

బుద్ధు—ఇక్కడ నేమైన యాక్షేపణము లున్నవా?

(నేపథ్యమున) ఊహూఁ. ఊహూఁ. ఏమియు లేనట్లే.

అజా—పరోపకారకకర్మములనే చేయవలయు నని చెప్పితిరి కాదా?

బుద్ధు—ఊఁ.

అజా—"పరులే నేను. నేనే పరులు. పరునకు బాధ నేల చేయకూడదు? అది నాకు బాధ నిచ్చును గావున—పరుని కేల యుపకృతిఁ జేయవలయును? అది నాకు సుఖ మిచ్చునుగావున—" అని వెనుక బోధించితిరి. ఇప్పుడు పరోపకారములు తప్పక చేయవలయు నని బోధించితిరి. పరోపకారము నేల చేయవలయును? స్వా

నందముకొఱ కేకద? అహంతత్త్వమే నశింపజేసికొనినవానికి స్వా లాభ మెట్లు? ఈయంశమును నాకు బోధింపఁ బ్రార్థించుచు న్నాను.

(నేపథ్యమున) సెబాస్! సెబాస్! ఇది మనకుఁ దోఁచినదే కాదు. ప్రభువువారు బాగుగ నడిగిరి.

బుద్ధు—సోదరుఁడా! "పరబాధ స్వబాధ, పరసుఖము స్వసుఖము" అను మాట లేసందర్భమునఁ జెప్పితినో నీకు జ్ఞప్తి యున్నదా?

అజా—(ఆలోచించును.)

బుద్ధు—నీవు శ్రమపడి యాలోచింప నక్కఱ లేదు. ఈమతములో నీతి వర్తనమునకుఁ బరోపకారాచరణమునకు నేమిప్రేరేపకే మున్న దని. నాసోదరు లధిక్షేపింపఁ బరమాత్మతత్త్వము నాలోచించి చూడఁగఁ బరునికి నీకు భేదమే లేదనియు, పరసుఖదుఃఖములు నీవే కావున నీవు నీతివర్తనుఁడవై పరోపకారపారీణుఁడవై యుం డవలయు ననియు నిట్టిసర్వజీవైక్యతత్త్వజ్ఞానమే యీమతమున నీతిపరోపకారక్రియాప్రేరకమనియు మాత్రమే చెప్పితినిగాదా?

అజా—మహాత్మా! చిత్తము. చిత్తము. ఇప్పుడు జ్ఞప్తికి వచ్చినది.

బుద్ధు—అట్టియసాధారణవిజ్ఞానమే సంపూర్ణానుభవాచరణములో నికి వచ్చినఁ బరిపూర్ణబోధావంతున కహంతత్త్వ మేమి? పరతత్త్వ మేమి? అంతయుఁ దానే. అంతయుఁ బరుఁడే. అంతయు స్వపర తత్త్వపమాపేశమే. అంతయు స్వపరతత్త్వశూన్యమే. అట్టియ నిర్వచనీయానుభవైకవేద్యమహావస్థనుగూర్చి నిర్వాణతత్త్వవ్యాఖ్యానమునఁ బలుకులచేఁ దెలుపఁజేయుటకు నాకెంతసామర్థ్యమో యంతవఱకుఁ జెప్పెదను. నీయిప్పటియాక్షేపణమునకుఁ బ్రస్తుతోచితరీతినిఁ జెప్పెదను. సోదరుఁడా! పరోపకారములు స్వ

లాభమునకే యగును. స్వయంతత్త్వము నిస్సార మగునప్పుడు స్వలాభము సిద్ధింపదు. ఇఁకఁ బరోపకారము లెందులకు? ఇది నీయాక్షేపణము.

అజా—చిత్తము.

బుద్ధ—బ్రదికియున్నంతకాలము జనుఁ డేదో యొకకర్మము జేయక తప్పదుగదా?

అజా—తప్పదు.

బుద్ధ—జన్మాంతరకారకము లగుటచే స్వోపకారకకృత్యములు నిరాకరణీయములు గదా!

అజా—అగును.

బుద్ధ—స్వోపకారకకృత్యములు మానివేసినంతమాత్రమున జనుఁడు చావఁడుగదా!

అజా—చావఁడు.

బుద్ధ—బ్రదికియుండినజనుఁ డింక నెట్టికర్మములు చేయవలసి యున్నది?

అజా—పరోపకారకకర్మములు.

(నేపథ్యమున) పరోకకారక్రియలు నిరుపయోగము లనియు, మఱియొకపని లేకపోవుటచేత నే యీపనులు చేయవలసినట్లును దేలుచున్నది; కానియివియే ముఖ్యముగఁ జేయవలయు నని విధి యున్నట్లు కానఁబడుట లేదు.

బుద్ధ—(మందహాసముచేయును) నాయనలారా! చెప్పెదను వినుఁడు. అష్టాంగశీలోపదేశమున నిందునుగూర్చి కొంత ముచ్చటించి యుంటిని. అది మీరు వినియుండకపోవుటచే నిట్టిప్రశ్నము సిద్ధించినది.

అజా—మహాత్మా! మీరు ప్రయాణములలో నక్కడక్కడఁ గొందఱు కొందఱకుఁ గొన్నియంశములు బోధించుచు వచ్చినారు. కొం

డఱకుఁ దెలిసినయంశములు గొందఱకుఁ దెలియవు, కావునఁ దమబోధనము లన్నియు వ్రాసి యుంచినయెడల మంచిదేమో యని మనవిచేసికొనుచున్నాను.

బుద్ధ—నావలన నన్నియంశములు గ్రహించిననాముఖ్యశిష్యు లగుకొండిన్యాశ్వజిన్మొద్గలాయనమహాకశ్యపమహాకాత్యాయనానురుద్ధోపవిరాహులాదు లగుపండ్రెండుగురు మతబోధకులై దేశదేశములఁ దిరుగుచునే యున్నారు. నాయనా! ఇప్పు డింక వ్రాఁత యెందులకు? నాకిప్పుడు డెబ్బదియాఱవసంవత్సరము జరుగుచున్నది. స్వల్పమగుశేషకాలము నాసోదరులకుఁ జేతనైనంతమట్టుకీమత మెట్టిదో స్వయముగనే బోధించుకొందును. అటుతరువాత నీవో మఱియొకఁడో యందఱను గూడఁగట్టుకొని యెవరెవరి కేయేయంశములు తెలిసినో యవి యన్నియు నిష్టానుసారముగ వ్రాఁతలు జరిగించుకొనవచ్చును. నాయనలారా! అనవసర ప్రసంగమునకు క్షమించుఁడు. అహంప్రణాశనమునకు ముఖ్యసాధన మగునదియష్టాంగశీలము. సమ్యగ్దృష్టిసంకల్పవాక్కర్మజీవనవ్యాయామస్మృతిసమాధు లని యెనిమిది. వీనినన్నిఁటిని మీ కవకాశము ననుసరించి తరువాత బోధింతును గాని యిప్పటిసందర్భమునఁ జతుర్థశీల మగుకర్మమునుగూర్చి సంక్షేపముగఁ జెప్పెదను.

(నేపథ్యమున) మహాత్మా! అనుగ్రహించి బోధింతురు గాక!

బుద్ధ—కర్మము పరోపకారక మని పరాపకారవిరోధ మని రెండువిధములు. మొదటిదానిని ద్యాగ మని దాన మని యందురు. రెండవదానిని నీతి యందురు. నీతియుక్తకార్యముల నాచరించుటచే మనస్సునందలిదుష్టవ్యాపారములు వదలి మనసు లొంగు

శాంబునకు వచ్చును. పరోపకారములు చేయుటచే మనస్సు స్వసుఖలాభాదులను వదలి యహంభావమును నశింపఁజేసికొనును. ఈయహంభావము శీఘ్రముగ నశించునది కాదు. క్రమక్రమముగఁ జిరకాలము స్వలాభకకర్మములు మానివేయఁగ వేయఁగఁ జిరకాలము నిరంతరదీక్షతోఁ బరోపకారకకర్మములు సేయఁగఁజేయఁగ నహంతత్త్వము క్రమక్రమముగ క్షయించును. అది పూర్ణముగ క్షయించినప్పుడే జన్మాంతరరాహిత్యము సంభవించును. కావున జన్మాంతరసంహారము కోరిన ప్రతినరుఁడును బరోపకారకకృత్యములు సేయక తప్పదు. నాయనలారా! మనకేయొకపని లేక పరోపకారమును జేయ నక్కఱ లేదు. ఉన్నయొక్కపనికొఱకే పరోపకారము సేయవలయును. తెలిసినదా?

(నేపథ్యమున) తెలిసినది.

బుద్ధ—ఇంక నేమైన యాక్షేపణము లున్నవా?

అనా—పరోపకారము సేయవలయును; పరు లెక్కడెక్కడ బాధలలో నున్నారో తెలిసికొనవలయును. అవి చూచి వానికారణములు కనిపెట్టవలయును. అవి తనవిగ నెంచుకొనవలయును. పరులతోపాటు తానుఁగూడ బాధపడవలయును. వానిని నివారణచేయుటకు సకలశ్రమములు పడవలయును. అప్పటికి నివారణకాకపోయినయెడల మఱింతబాధ పడవలయును. మహాత్మా! ఇవి యన్నియు దుఃఖములు గావా? ఇవి యన్నియుఁ బ్రవృత్తివర్ధకములు గావా? ఒక్క యాత్మదుఃఖము నశించుకొనఁగోరి యిన్ని పరదుఃఖములు నెత్తిని వైచికొన నేల?

బుద్ధ—నాయనా! ఇవి యన్నియు సుఖములే. ఎవరికిఁ "ఇది నాదుఃఖము, అది నీసుఖము" అని వేఱు చేయఁగలయహంపర తారతమ్య

జ్ఞానము గలవానికి. ఇది నాదుఃఖ మని స్వార్పణము చేసికొను తత్త్వమే నశించినపరిశుద్ధానహంభావునకు నిఁక దుఃఖ మెట్లు?

అజా—అట్టివానికి సుఖముగూడ లేదు.

బుద్ధు—నాయనా! సుఖమున్న దని నేనుమాత్రము చెప్పితినా? ఉన్నదేదో దుఃఖరాహిత్యము. అది జన్మపరంపర నశించినమీఁదఁ గలుగఁదగినది. ప్రత్యేకసుఖతత్త్వమును నేను బోధించినట్లునాకు జ్ఞప్తి లేదు. నాయనలారా! అట్టిస్థితికి వచ్చి దుఃఖరాహిత్యరూపక మగుశాంతి ననుభవింపవలసినదే కాని బోధింపఁదగినది కాదు. అట్టిస్థితిలో సుఖము లేదు; దుఃఖము లేదు. మెప్పు లేదు; నింద లేదు. సంతుష్టి లేదు. అసంతుష్టి లేదు. ఉన్నదని లేదు; లేదని లేదు. దీనినిగూర్చియే నిర్వాణమును గూర్చినయుపన్యాసమున బోధింతు నని చెప్పితిని.

అజా—చిత్తము. చిత్తము. అది రేపు బోధింపఁ బ్రార్థింతును.

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా! మాప్రార్థన మొకటి యున్నది.

బుద్ధు—నే నేమి చేయఁదగినదో చెప్పవచ్చును.

(నేపథ్యమున) మాకు దైవతత్త్వమును బోధించినపిమ్మట నిర్వాణతత్త్వమును బోధింపవలయును.

బుద్ధు—నాయనలారా! అది యెందులకు? అది తెలిసిన నధికలాభ మేమియు లేదు. అష్టాంగశీలాచరణమునకు నహంభావఖండనమునకు జన్మాంతరశృంఖలావిమోచనమునకుఁ జిత్తశాంతిసంపాదనమునకు నది సాహాయ్యము చేయదు. అక్కర రాదు. మీయనుష్ఠానాచరణీయములు మీరు చూచుకొనఁదగినదే కాని—

(నేపథ్యమున) క్షమింపవలయును. క్షమింపవలయును మాకాత్మతత్త్వము బోధింపవలయును.

అజా—సోదరులారా ! ఊరకుండుడు. రేపుదయమున దిరిగి శ్రమ తీసి కొందురా?

బుద్ధ—సోదరుడా ! సాయంస్నానసమయ మైనది. కావున నిప్పటికీ జాలించినమంచిది కాదా ;

(నేపథ్యమున)మహాత్మా !మాకుం దా మెప్పుడు బోధించిన సరి యే కాని సన్యాసవిధులుకూడ బోధింపవలయును.

అజా—మహాత్మా !విహారమునకు దయ సేయుదురు గాక !

(నేపథ్యమున జప్పటలు)జయాబుద్ధాచార్యా !జయాబుద్ధాచార్యా!

(అందఱునిష్క్రమింతురు.)

ఇది యష్టమాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ

## నవమాంకము.

ప్రదేశము—మగధ.—బుద్ధాశ్రమము నెదుటబయలు.

ప్రవేశము—బుద్ధుఁడు. అజాతశత్రుఁడు. దేవదత్తుఁడు.

దేవ—(తనలో) చచ్చికాదు—చంపఁబడి—అదియుఁ—గాదు—చంపుటకు నాకే స్వాతంత్ర్య మున్నయెడల నీబుద్ధునిమాత్ర మేల చంపలేకుందును?—కావునఁ జచ్చియో—చంపఁబడియో—మఱియెటులో కడతేఱిపోయినమక్కలిగోసాలుఁడు చెప్పినపారిబ్ధమే నిజ మని తోఁచుచున్నది. చంపుటకు వెడలిన దొంగలు చంపలేకపోయిరి సరికదా మీఁదుమిక్కిలి సన్యాసులైరి. బుద్ధుని బూడిదఁజేసి కాలిక్రింద ద్రాయఁదలఁచిననేను బుద్ధునిపాదధూళి నెత్తికిఁ బూసికొనుచున్నాను. ప్రపంచ మంతయు వ్యాపింపఁజేయఁ దలఁచిననామతము మొలకవేసినస్థలమునసే పిట్టతలలు వైచి మెలికలుబడి మాడి చచ్చినది. దిక్కుమాలినబుద్ధమతము బొమ్మజెముడువలె నంతట వ్యాపించుచున్నది. శ్రమపడి యాచరించినప్రయత్నము లన్నియుఁ జట్టుబండలగుటయేకాక యొకనిని గొట్టఁదలఁచి విసరినఱాయి యెదుటిని రోషముచేతఁ దిరుగఁబడి మొగమ్ముపైఁ బడినట్లు, ఎదురుగాలిని

వైచునిష్ఠీవనము యుమియువాని మొగముపైఁ దిరిగి పడినట్లు నా ప్రయత్నములే నన్ను గోతిలో దింపినవి. ఇది యెందుచేఁ గలిగిన దనుకొనను? ప్రయత్నలోపమునఁ గాదు. బుద్ధిలోపమునఁ గాదు. చాకచక్యలోపమునఁ గాదు. అదృష్టలోపమున—అనఁగ—నాదిక్కుమాలిన ప్రారబ్ధకర్మమువలనఁ గలిగినది. నా ప్రయత్నములు రెండుమాత్రము సాగినవి. అజాతశత్రునిచే బింబిసారుని జంపించుట—మక్కలాచార్యాదిమతగురువుల మాన్పుట—తండ్రి బౌద్ధుఁడగుటచే యాతనిని జంపినయీయజాతశత్రుఁడుగాఁడు తా నేల బౌద్ధుఁడు కావలయును? ఈతని నెవనిచేఁ జంపింపను? వీఁడు చచ్చిన నింక నాకీమాత్రమైన దిక్కెవ్వరు? ఈముండకొడుకు మూలమున నేనుఁగూడ నీపాడుబుద్ధమతమునఁ జేరవలసివచ్చెను. నాకర్మము! నాకర్మము! పోనీ! అలాగైన నేమూలనో పడియుండక యీదినమున బుద్ధునితో నేదో వాదింపవలయు నని యీ తెలివిమాలినరాజు నన్నుఁ బ్రోత్సాహపఱుప నే నిక్కడ కేల రావలయును? నాకర్మమే నన్నిట్లు లీడ్చుచున్న ట్లున్నది. స్వతంత్రశక్తి సున్న. ప్రయత్నములు విఫలములు. అదిగాక యిప్పు డజాతశత్రునిఁ జంపిన లాభము లేదు. బుద్ధుని జంపిన లాభము లేదు. బౌద్ధమతావలంబకులగురాజుల నందఱఁ గడతేర్చిన లాభము లేదు. ఓహో! దేశదేశముల బుద్ధమతము గాలివలె వ్యాపించినది. ఈమహాప్రవాహమున నందఱుఁ గొట్టుకొని పోవలసినదే కాని యెదురాడ సాధ్యము గాదు. ఎన్నఁటికైన సరే!—ఈయార్యావర్తదేశమున—నెవఁడైన నొక్కగండ్రముండకొడుకు బయలుదేరి—యీబుద్ధమతమును—నీబౌద్ధకంఠములను ఖండఖండములుగఁ జేసి—

ఆ—చేసి—యీమతమును నీవైపున హిమాలయము దాటు నట్లును—నీవైపున సేతువు దాటునట్లును—నూఁడ్చి పెట్టిన యె డల—నాహా! ఆహా! ఆహా! నాయాత్మ ఓహెూ! బుద్ధమతము ననాత్మ లేదు కాఁబోలు!—వహావ్వా! వహావ్వా! ఓహెూ! నాయనా! భగవంతుఁడా! ఓహెూ! ఇప్పుడు భగవంతుఁడుకూ డ లేఁడని చెప్పును గాఁబోలు!

అజా—దేవదత్తాచార్యా! మహాత్ముల నుపక్రమింపు మని ప్రార్థింపక యేల యూహించెదవు?

దేవ—జను లెవ రెవరు వచ్చిరో పరీక్షించుచుంటిని.

(తనలో) గీ. నునుపు తలపైన; లోన వెం ♦ డ్రుకలచిక్కు
దేహమున శాటి; లోపలఁ ♦ దృష్ణ థాటి;
జిహ్వపై భూతదయ; లోనఁ ♦ జికిలికత్తి;
పైకి దేవదత్తుఁడు; లోనఁ ♦ బలలభోజి.

వెనుకటి దేవదత్తుఁడు గతించినాఁడు. ఇప్పు డిది యొకదిక్కు మాలిన యర్ధనారీశ్వర వేషము. సంకరతత్త్వము. (ప్రకాశము గా) మహాత్మా! బుద్ధాచార్యవర్యా! బుద్ధబోధామృతమును వర్షింపుఁడు.

బుద్ధ—సోదరులారా!

(నేపథ్యమున) మహాత్మా! సిద్ధముగ నున్నాము.

బుద్ధ—ఈతత్త్వముమీకుఁ గేవలము నిరుపయోగమని చెప్పితినిగాదా?

(నేపథ్యమున) మహాత్మా! ఏమైనసరే చెప్పఁ బ్రార్థించుచు న్నాము.

దేవ—సోదరులారా! మీరందఱు తలకొకమాట మాటలాడినయెడల సందడి హెచ్చుగా నుండును. మీయందఱిపక్షమును నేను

వహించి యీమహాత్ముని కాళ్ళపైఁ బడెదను. మహామతగురూ
త్తమా! ఈతత్త్వ మంత నిరుపయోగమా?

బుద్ధ—నిరుపయోగమే కాక యది తప్పుగాఁ దెలిసికొనినయెడల నష్ట
ప్రదముకూడను.
(నేపథ్యమున) అదెట్లు? అదెట్లు? దైవతత్త్వజ్ఞానము నష్టప్రద
మా? ఆ! వింత!

అజా:—సోదరులారా! మీరూరుండుఁడు.

దేవ—మహాత్మా! బుద్ధిహీనుఁడనగు నాకు బోధాచార్యావతారు లగు
మీరుపదేశించినయంశము బోధమ్ము కాలేదు.

బుద్ధ—నాయనా! నీవు నేనని పలికినరాజాలు. విశేషము లనావశ్యక
ములు. నాయభిప్రాయ మేమో చెప్పెదను. సృష్టిస్థితిలయ
కారణుఁడును, సర్వజగన్నియామకుఁడును, సాధురక్షకుఁడును,
క్రూరశిక్షకుఁడును, సర్వస్వతంత్రశక్తిసంపన్నుఁడును, సచ్చిదా
నందమయస్వరూపుఁడును, స్వేచ్ఛానుసారవర్తనుఁడును, కార
ణబంధశూన్యుఁడును, సర్వవ్యాప్తుఁడును, సర్వప్రాణ్యంతరసాక్షి
భూతుఁడును, పాపనాశనావసరానుసారవిరచితభూలోకావతా
రుఁడును, స్తోత్రప్రియుఁడును, బ్రాహ్మణప్రియుఁడును, వైదిక
కర్మప్రియుఁడును, సర్వమంగళగుణసమంజసుఁడు, నగుభగవం
తుఁ డెక్కడనో యున్నాఁ డనుసరికి నతనికి నాపై నిష్టమే
యని యొకఁడు, నాపైఁ గోప మని మఱియొకఁడు, నాపైఁ ద
ట్టుఁ డని మఱియొకఁడు, నావైదికకర్మములచేతఁ జెవులు
నులిపి యాతనిని స్వాధీనపఱుతు నని మఱియొకఁడు, నూరెగిరి
పోవునట్లు ప్రార్థించి వరము లిచ్చువఱకు దొరకబుచ్చుకొనిన
కాళులు విడువ నని మఱియొకఁడు, ప్రార్థనములకు లొంగక
పోయినయెడల ధనమునకు గిరగిరఁదిరిగి లొంగు నని మఱియొ

కండు, నేను బ్రాహ్మణుండను దైవమునకుఁ గోపము వచ్చిన
నైన నాపిక్క విూఁదిరోమ మూడ దని మఱియొకండు, దైవ
మునకుఁ గడుపునిండఁ గల్లుపోసినయెడలఁ దెలకపిండివైచినకుం
క్కవలె నాగుమ్మములోఁ గాపుపడి యుండు నని మఱియొకండు
స్వప్నమున మాపంచపాళిలోనికి వచ్చినానులకమంచముపైఁ
దాళ్లవైపునఁ గూర్చుండి నాతో మాటలాడి, నవ్వి, పాడి, పరి
హాసములు సేసి, సిడకనిప్పున నాతోఁగూడ స్వర్గంగాలంకలలోఁ
బుట్టినపొగాకుచుట్టఁ గాల్చియున్నది మాముసలి మేనయత్త
నెత్తిపైఁ బడ నామె కఱ్ఱఁదీసికొని యొకటి వడ్డించుటతోడనే
కాలుచున్న చుట్టచూరులోఁ బెట్టి కాలుకొలఁదిదూఁకినాఁ డని
మఱియొకఁడు, తనమెడలోనిమాలఁ జెఱిపించి నాముండనెత్తి
పై నాగిడఁ జేయించినాఁడని—

(నేపథ్యమున) హేం హే హే! హే హే హే!

బుద్ధు:—నాయనలారా! నవ్వఁదగినగి కాదు. గొంతుకనరములు తెగి
పోవున ట్లేడ్వఁ దగినది. కన్నులు కరఁగిపోవున ట్లేడ్వఁ దగినది.
ఇట్లెన్నియని చెప్పఁగలను! నాకిది చేసినాఁడు మంచివాఁడో
యని యొకండు, నాకది చేయలేదు కావునఁ గనఁబడినయెడల,
మూఁడుమ్రుక్కలక్రింద నఱుకుదు నని మఱియొకండునైన, జ
ను లందఱు కొనవెఱ్ఱు లెత్తి చాందసులై మతులు పోయి వీ
రావేశము లెత్తి బూజిదబుస్సనలై త్రాగుబోతులై మాంస
భక్షకులై భ్రష్టులై పాపులై భగవంతునకుఁ దూర్పుడుకాం
క్షైకవులై కాకులై గాడిదలై సర్వవిధముల పాడై దేశమం
తయును దేవునిపేరున సర్వవిధముల ధ్వంసముసేసిరి కాదా?
(నేపథ్యమున) మహాత్మా! నిశ్చయమే. నిశ్చయమే.

బుద్ధు — దేవుఁ డెక్కడనో యున్నాఁ డనఁగ — నెక్కడ నున్నాఁడు?
అక్కడ నాతఁడు గూరుచుండునా? నిలువఁబడి యుండునా?
కూర్చుండిన నడు మిాఁప్చుకొనిపోదా? నిలువఁబడినఁ గాళులుపీ
కుకొని పోవా? కావునఁ బండుకొని యుండవలసినదే. ఈపండు
కొనుట యెక్కడ? భూమిమిాఁదఁ బండుకొనునెడల నొడలొత్తు
కొని పోవును గావున సముద్రములోఁ బండుకొనిన మంచిది.
ఉప్పుసముద్రమునఁ బండుకొన్నయెడల నొడలు మండునుగావునఁ
బాలసముద్రము మంచిది. అందులోఁ బండుకొనినయెడల నొడ
లికి జిడ్డగును గావునఁ బైన నేదైన నుండవలయును. మడతమం
చము వేసినయెడల దించుకొనిపోవును గావునఁ బత్రమో
పాఁమో యేదో యొకటి యుండవలయును. సరే భగవంతుఁ
డిక్కడకుఁ బండుకొన్నాఁడు. పాపము! దిక్కుమాలినవాఁడొక్కఁ
డు పుట్టించు! కొడుకులను బుట్టించు. ఎక్కడనుండి? — బొడ్డు
లోనుండి — కానీ! ఎందఱుమిాసాలరాయు లున్న నెక్కగాజుల
చేయి సుఖ మిచ్చునా? లక్ష్మీదేవియిక్కడకుఁ బ్రక్కలోనికి
దొరికినది. అంతటితో సరిపోయెనా? ఈమెకుఁ జెలికత్తెలు
ఆయనకు వేడుక చెలికాండ్రు — ఆయనకు నీమెకు నడుమసంధా
నకర్తలు — ఆమెకుఁ గోపములు ఈయన ప్రతిమాలుటలు పై
వారి మాధ్యస్థ్యములు — వచ్చువారు, బోవువారు భూలోకవా
ర్తలు నివేదించువారు — చారులు — సేనాధిపతులు — పాడికిఁ గా
మధేనువులు — మీాద నెక్కుటకు గుఱ్ఱములు — వేదండములు —
రథములు — పక్షులు — ఇదిగాక — కట్టుకొనుటకుఁ బచ్చపట్టుబ
ట్టలు ఈయనకు బిళ్లగోచులు — ఆమెకుఁ బైఁటలు, తలలోఁ బు
వ్వులు — కాలికిఁ బాదుకలు — చెవులకుఁ గుండలాలు — నడు
ములకు బంధములు — నాయనలారా! చెప్పుట కసహ్యముగ నా

న్నది. దేవుఁడెక్కడనో యున్నాఁ డనుసరికి—అతని కిన్నివిధ
ముల నింతసంసారవృద్ధి యైనది కాదా?

దేవ—మహాత్మా! కరుణాస్వరూపు లగుమీరు జనులయజ్ఞానమునుగూ
ర్చి యెంతగాఁ బరితపించుచున్నారు.

బుద్ధ—సోదరులార! నేనెక్కఁడను బరితపించిన వినియోగ మేమున్న
ది? జనులంతటితో నూరకుండక—యొక్క దేవుఁడు బాగుగ
నున్నదికాదు. ముప్పదికోట్లు—చాలవు—పైన మూఁడు—
సరి! ఈసారి మంచిది. వీరంద ఱెక్కడనో యుండ నేల? భూ
లోకమునకు దింపిన మంచిదికాదా? ఇందఱు జనులు బలవంత
పెట్టి రమ్మనగ వారేమి సేయుదురు? పాపము! వచ్చినారు.
గర్భాలయములలో వేదఘోషములతోఁ బూజలు మండపము
లం మంత్రయుక్తముగ వివాహములు. పల్యంకికలపై నూరే
గింపులు. పగలు పదేపదే పరమాన్నములు—చిత్రాన్నములు
భక్ష్యములు—సాయంకాలమున ఫలహారములు—క్షీరపాన
ములు—తాంబూల చర్వణములు—తరువాత గర్భాధానము
లు చీ. చీ. చీ. నోట నుచ్చరింపఁదగినస్థితికాదు. మీబలా
త్కారముచేఁ జెప్పుచున్నాను.

(నేపథ్యమున) మహాత్మా! మాయందు దయయుంచి యుంక
సెలవిండు.

బుద్ధ—"ఎక్కడనో గుళ్లలోనే భగవంతుఁ డుండ నేల? మావంటయిం
టిలో నేల యుండఁగూడదు? ఈదేవునికొఱకుఁ బూజరికొఱకు
నిరీక్షించి యుందునా?" అని తలఁచునరికి నింటింట దేవతార్చ
న లే. నర్మదబాణములు—రామబాణములు—మదన గోపాల
మూర్తులు—హయగ్రీవమూర్తులు—ఉగ్రనరసింహమూర్తులు—
ఇంటింటి కొక్క దేవుఁడు. గృహాధిపతి కొకదేవుఁడు. అతనిభా

ర్యా కొక దేవుఁడు. ఆమెసవతియ త్త కొక దేవుఁడు. బంగారపు సంపుటములోఁ బదునార్గురుదేవులు. నాదేవుఁడుస్వయంభువు; నీదేవుఁడు చేతాళము. నాదేవుఁడు శాకాహారియుఁడు; నీదేవుఁడు మాంసభక్షకుఁడు. నాదేవుఁడు ఘనుఁడు; నీదేవుఁడు నీచుఁడు. నీదేవుఁడు నాదేవునికాళ్లు లొత్తుటకైనఁ బనికిరాఁడు. నాదేవుఁడు నీదేవుని జూచినతోడనే ప్రాయశ్చిత్తము చేయించుకొనవలయును. జను లీరీతిగా నసూయాపిశాచావిష్టులై యాగ్రహాతిరేకులై దైవముపేరు వెట్టికొని యెన్నెన్నివిధములఁ బాట్లఁబడిరో తలఁచుకొన గుండె గుభిల్లు మనుచున్నది. దేవునిపేరిట నెన్నిలక్షలమనుజులకుత్తుక లెగిరినవో, యెన్నికోట్లనోరులేని జంతువులు దేవునిభార్యలపేరిటఁ దెగనఱుకఁబడుచున్నవో యీదేశమున దినమున కెన్నికోట్లబానలకల్లు జనులు దైవప్రీతికొఱకుఁ ద్రాగుచున్నారో, యందువలన నెన్నిసంసారములు మాసిపోవుచున్నవో, యెన్నివ్యభిచారములు జరుగుచున్నవో తలఁచుకొన్నను వాఁడు గుండె పగిలి చచ్చిపోవలయును గాని యింక బ్రదుకఁ దరమా? ఆహా! దైవమూలకముగ నిట్లు పెఱిగినయజ్ఞానదురాచారదుష్కృతరాశిముందు హిమవత్పర్వత మెంత? జీవహింసవలనఁ దొరగినరక్తప్రవాహములకు గంగాబ్రహ్మపుత్రిలవఱదలెంత? నాయనలారా! దైవమును దలపెట్టవలదు. వలదు; వలదు. ఇదివఱకే జనులయవాచ్యస్థితినిగూర్చి విపులముగఁ జెప్పితి నని తోఁచుచున్నది. కావున నిఁకఁ జాలు!

దేవ—మహాత్మా! జనులయిట్టియజ్ఞానము మీబోధమువలన నివర్తింపవలసినదే కద!

బుద్ధ—అట్టియజ్ఞాన మింక వృద్ధియగు నని యోచియే యీతత్త్వోపదేశమునునిలుపు సేసితిని.

దేవ—మహాత్మా? నాయవిధేయతను మన్నింతురుగాక! నాప్రార్థన మంగీకరింతురుగాక!—

బుద్ధ—నీయభిప్రాయ మేమి?

దేవ—దైవతత్త్వమునుగూర్చి నేను మీతోఁ గొంత ముచ్చటింతును.

బుద్ధ—వాదమా నీయభిప్రాయము?

దేవ—వాదమునకు నే నెంతవాఁడను. దానినిగూర్చి నాయభిప్రాయమును మనవి చేసికొందును. దానిలోఁ దప్పులున్న—

బుద్ధ—(నవ్వుచు) నాయనా! నీవు దైవము నెన్నఁడైన జూచితివా?

దేవ—లేదు.

బుద్ధ—నీతండ్రియో?

దేవ—లేదు.

బుద్ధ—అతనితండ్రియో?

దేవ—లేదు.

బుద్ధ—అట్టిచో నందునుగూర్చి నీయభిప్రాయముమాత్ర మిప్పు డేమున్నది?

దేవ—చూచినవస్తు వగునెడలనిశ్చయముగ నున్న దనియే చెప్పుదును. చూడలేనిది కావున నే యభిప్రాయ మని—

బుద్ధ—నాయనా! చూచినవస్తు వున్న దని నిశ్చయముగఁ జెప్పఁగలవా?

దేవ—సందేహ మేమి?

బుద్ధ—సందేహ మేమి యనుచుంటివి కాన నదియు సందేహమే. కాని యాయుక్తి మిప్పు డెందులకు? అవసరమునుబట్టి తరువాత గ్రహింపవచ్చును. ఇప్పుడు నీ వీతత్త్వమును గూర్చి నీయభిప్రాయమ్మును వెల్లడింపఁ దలఁచినావు.

దేవ—మహాత్ముఁలు! నాసందేహములు నివారణ చేయుకటాక్షము మీకుఁ గలయెడల—

బుద్ధు—నాయనా! కానిమ్ము.

దేవ—ప్రపంచమున మన మెచ్చటఁ జూచినఁ గార్యకారణసంబంధ మగపడుచున్నదా?

బుద్ధు—నాయనా! నిజమే. ఒకదానికారణము మఱియొకదానికార్యము. ఒకదానికార్యము మఱియొకదానికారణము. దీనిపేరే హేతుప్రత్యయసముత్పదము.

దేవ—ఈకార్యకారణశ్రేణిక ననుసరించి పైకిఁ బోఁగఁ బోఁగ నాదికారణ మొకటి యుండఁదగునా?

బుద్ధు—ఉండఁ దగదు.

దేవ—ఏల?

బుద్ధు—కారణ మనునది మఱియొకదానికార్యమై యుండవలయును. అట్లే యాదికారణ మనునది గూడ మఱియొకదానికార్యమై యుండవలయును. అందుచే నాదిమత్వము కారణమున కెప్పటికిని సిద్ధింపదు. ప్రపంచమున నుండుగడ్డిపఱకలు చిన్నచిన్న మొక్కలన్నియుఁ దెచ్చి యిది నాతల్లి యని యొక గడ్డిపఱకను వేఱుగనుంచి యిది నాతల్లితల్లి యనిమఱియొకగడ్డిపరకనటనుంచి యిట్లుతల్లితల్లి వరుసను బైకిఁబైకిఁ బోఁగఁబోఁగ గడ్డిపఱక లన్నియుఁ గడతేరును, కాని తల్లితల్లివరుసను దరింప గలమా?

గీ. కార్యకారణశృంఖలా ♦ క్రాంతచిత్ర
సర్వజగదాళి తంత్రవి ♦ స్ఫారసరణి
కాదియును లేదు కొనయును ♦ లేదు సున్న
కెచట మొదలిట్టు తుద యని ♦ యెన్నఁ గలమొ?

దేవ—సున్న కాద్యంతములు మనము కనిపెట్టలేము కాని యెక్కడనో యొకచోట దానిని మొదలువెట్టి యెవఁడో యొకఁడు దానిని జుట్టలేదని మనము చెప్ప సాహసింపఁగలమా?

(నేపథ్యమున) సెబాస్! అదిమంచి యాక్షేపణము.

(మఱియొకధ్వనితో) దేవదత్తాచార్యులు సామాన్యుఁ డనుకొంటివా? అతఁడుకూడ మతకర్త కాఁడా?

(మఱియొకధ్వనితో) ఆ! మతకర్త! తేనెగవ్వ! పాలజాయి!

అజా—సోదరులార! అనవసర ప్రశంస యేల? మాటలాడక వినుఁడు.

బుద్ధ—నాయనా! కావున దైవ మీజగత్తును సృష్టించి యుండవలయునని నీయభిప్రాయమా?

దేవ—ఆ. ఆ!

బుద్ధ—సృష్టికర్తయగు దైవము నిర్వికారుఁడై యుండవలయునా? లేదా?

దేవ—ఉండవచ్చును.

బుద్ధ—ఉండవచ్చు నేమి? ఉండక తీఱదు. తాను సవికారుఁడై యుండు నెడలఁ దనవికారమునకుఁ దనకంటె భిన్నమైనకారణ ముండవలయును గాదా? అట్టిచోఁ దనయాదిమత్వమునకు భంగము కలుగును గాదా?

దేవ—దేవుఁడు కేవల నిర్వికారుఁడు.

బుద్ధ—ప్రపంచము సంతతవికారయుక్త మైనట్లు నీ వొప్పుకొందువా?

దేవ—ఆ.

బుద్ధ—అవికారతత్త్వమునుండి సవికారప్రపంచము పుట్టుట కవకాశము గలదా?

దేవ—లే కేమి?

బుద్ధు—కారణములో లేనిగుణము కార్యములో నెట్లు సిద్ధింపఁగలదు?

దేవ—ఎట్లు సిద్ధింపఁగల దనుప్రశ్న మేల? అట్టిదికూడ భగవంతుఁడే సృష్టి చేయఁగూడదా? అందులకుఁ దగఁడా?

బుద్ధు—ప్రాణు లనుభవించుసుఖదుఃఖములు, రాగద్వేషములు, మంచి చెడ్డలు కూడ దైవమే సృష్టించినాఁడు గద!

దేవ—ఆ.

బుద్ధు.—అటులైన నిట్టిసుఖదుఃఖాదులు దేవునకుఁగూడ నున్నవి.

దేవ—ఏల యుండవలయును?

బుద్ధు.—నీ కెంతమాత్ర మనుభవములేనియంశమునుగూర్చి యొకని కనుభవము గలుగునట్లు చెప్పఁగలవా?

దేవ—లేకపోయిన నేమి?

బుద్ధు.—దేవున కనుభవము లేకపోయినప్పటికి మఱెక్కడనుండియో యీసుఖదుఃఖములు వచ్చి సృష్టిలోఁ బడిన వని చెప్పుట దేవుని సంపూర్ణతకు స్వతంత్రతకు భంగముకాదా?

దేవ—అది నిశ్చయమే.

బుద్ధు.—సుఖదుఃఖాదు లతనినుండియే వచ్చిన వని చెప్పినయెడల నతని నిశ్చలతకు భంగము కాదా?

దేవ. భంగ మెట్లు? తాను నిశ్చలుఁడై యుండియుఁ దద్వ్యతిరేకతత్త్వముల సృజింపఁగలఁడు.

బుద్ధు.—హింస, అహింస, నీతి, అనీతి, సుఖము, దుఃఖము, మంచి, చెడ్డ ఇవి యన్నియు దైవదత్తములే యైనప్పు డొకటి తప్పేమి? యొకటి యొప్పేమి? ఇఁక ధర్మబోధ మెట్టిదో తండ్రివధమునం తే యగును గాదా? కానిలోకమునకు సదసద్భేద మున్నదందువా? లేదందువా?

దేవ—లోకుల కున్నది.

బుద్ధ—లోకులను సృష్టించిన దేవునియందు లేని యీభేదము లోకుల కెటనుండి వచ్చినది.

దేవ—దేవున కట్టిభేదము లేదు.

బుద్ధ—దేవునకుఁ బుణ్యపాపభేదమే లేనియెడలఁ బుణ్యము చేసినజనునకు శాశ్వతసుఖము లేదు. పాపము చేసినజనునకు దుఃఖము లేదు.

దేవ—జనుని సుఖదుఃఖములు వానికర్మము ననుసరించి కలుగు నని యందురు.

బుద్ధ—సుఖదుఃఖములు సృజించునది కర్మము?

దేవ—ఆ.

బుద్ధ—దైవమునకుఁ బ్రతికక్షి సృష్టికర్త కర్మ మగునప్పు డిద్దఱుసృష్టికర్త లుండవలయును గాదా? ఇది మఱింత ముప్పుకాదా? నాయనా! బుద్ధిమంతుఁ డొకపని నేదైననొక యుద్దేశముతోడనే చేయునా?

దేవ—ఆ.

బుద్ధ—సృష్టికి భగవంతుని యుద్దేశమేమి?

దేవ—ఉద్దేశము నాకెట్లు తెలియును?

బుద్ధ—నీకుఁ దెలియ నక్కఱ లేదు. ఏమైన నుండునా?

దేవ—ఉండవలసినదే.

బుద్ధ—నాయనా! ఉద్దేశ మెప్పుడును రెండువిధములుగనే యుండును గాదా? ఆత్మసుఖదుఃఖమేమో? పరసుఖదుఃఖమేమో? జనులసుఖదుఃఖములకై సృష్టిచేసెనా? తనసుఖదుఃఖములకై సృష్టిచేసెనా? జనులసుఖదుఃఖములకై సృష్టిచేసినయెడల—సుఖదుఃఖతత్త్వములు తనస్వాధీనములోనే లేవు కదా? అట్టి వానికొఱకుఁ

డా నెట్లు సృష్టింపఁగలఁడు? ఆత్మసుఖదుఃఖములకై సృష్టిచేసి యుండెననుకొందము. తనకు సుఖదుఃఖములే లేవని నీవం టివి. పోనీ! ఉన్న వనుకొందము. సుఖదుఃఖములు కర్మసృష్టి లోని వైసప్పుడు దైవ మేకర్మము పూర్వమునఁ జేసికొనుటవ లన నీసుఖదుఃఖానుభవాపేక్ష కలిగెనందువు? అసందర్భముగ లేదా? నాయనా! కావున నుద్దేశ మున్న దనవలదు. ఉద్దేశ ము లేకుండఁ జేసినాఁడనుకొన్న నాతఁడు మతిలేనివాఁ డనుకొ నవలసివచ్చును. కావున నీరెండును సరిపడనట్లు తోఁచుట లేదా?

దేవ—దైవోద్దేశ మనఁగ నరునిసుఖదుఃఖాపేక్షవంటిదే యని దుర్భ్ర మమొందుటచేత నసందర్భముగఁ గానఁబడుచున్నది. ఈయసంద ర్భత నావాదములో లేదు. దైవమునకుఁగూడ మనవంటియి చ్ఛలు ఫలించినయెడల మనవంటిసుఖములు, ఫలింపకున్న యెడ ల మనవంటిబాధలు నుండు నని మన మసందర్భముగ ననుకొ నుటవలన నీయసందర్భతగలిగినది.

బుద్ధ—నాయనా! నీ విప్పటికి గ్రహించితివి. ఇట్టియజ్ఞానము వృద్ధియ గు ననియే దైవము పై రెత్తవల దని నేను మొదటఁ జెప్పినది.

దేవ—క్షమింపవలయును. పోనిండు. దాని కేమి? ఉద్దేశ -మని చెప్పఁ గూడదంటిరి కాన నది లీల యందును.

బుద్ధ—లీల యనఁగ నేమి?

దేవ—విలాసము. కేళి.

బుద్ధ—నాయనా! తననంతోషముకొఱ కిన్ని కోటులప్రాణులను నిరం తరము క్షోభపెట్టువాఁ డాహాహా! యెంతదయార్ద్రహృదయుఁ డు! దేవుఁడంత పరమకఠినపాషాణాధికకఠినహృదయుఁ డనుకొ నుటకంటె నతని దలఁపెట్టకుండుట యెక్కువతప్పా? నాయ

నా! తనకాలక్షేపమునకొఱకుఁ దానాడించుకొనుచున్న యీతోలు బొమ్మలాటలోఁ దప్పాడినబొమ్మ తప్పేమి? మంచియాడిన బొమ్మ మంచియేమి? ఈమంచిచెడ్డ లన్నియుఁ దానాడినవే కద! తనచెడ్డకు మనకు శాశ్వతశిక్షయా? ఇట్టిన్యాయకర్త భూలోకమున నున్న నాతని జనులు బ్రదుకనిచ్చెదరా?

(నేపథ్యమున) అభయము చేతనే యదృశ్యుఁ డయ్యెనుగాఁబోలు!

దేవ—కావున భగవంతుఁడు జగత్తును సృష్టింపలే దందురా?

బుద్ధ—నే ననుట యెందులకు? నీ కెట్లు తోఁచుచున్నదో యట్లు గ్రహింపవచ్చును.

దేవ—ఈశ్వరుఁడు సృజియించి యుండనియెడల నీప్రపంచ మీశ్వరుని స్వరూపమై యుండఁగూడదా? ఈశ్వరుఁడే ప్రపంచరూపముగఁ గానఁబడుచున్నాఁ డనఁ దగదా?

బుద్ధ—ఈశ్వరుఁడే ప్రపంచముగ మార్పుఁ జెందినాఁడన్న నీశ్వరుని యవికారత్వము లోపము. ప్రపంచరూపమునఁ గానఁబడుచున్నాఁ డంటివి. ప్రపంచరూప మనఁగ నేమి? ప్రపంచమున నున్న సర్వ వస్తువులరూపమే నా?

దేవ—ఆ.

బుద్ధ—ఈవస్తువులస్వరూపస్వభావములవెనుక నీశ్వరుఁ డున్నాఁ డని నీయభిప్రాయమా?

దేవ—ఆ.

బుద్ధ—వెనుక నున్నాఁ డనఁగఁ బ్రపంచముకంటె భిన్నముగా నని యేనా?

బుద్ధ—మనప్రపంచజ్ఞాన మంతయు నవిచ్ఛిన్నకార్యకారణసంబంధము కలదై యున్నదికదా! ఇట్టికార్యకారణశృంఖలతో భగవంతు

నికి సంబంధము లేదంటివి. ఇఁక నతఁడు తెలియఁదగనివాఁడే కద!

దేవ—తెలియఁదగనివాఁడు లేనివాఁ డెట్లగును?

బుద్ధు—తెలియఁదగనివాఁ డనఁగ నాయభిప్రాయ మేమన:—అతని స్వరూపస్వభావములు తెలిసికొనుటకు మన కవకాశము లేదని కాదు. అతఁడున్నాఁ డని నీకుఁ దెలియఁ దగ దని—వింటివా? నాయనా! కార్యకారణశృంఖలాసంబంధ మున్నచోటఁగాని యీజ్ఞానము లేదు. దేవుఁ డేసంబంధములోనివాఁడు కాఁడని చెప్పితివి. అట్టిదేవుఁ డున్నాఁడని చెప్పుటకు నీ కవకాశ మెట్లు కలిగెను? అది కాక—దేనితోడను సంబంధము లేనియీశ్వరుఁ డన్యోన్యసంబంధము గలిగినట్టియు, అన్యోన్యసంబంధమునఁ గాని నిలువఁ దగనట్టియు వస్తుజాలము నెట్లు సృజింపఁగలుగును? అదిగాక, నాయనా! ఈశ్వరుఁడు ప్రాంచికసర్వవస్తుస్వరూపము ల వెనుక నొక్కఁడే యున్నాఁడా? ప్రతివస్తుస్వరూపమునకు వెనుక నున్నాఁడా? మొదటియభిప్రాయమే సత్య మగునెడల, యనేక హేతువులనుండి పుట్టినట్టి యనేకస్వరూపస్వభావములు గల వస్తువుల కీయేకత్వ మెట్లు కారణము కాఁగలదు? రెండవయభిప్రాయమే సత్య మగునెడల నెన్నియో యీశ్వరతత్త్వము లుండును గదా? వాని కన్యోన్యసంబంధ మెట్లు?

దేవ—ఇన్ని యీశ్వరతత్త్వములు లేవు. ఉన్న దొక్కటే. అది సర్వవ్యాప్తమైయున్నది. అదియే యీరూపముల నన్నిటిని గలుగఁ జేయుచున్నది.

బుద్ధు—అన్నిచోటులఁ దానే నిండినది యెక్కడ సృష్టి చేసినది? అది గాక, అన్నివస్తువులలోను వ్యాపించినతత్త్వ మావస్తువుల నెట్లు చేసినది? అది గాక, సర్వవ్యాప్తుఁ డగునీశ్వరుఁ డన్నియుఁ జేసిన

యెడల నిఁక మనకు మోక్షప్రయత్న మేల? ఈశ్వరుఁడు మన లోనే యున్నాఁడు. అతఁడు చేసినకష్టసుఖములు నాతఁడే యనుభవించుచుండవలయును గాదా? నాయనా! సర్వవ్యాప్తమని చెప్పఁ గూడదు. అది నిర్గుణమును గాదు. అట్లే యగునెడలఁ దత్సృష్టి యంత నిర్గుణముగనే యుండవలయును. అది యవికారమును గాదు. అట్లేయగునెడల సవికార మగుప్రపంచము వానియం దెట్లు పుట్టినది? ప్రపంచ మీశ్వరునిపరిణామము కాదు.

దేవ—అట్లు కానియెడల నాత్మయే యీప్రపంచమును సృష్టించినదని చెప్పిన బాధ యేమున్నది?

బుద్ధ—ఆత్మ లేనిదగునప్పు డది యేమి చేయఁగలదు?

దేవ—ఆత్మకుఁ బ్రతినిధిగ మీ కహంతత్త్వ మున్నది కాదా?

బుద్ధ—అదియే కొన్నిస్కంధములచేఁ జేయఁబడినప్పు డది చేయునదేది?

దేవ—సృష్టిక్రమము స్థాపించినపిమ్మట కాదా యాత్మతత్త్వమును స్థిరపఱుచఁదగినది? కావున మీరు శాశ్వతాత్మ నొప్పుకొనక తీరదేమో?

బుద్ధ—సరే. నీయిష్టానుసార మొక్కనిముష మొప్పుకొందును. ఆత్మయే సృష్టికర్త. ఆత్మ యెల్లప్పుడు దుఃఖరాహిత్యమును గోరుట సిద్ధాంతాంశమై యున్నదే కద!

దేవ—ఔను.

బుద్ధ—అట్టియాత్మ తాను జేయుసృష్టి కేవలదుఃఖభూయిష్ఠముగానే చేయ నేల? ఆత్మయే చేసియుండినయెడల నట్లు చేయునా? కావున నాత్మ సృష్టికర్త కాదు.

దేవ—దుఃఖసహితముగ సృష్టించుటయే దానిస్వభావ మేమో?

బుద్ధు—కావున, దుఃఖరాహిత్యమునే కోరుచు మనలో నున్నట్లు స్పష్టముగఁ గనఁబడుచున్నయాత్మ సృష్టికర్తయైనయాత్మకంటె భిన్నమే కాక దానితో విరోధము గలదని యొప్పుకొనవలయును. అట్లు నీ వొప్పుకొందువా?

దేవ—ఊహూ!

బుద్ధు—అదిగాక మనము చేసికొనుకర్మములనుండి దుఃఖము గాని దుఃఖరాహిత్యము గాని సిద్ధించుచుండ నాత్మ వానిని సృష్టించెనందు వేమి? ఒక్కవస్తువున కిద్దఱు సృష్టికర్తల నంగీకరింతువా? ఆత్మయే చేసినయెడలఁ గర్మములతోఁ బని యేమున్నది? కర్మమే చేసినయెడల నాత్మతోఁ బని యేమున్నది? కర్మము మనము చేయుచున్నాము. దానిఫల మనుభవించుచున్నాము. కావున నాత్మ సృష్టికర్త కాదు.

దేవ—కావున నాత్మయు సృష్టింపలేదని మీయభిప్రాయమా?

బుద్ధు—నీవే యాలోచించుకొనుము. నే నింతకుముం దొప్పుకొనిన శాశ్వతాత్మతత్త్వమును విడువవచ్చునా? నాయనా! ఇంక నేమైనఁ జెప్పెదవా?

దేవ—ఏది చెప్పినను గాదనుచున్నారు. ఇఁక నేమి చెప్పనుకి? కాని సృష్టించిన భగవంతుఁ డొకఁ డున్నాఁడను లోకవ్యాప్తమైన యీనమ్మక మెట్లుకలిగినది?

బుద్ధు—నాయనా! మనము నమ్మినప్రతివస్తువు సత్యముగ నుండవలసినదేనా? దయ్యము లున్నవా?

దేవ—అవి యాధునికులకల్పనలై యుండవచ్చును.

బుద్ధు—అటులే సృష్టికర్తతత్త్వమును పూర్వులకల్పనమై యుండవచ్చును.

దేవ—ఉండవచ్చు నన్నియే చెప్పఁగలరు. కాని యున్నదని మీరు చె
ప్పలేరు కద!

బుద్ధ—నాయనా! ఇంతసేపటినుండియుఁ జెప్పిన దదే కాదా? దయ్య
ములాధునికులకల్పనములై యుండవచ్చు నని నీవంటివి కాన
భగవత్తత్త్వముకూడ నట్లే పూర్వకల్పనమై యుండవచ్చు నంటి
నిగాని యిందువలననాకుఁ గొత్తగాఁ గలిగినసందేహ మేమి
యున్నది? కాని, ముప్పదిమూఁడుకోట్లదేవత లున్నారా? ఈ
యంశముగూడ నందఱు నమ్ముచున్నారే!

దేవ—ముప్పదిమూఁడుకోట్లదేవులు లేరు. కాని యున్నదేవు నొక్కని
నే యిన్నివిధములుగఁ జెప్పుచున్నారు.

బుద్ధ—ఒక్కదేవు నిన్నివిధములుగఁ జెప్పుటకుఁ గల్పనాశక్తిగలజను
లు లేనివాని నొక్కదేవునిగ మాత్రము చెప్పలేకుందురా? నా
యనా! ఈశ్వరుఁ డున్నాఁడని యెందఱో నమ్మిరని చెప్పితివి క
ద! ఈశ్వరతత్త్వమునుగూర్చి వీరందఱియభిప్రాయ మేకమా,
కాదా?

దేవ—కాకపోవచ్చును.

బుద్ధ—కాకపోవచ్చు నేమి? కానే కాదు. నీకు నిర్గుణుఁడు. నాకు సగు
ణుఁడు. వానికి భయంకరుఁడు, మఱియొకనికిఁ గరుణాస్వరూపుఁ
డు. ఇంకొకనికిఁ దటస్థుఁడు. ఒకనికిఁ బురుషుఁడు. ఒకనికి స్త్రీ.
ఒకనికిఁ గ్రోఁతి. ఒకనికిఁ బంది. ఒకనికిఁ గోడి. ఒకని కేనుఁగు
మూతి. ఒకనికిఁ గల్లుకుండ. ఒకనికి నల్లరాయి. నీదేవుఁడు నపుం
సకుఁడు. నాదేవుఁడు జారుఁడు. నీదేవుఁడు సదోపవాసి. నాదే
వుఁడు దినమున కరువదియాఱుభోగము లారగించును. నీదేవుఁ
డు పక్షి నెక్కుటలో బండితుఁడు. నాదేవుఁడు వృషభము
నెక్కుటలో విద్వాంసుఁడు. ఛీ ఛీ! నీదేవుఁడు నలుపు. నా

దేవుఁడు తెలుపు. నీదేవుఁడు మాంసభక్షకుఁడు. నాదేవుఁడు ములగకాడవైన ముట్టఁడు. నాయనా! ఇంతయసందర్భత, ఇంతయల్లరి, ఇంతయవకతవక మఱియేవిషయమున్ననైనఁ గలదా?

దేవ— లేకపోవచ్చును. కాని—

బుద్ధ— ఇంకఁ "గాని" యేల? ఇద్దఱైన నిందునుగూర్చి యేకాభిప్రాయులై యున్నారా?

దేవ— లేరు. లేకపోయిన నేమి?

బుద్ధ— ఏమియు లేదు. నాదేవుఁడు నీపిశాచము. అంతే కాక యొక్కనరునిజీవితములో నీశ్వరతత్త్వాభిప్రాయ మనేకపర్యాయములు మారవచ్చును. ఇందులోనేది నిజము? అన్నియుఁ గూడ నసత్యము లేల కాఁగూడదు. ప్రాణికిఁ గలుగువాంఛలనుబట్టి యిచ్ఛలనుబట్టి, నడవడినిఁబట్టి యూపాదిని దైవమును సృష్టించుకొనును. దైవము మనల సృష్టింపలేదు కాని మనముమాత్రము దైవము నీవిధముగ సృష్టించినారము. గాడిదెబుద్ధికిఁ బదునాలుపెద్దబుంగలయూక నొక్కగ్రుక్కను నమలకుండ మ్రింగఁగలగాడిదెలరాయఁడు భగవంతుఁడు; ఈశ్వరతత్త్వమునకుఁ గాళ్లు నిట్టతాళ్లు; ఒడలినిండ బోదురుకప్పలంతజోరీగలు; జనులలో బుద్ధిహీనున కెదుట నుండుటకు పుత్తడియో కొయ్యపాత్రియో దైవము. మాపాషాణదైవమున కీదినమునఁ బాకపుగారెలుగావలయుననియు,మాకొయ్యమ్మవారి కీరాత్రి క్రొత్తకోక గావలయు ననియు నీబుద్ధిహీనుఁ డొడలు తెలియక యీవింతబొమ్మలాటసందడిలోఁ దైతక్క లాడుచుండును. ఈదారుపాషాణపూజారతునికంటె బుద్ధిమంతుఁ డగువాఁడు బింకముగ నిలువఁబడి గట్టిగ కన్నులుమూసి చేతులు నెత్తిమీఁదనో కడు

పృమీఁదనో మడచి ‘‘ఓలోకకర్తా! ఓజగద్భర్తా! నీవు సర్వస్వతంత్రుఁడవు; నే నస్వతంత్రుఁడను. నీవు శక్తిమంతుఁడవు; నే నశక్తుఁడను. నీవు తండ్రివి; మేము బిడ్డలము. నీవు ప్రభుఁడవు; మేము సేవకులము. నీకు మాపైఁ గోప మేల? మే మేమి చేసిన నీకుఁ గోపము శాంతించునో చెప్పరాదా? నీకే కోపము వచ్చిన రక్షించువాఁ డెవఁడు? తల్లి కొడుకునకు విషము వెట్టఁ దలఁప నిఁక దిక్కెవ్వఁడు? మాజిహ్వలయందు మద్యపానరుచి దగులకుండునట్లు చేయుము. మాబుద్ధులను సత్యమునందు నెలకొల్పుము. మాదేహములకు వ్యభిచారసంపర్కము లేకుండఁ జేయుము. మాచిత్తములను మీపాదములపైకి లాగికొనుము. ఓంశాంతిశ్శాంతిశ్శాంతిః,, యని చల్లార్చును. ఇట్టివానికంటె జ్ఞానాధికుం డగునిర్గుణబ్రహ్మోపాసకుఁ డంబుజాసనమునఁ బెట్టిదలతోఁ గూరుచుండి దృష్టిని నాసికాగ్రమునకు జరిపి యాత్మను బ్రహ్మరంధ్రస్థానమునకై పఱపి యేతము పెట్టుగా నూపిరిని నెఱపి లోకాతీతుఁడై యుండును. ఇట్టివానికంటె జ్ఞానియగుబౌద్ధుఁడు ‘‘గాఁడిద లేదు. కొయ్యబొమ్మ లేదు. సగుణము లేదు. నిర్గుణము లేదు. ఏమియు లేదు. లేకపోవుటమాత్రమే యున్నది.’’ అని చెప్పి సంసారదుఃఖకారణ మగుతృష్ణను భేదించి యహంభావమును నాశనము చేసి నిర్వాణపద మొందును.

దేవ—మహాత్మా! దైవతత్త్వమునుగూర్చి యాస్తికు లందఱు తలకొక యభిప్రాయము పడవచ్చును. వారివారిబుద్ధులనుబట్టి వారివారి యభిప్రాయములలో భేదమున్నంతమాత్రముచేత దైవసత్యత్వములో భేదముగలిగినదా? దైవమునుగూర్చి నిన్నటిదినమునకుఁ గలయభిప్రాయము నీదినమున మార్చుకొనినయెడల దైవాస్తిత

తలో మార్పు కలిగినదా? ఇందువలన దైవము లేఁడని యెట్లు స్థిరపఱుతురు?

బుద్ధు—ఇదివఱకు మూమ్మాఱు స్థిరపడినయంశమున కిప్పు డింక నధిక స్థైర్యమెందులకు? నాయనా! దైవ ముండుటచేత నున్నాఁడని నీకుఁ దోఁచినది. ఉన్నాఁడని నీకుఁ దోఁచుటచేత నుండవలసినదా?

దేవ—ఉండుటచేతనే యున్నాఁడని తోఁచినది.

బుద్ధు—నాయనా! ప్రస్తుతవాద మెట్లారంభ మయ్యెనో మఱచిపోయితివా? జనుల కందఱకు దైవ మున్నాఁడని యింతనమ్మక మున్నది కదా? ఇట్టిసర్వవ్యాప్త మగునమ్మకమునుబట్టియైనను మనము దైవసత్యత్వము నేల స్థాపింపఁగూడ దని నీవడిగితి వని నే ననుకొంటిని.

దేవ—మీకట్లర్థ మయ్యెనేమో కాని నాయభిప్రాయ మేమనఁగ "దైవ ముండుటచేతనే నా కట్లు తోఁచినది." ఈసారి యెట్లు చెప్పుదురు?

బుద్ధు—నాయనా! మంచిది. దైవ మున్నాఁడు వేల యున్నాఁడు?—నీకుఁ దోఁచుటచేత—అంతేనా?

దేవ—ఆ.

బుద్ధు—కావున నీకుఁ దోఁచుట దైవ మున్నాఁ డనుటకుఁ గారణము.

దేవ—ఔను.

బుద్ధు—నీకుఁ దోఁచుట కారణము. దైవసత్యత్వము కార్యము.

దేవ—ఆ.

బుద్ధు—నాయనా! నీ కేల తోఁచినది?

దేవ—దైవ ముండుటచేత.

బుద్ధ—కావున దైవ ముండుట కారణము; నీకుఁ దోఁచుట కార్యము.

దేవ—ఔను.

బుద్ధ—నాయనా! ఇదివఱ కెట్లు చెప్పితివి?

దేవ—దీనికి వ్యతిరేకముగఁ జెప్పితిని.

బుద్ధ—అది నిజమా? ఇది నిజమా?

దేవ—రెండు నిజములే.

బుద్ధ—నాయనా! మఱియొకసారి యాలోచింపరాదా? ఈవాదమువ లనఁ గార్యకారణసంబంధ మంతయు ధ్వంసమైనట్లు కనఁబడుట లేదా? నీకు భగవంతుఁడు కారణము, భగవంతుఁడుండుటకు నీకుఁ దోఁచుట కారణమునా? నాయనా!

దేవ—కాఁగూడదా? చెట్టునకు విత్తు కారణము; విత్తునకుఁ జెట్టు కారణము కాఁగూడదా?

అజా—దేవదత్తాచార్యా! అసంబద్ధవాదము చేయుచున్నావు. తప్పు. మహాత్మా! అతనిని క్షమింపవలయును.

బుద్ధ—నాయనా! ఎంతమాట! సోదరుఁడా! దేవదత్తా! నీవు మనసున నిబ్బందిపడవలదు. తెలియఁదగనియంశమునుగూర్చి వాదించిన చో వాదవైఖరి తుద కిట్లే పరిణమించును.

దేవ—మహాత్మా! నాకుఁ దల నొచ్చుచున్నది. నేను బోయెదను.

బుద్ధ—(మందహాసముచేయుచు) నాయనా! ఈతలనొప్పి కేమి? ఇది వదలినను బాధ లేదు; వదలకున్నను బాధ లేదు; కాని యహం భావము వదలినఁ గాని సుగతి లేదు. నాయనా! బుద్ధమతసారాంశ మగునీయొక్క మాటను జ్ఞప్తి యుంచుకొనుము.

దేవ—(పోవును.)

అజా—మహాత్మా! ప్రపంచము సత్యమే యని మీరుకొందఱకు బోధించినారఁట! మిథ్య యని కొందఱకు బోధించినారఁట. మీరు సత్య మాడియేయుందురా? లేక—

బుద్ధు—ఒకవిధమునఁ జూచిన వారు సత్యమాడియే యుందురు. మఱి యొకవిధమునఁ జూడ వా రసత్య మాడక పోలేదు.

అజా—ఎట్లో సెలవీయఁ బ్రార్థించుచున్నాను.

బుద్ధు—సోదరుఁడా! ఆకుండులోని మొక్క నున్న పుష్పమున కేమని పేరు?

అజా—సూర్యకాంతపుష్పము.

బుద్ధు—అది యేరంగుగలది?

అజా—పచ్చనిరంగు.

బుద్ధు—అది గుండ్రముగ నున్నదా? నాల్గుపలకలుగ నున్నదా?

అజా—గుండ్రముగ.

బుద్ధు—అది యెంతపుష్ప మున్నదో కాంచితివా?

అజా—పెద్దది.

బుద్ధు—దానివర్ణము, వర్తులత్వము, వైశాల్యము దేనివలనఁ గనిపెట్టఁ గలిగితివి?

అజా—కంటివలన—

బుద్ధు—దానివాసన దేనివలనఁ గనిపెట్టఁగలవు?

అజా—ముక్కువలన.

బుద్ధు—అది మెత్తగనున్నదో గరుసుగ నున్నదో, తేలికగ నున్నదో బరువుగనున్నదో యెట్లు తెలియఁగలవు?

అజా—స్పర్శేంద్రియమువలన-

బుద్ధు—దానిరుచి నెట్లు తెలిసికొనఁగలవు?

అజా—జిహ్వావలన

బుద్ధు—దానికి ధ్వనియున్నదా?

అజా—లేదు.

బుద్ధు—ఉండినయెడల నెట్లు తెలిసికొనఁగలవు?

అజా—కర్ణములవలన-

బుద్ధు—బాహ్యప్రపంచమున నుండు నేవస్తువునుగాని నీవు తెలిసికొనవ లసియుండినయెడల నీపైనిఁ జెప్పినవానికంటె నెక్కువఁగఁ దెలి యఁదగిన దేమైన నున్నదా?

అజా—లేదు.

బుద్ధు—వస్తుజ్ఞానము నీకుఁ బంచేంద్రియములవలననే కలుగుచున్నది కాదా?

అజా—చిత్తము.

బుద్ధు—వానివలననే కలుగుచున్నది యనఁగ నేమి?

అజా—అవి వస్తుజ్ఞానమునకు సాధనములు.

బుద్ధు—తెలిసికొనున దేది?

అజా—మనస్సు.

బుద్ధు—నీమనస్సు స్వరూపమునీఁదికిఁ బోయి వాసనావర్తులత్వాదుల ను గ్రహించుట నీపంచేంద్రియములే యుపరోధములు కావా?

అజా—చిత్తము.

బుద్ధు—కావున నీమనస్సునకు బాహ్యప్రపంచజ్ఞానము ప్రత్యక్షము కాదుగద!

అజా—కాదు.

బుద్ధు—కానప్పుడు వస్తుజ్ఞానసిద్ధి యెట్లు కలిగినది?

అజా—అనుమానమువలనఁ గలిగియుండఁదగినది.

బుద్ధు—అట్టియనుమానము గలుగుట కేదైనాఁ గొన్నికారణము లుండ వలయునా?

అజా—తప్పక యుండవలయును

బుద్ధు—తనలోఁ గలిగినయీవికారములను దాను కనిపెట్టి, యొకమార్పును బచ్చరంగుగ, నొకమార్పును వర్తులత్వముగ, నొకమార్పును వైశాల్యముగ నిట్లే మిగిలినమార్పులు మిగిలినవానిగ గ్రహించినదికాదా?

అజా—చిత్తము.

బుద్ధు—ఈమనోవికారమును వేఱువేఱుగవర్ణవర్తులత్వాదులుగ గ్రహించియీవికారముల నన్ని సంఘీభవించి దేనిగ గ్రహించినది?

అజా—సూర్యకాంతపుష్పముగ—

బుద్ధు—కావునఁ బ్రొద్దుతిరుగుడుపువ్వనఁగ నొకమనోవికారసంఘమే కాదా?

అజా—అయ్యో! అంతే?

బుద్ధు—కాదా? మనోవికారసంఘము నీమనసులోనే యున్నది కాదా?

అజా—ఆ!

బుద్ధు—అట్లైన సూర్యకాంతపుష్పముకూడ మనసులోనే యున్నది.

అజా—అయ్యయ్యో! అదెట్లు? పుష్పము వెలుపలనే కనఁబడుచున్నది.

బుద్ధు—నాయనా! నీమనసున కట్టిప్రత్యక్షజ్ఞానము లేదని చెప్పితివి కావా? నీమనసులో నెఱరంగున్నది. వర్తులత్వ మున్నది. మిగిలిన వన్నియు నున్నవి. ఇవి యన్నియుఁ గలసినపుష్ప మున్నది. ఈపుష్పమునే నీవుగాంచినది. ఈపుష్పమునే నీవు వాసనచూచినది. నాయనా! మనసులోఁ బుష్పము నుంచుకొని పైన నున్నదందువేల?

అజా—పైననున్నపుష్పమువలననే మనసులోఁ బుష్పము కలిగినది.

బుద్ధు—ఎట్లు?

అజా—మనసు దర్పణముపైనఁ బుష్పమున్నది. అదియే మనసులోఁ బ్రతిఫలించినది.

బుద్ధ—నాయనా! అద్దమునకుఁ బ్రత్యక్షముగఁ దెలిసినది తనలోనిప్రతి ఫలమేనా? అంతకంటెనధికమా?

అజా—ఆ.

బుద్ధ—అటులే మనస్సునకుఁ బ్రత్యక్షముగఁ దెలిసినవి కొన్ని యూహములే. ఇది వృక్ష మని యది కోదండ మని జనులు తెలిసికొని నవస్తువు లేవనఁగఁ దమమనసులోని వివిధము లగునూహములే కావున బాహ్యప్రపంచ మని మనుజు లనుకొనునది యెచ్చట నున్నది?

అజా—మనస్సులో.

బుద్ధ—నేను ప్రపంచమును నా వెలుపలఁ జూచుచున్నా ననుకొనువాఁడు నిజముగ నేమి చేయుచున్నాఁడు?

అజా—మనస్సులో దానిని జూచుకొనుచున్నాఁడు.

బుద్ధ—కావున గ్రహించుమనస్సు లేనప్పుడు ప్రపంచ మున్నదని చెప్ప వచ్చునా?

అజా—నామనస్సునకు లేక పోయిన మఱియొకమనస్సున కుండును.

బుద్ధ—ఇటులే యందఱిమనస్సులు నశించినపిమ్మట ప్రపంచమున్నదా?

అజా—ఉన్నదో లేదో యిఁక నెవనికిఁ దెలియును?

బుద్ధ—కావునఁ బ్రపంచ ముండుటయనఁగ నది గ్రహింపఁబడుట యని యర్థమే కాదా?

అజా—నే నిప్పు డనవలసినది "ఔను" అనియే కాని నాకు సంతుష్టిగ లేకున్నది. గ్రుడ్డివానికిఁ బ్రపంచము లేదా?

బుద్ధ—మన కున్నప్రపంచ మగురూపరసశబ్దస్పర్శగంధములలో రూపము దక్క మిగిలినదంత యున్నది.

అజా—ఈధైర్యాదులును గుణములు గదా? ఈగుణము లేదో వస్తువులో నిమిడియుండవలయును గాదా? ఆవస్తు వేది?

బుద్ధ—సమూహామునకంటె భిన్నముగ గుణి యుండునా? యంత్రమున నుండు చక్రములు చీలలు మొదలైనవి యన్నియుఁ దీసివైచిన నిఁకశుద్ధయంత్ర మనుతత్త్వ మొకటి నిల్చియుండునా? చుట్టుగుడిసె కాలిపోయిన బీదవాఁడేడ్చునుగాని కాలిపోయినవి గుణములుగాని చుట్టుగుడిసె యుండనేయున్న దని నిర్విచారముగ నుండఁగలఁడా?

అజా—మహాత్మా! ప్రపంచ మనునది యింతకంటె నేదియు లేనేలేదా?

బుద్ధ—నాయనా! మఱియేమున్నది?

అజా—ఆత్మ లేదని యిదివఱకే చెప్పినారు. అయ్యో! ఇఁక నంతయు శూన్యమేనా?

బుద్ధ—(నవ్వుచు) నాయనా! శూన్యమే కాదు. శూన్యమువంటిదే యొక్కవ్యక్తి యున్నది. జగత్తంతయు దానిస్వరూపమే.

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా! అది యేదో సెలవిండు మాకుఁ బరమానందముగ నున్నది. నీతివర్తనచేతఁ, బరోపకారబుద్ధిచేత, నింద్రియనిగ్రహముచేత, నహంభావమారణముచేతఁ బరమపూజ్యమై యద్వితీయ మైనయీమతము నాస్తిక మగునేమో యని మే మందఱ మిప్పటివఱకుఁ బొందినయాందోళన మింతంత కాదు. మహాత్మా! మహాత్మా! యనుగ్రహించి యామూలతత్త్వ మేదో యుపదేశింతురుగాక!

బుద్ధ—సోదరుఁడా! చూచితివా వారియుత్సాహము! నాయనలారా! ఈమూలతత్త్వ మున్నప్పటికి మీ కది లేనట్టిదే యని చెప్పలేదా? మీకింతమహానంద మేల? ఆతత్త్వమునకు మీముక్కుమూతలసమాధు లక్కఱ లేదు. మీనిలువుగాళ్ళ తెలివితక్కువప్రార్థనము లక్కఱ లేదు. మీపసిడికుండలదేవాలయము లక్కఱ లేదు. మీయిట్టితోలుపేపపెట్టె లక్కఱ లేదు. మీకర్పూరపుటారతు లక్కఱ లేదు. మీసాతాళించినసెనగ లక్కఱ లేదు. మీయొడలినిలువుదోస్రు లక్కఱ లేదు. మీతలపై వెండ్రుకలకట్ట లక్కఱ లేదు. మీపుణ్యములఁ గాంచి మిమ్మాతఁడు తొడపైఁ గూర్చుండఁబెట్టుకొనువాఁడు, మీపాపములఁ గాంచి మిమ్మాతఁడు గాలిక్రిందవైచి త్రొక్కువాఁడు కాఁడు. మీరాతత్త్వమును దలపెట్టనక్కఱయే లేదు. మీపుణ్యపాపకర్మములు మీలోనున్నవి. మీయహంతత్త్వనిర్మూలము మీలో నున్నది. మీజన్మపరంపరావిఖండనము మీలో నున్నది. మీదుఃఖరాహిత్యము మీలోనున్నది. మీనిర్వాణపదవి మీలో నున్నది. ఇప్పుడైన నీయథార్థమును జ్యోతీరూపకముగ జగత్తంతప్రకాశించు నీయథార్థమును గనిపెట్టుదురా? నాయనలారా! నేఁజెప్పబోవుతత్త్వమునకు మీరెప్పుడు మనసులోనైన మ్రొక్కరుకదా! మీతృష్ణాకోటులను మీరు వదలకపోవుటయే కాక యీతత్త్వమునకుఁ గూడ సంటఁగట్టరుకదా! సోదరులారా! ఊరకుందు రేమి?

(నేపథ్యమున) మహాత్మా! మహాత్మా! అట్లెప్పుడు మేము చేయము.

బుద్ధ—ఇప్పు డాలాగే యందురు. మీరట్లు జరుపుకొనినను మీతరువాతివా రూరకుందురా? మూలతత్త్వముమాటవఱ కెందుల

కుఁ? కొంతకాలము పోయినపిమ్మట నన్నెవల్లరాతినో లక్క-మూత్రికో చేసి నే నిప్పుడు తాకనిపుష్పములను నామెడఁ గట్టకుందురా?

(నేపథ్యమున)మహాత్మా! మహాత్మా! అట్టియజ్ఞానమున మఱలఁ బడము.

బుద్ధ—సరే! సంతోషమే. అటులైనయెడల—

అజా—మహాత్మా! అప్పుడే మట్టమధ్యాహ్నము కావచ్చినది. లోనికి దయచేసి మాధ్యాహ్నికస్నాన మొనర్చి భిక్ష నారగింతురుగాక!

బుద్ధ—సరే. సాయంకాలమున నుపదేశింపవచ్చును. (లేచును)

(నేపథ్యమున(జప్పటలు) జయబుద్ధాచార్యా! జయబుద్ధాచార్యా!

(అందఱునిష్క్రమింతురు.)

ఇది నవమాంకము.



శ్రీ

# బుద్ధబోధసుధ

దశమాంకము.

ప్రదేశము మగధ.

ప్రవేశము బుద్ధుఁడు; అజాతశత్రుఁడు.

(నేపథ్యమున) జయాబుద్ధాచార్యా! జయాబుద్ధాచార్యా!

బుద్ధు—అష్టాంగశీల మనునది యిదివఱకు మీరు వింటిరి కాదా? దానిని సన్యాసులు సంసారులు కూడ నాచరింపక తప్పదు. ఇదిగాక సన్యాసు లెట్లు నడుచుకొనవలయునో చెప్పెదను.

గీ. ఆకయినఁ గాయయైనఁ బూ ♦ వైనఁ ద్రుంప
వలదు; మూలంబు లెపుడు ద్ర ♦ వ్వంగవలదు;
చెట్టు బెరడైన నెప్పుడు ♦ కొట్టవలదు;
జిగురుబదనికలనుదీయఁ ♦ దగదుసుండి.

(నేపథ్యమున) ఆహా! అహింసాధర్మ మెంతదూరము వ్యాపించినది!

బుద్ధు—గీ. రెండుజాములు దాఁటక ♦ యుండువేళఁ
బగట భైక్ష్యపాత్రను జేతఁ ♦ బట్టిశుద్ధుఁ
డైనగృహమేధియింటికి ♦ నరిగి దేహి
యనుచుఁ బల్కక యొకత్తటి ♦ యాఁగఁదగును.

గీ. పెట్టినది యేదొ కొని నీటి ♦ పట్టుగట్టు
పైనఁ గూర్చుండి యారోగ్య ♦ ఘణితి కొంత
యుచిత మంతయె తినఁదగు ♦ నొక్కపూట
మఱియుఁ బక్షోపవాసంబు ♦ జరుపఁదగును.

గీ. సంతలకును బ్రదర్శన ♦ శాలలకును
నరవినోదముగలపట్ల ♦ కరుగఁదగదు;
నాట్య మభినయ మెప్డును గా ♦ నంగఁదగదు;
పాట నెప్డును వినరాదు ♦ పాడరాదు.

గీ. అగరు, గంధము, పుష్పంబు లత్తరువులు
మొదలుగాఁగలసామగ్రి ♦ ముట్టరాదు;
సరిక దా తత్పరీమళ ♦ భరితమైన
స్థలమునకుఁ గడుచేరువ ♦ నిలువరాదు.

గీ. పట్టెఁడన్నము, నడుమునఁ ♦ జుట్టఁదగిన
యొక్కశాటియుఁ దప్పవే ♦ యొండువస్తు
వెవఁ డొసంగిన నెప్డును గ్ర ♦ హింపఁగూడ
దెత్తయినప్రక్కపై శయ ♦ నింపఁదగదు.

(నేపథ్యమున) ఆహా! మహాత్మా! ఎంతపరిశుద్ధ మైనజీవనాభ్యాసము నుపన్యసించుచున్నారు!

బుద్ధ—గీ. కవిత వినవల; దెప్డును ప ♦ ల్కఁగవలదు;
గానయంత్రములను, మృదం ♦ గములఁ, దాళ
ములను, దప్పెటలను, చిఱు ♦ తలను, గోల
ముక్కలను, నీలగొట్టాల ♦ ముట్టరాదు.

గీ. గవ్వలను,గింజలను, పాచి ♦ కలను, గ్రచ్చ
కాయలను, గుంటలందును ♦ గళ్ళలోను

యోడవలదు; మిత్రునిపేరు ♦ నందొ గాలి
యందొ వ్రాసినయది తెలి ♦ యంగవలదు.

గీ. గోడపై నెంబెవెంద్రుక ♦ కుచ్చుతోడ
నిట్టినో రాసభమును స్ప ♦ ర్శింపఁదగదు;
నరునినత్తిమాటను కుంటి ♦ నడకను కని
హేళనమునకు నట్లాచ ♦ రింపవలదు.

గీ. వాలుపీటలపైఁ జేరఁ ♦ బడఁగవలదు;
కంబళములు, బొంతలు, చిత్ర ♦ కంబళములు,
చర్మములు, రాంకవంబులు, ♦ క్షౌమములును,
బఱవుతలగడ లుపయోగ ♦ పఱుపఁదగదు.

అజా—మహాత్మా! సన్యాసులజీవన మెంతకష్టభూయిష్ఠమై యున్నది.
(నేపథ్యమున) కష్టపడనిదే యహంభావ మూరక నశించునా?

బుద్ధ—గీ. ఒడల సురభిళచూర్ణంబు ♦ లూనఁదగదు;
తైలఘృతముఖవస్తుమ ♦ ర్దనము దగదు;
కాళ్లు గ్రుద్దింపఁ గూడదు ♦ వ్రేళ్లు, మెడలు,
నడుము, కీళ్లను విఱుచుకొ ♦ నంగఁదగదు.

గీ. దర్పణంబులు, పూవులు ♦ తావళములు,
కోటుకలు, గోముఖములు, చే ♦ కత్తు, లుంగ
రములు, బెత్తముల్, విసఱుక ♦ ఱ్ఱలు, గొడుగులు,
పాదుకలు, పాగ లుపయోగ ♦ పఱుపఁదగదు.

గీ. రాజసదివతస్కరమహా ♦ ప్రధనగాథ,
లశనపానశయ్యావస ♦ నాదివార్త,
లంగనలపొంకములు, నది ♦ యంచునొద్ద
గుడగుడలు, పురాణంబులు ♦ నుడువవలదు.

గీ. నీది తప్పొ నాయది యొప్పొ; ♦ నే నెఱుంగుదు;
నీ వెఱుఁగవు; నానుడి సూటి ♦ నీకు లేదు;
చిక్కఁ బడితివి; నాతప్పు ♦ చెప్పవాఁడె
వండయిన రాఁదగు నటంచుఁ ♦ బల్కఁదగదు.

గీ. రాజసచివులరాయబా ♦ రములఁగాని
యంగనాభర్తృకలహమా ♦ ధ్యస్థ్యములను
గాని, వృద్ధబాలవితంతు ♦ కన్యకావి
వాహచర్చలలోఁ గాని ♦ పడఁగవలదు.

గీ. జనులకాశీర్వచన మమ్మ ♦ కొనఁగఁదగదు;
రాఁగఁదగుదానితో సొమ్ము ♦ లాగఁదగదు;
స్వప్నభావ్యకారకుఁడు గా ♦ వలదు; దయ్య
ములకు జనులకు దయ్యమై ♦ నిలువవలదు.

గీ. తోడిశ్రమణులఁ గొందఱఁ ♦ గూడియుండ
వలయు నేకాని యొక్కఁడు ♦ నిలువగూడ;
దొక్కచోటనె చిరకాల ♦ ముండఁదగదు;
దేశములు కాలినడకనే ♦ తిరుగవలయు.

గీ. ఎప్పుడు ధర్మబోధము నాచ ♦ రింపవలయు;
స్వల్పమగునహంతత్వంబుఁ ♦ జంపవలయుఁ;
బరమమహనీయపరతత్వ ♦ వారమందుఁ
బూర్ణముగలీనమై యుండి ♦ పోవవలయు.

సోదరులారా! ఇప్పటివఱ కివి చాలును. ఇంక నాచరణీయము లేవైనా క్రమక్రమముగ మీరే గ్రహింపఁగలరు.

(నేపథ్యమున) మహాత్మా! సన్యాసులు నడువవలసినక్రమము బోధించితిరి. ఈమాలో బుద్ధసంసారులుగూడఁ గొంద ఱున్నారు. సంసారులవిధులుకూడ బోధింపరా?

బుద్ధ—అష్టాంగశీల మిదివఱకు బోధించితిని గదా!

(నేపథ్యమున) అది తెలిసికొంటిమి. సామాన్యముగ మేము లోకయాత్రయందు నడుచుకొనఁదగిన క్రమము బోధింప వేఁడుచున్నాము.

బుద్ధ—సరే. నాయనలారా! లోకయాత్రావ్యాపారమున ముఖ్యము లగు సంబంధము లాఱు. పితృసంతానసంబంధము, గురుశిష్య సంబంధము, భర్తృభార్యాసంబంధము, మిత్రమిత్రసంబంధము, ప్రభుసేవకసంబంధము, సంసారిసన్యాసిసంబంధము.

మొదటిది పితృసంతానసంబంధము.

గీ. తండ్రి, బిడ్డలఁ బుణ్యవ ♦ ర్తనులఁ బాప
రహితులగఁ జేయవలయు; శా ♦ స్త్రప్రవీణు
లయినపిమ్మటఁ దగుచోటు ♦ లరసి పెండ్లి
సేసి తనసొత్తు వారికిఁ ♦ జేర్పవలయు.

గీ. పిల్లలు, పితను భక్తి సే ♦ వించి గృహకృ
తుల బరువు తామె పూని మ్రొ ♦ తులగుతల్లి
దండ్రులను జ్ఞప్తి మన్నించి ♦ తగినపుత్త్రుఁ
డితఁ డనుచు జను లనఁగ వ ♦ ర్తింపవలయు.

రెండవది గురుశిష్యులకుఁ గలసంబంధము.

గీ. గురుని గనిన శిష్యుం డు ♦ గ్గునను లేచి
పరమగౌరవయుక్తుఁడై ♦ కరము లెత్తి
మ్రొక్కి తగినట్టియుపచార ♦ ములను జేసి
నిశ్చలశ్రద్ధతో విద్య ♦ నేర్వవలయు.

గీ. శాస్త్రపాండిత్యమును బ్రపంచ ♦ చస్ఫురణము
సత్యవర్తనమును దేహ ♦ శక్తి గురుఁ డొ

సంగఁ దగు నర్హశిక్ష సే ♦ యంగఁ దగును;
సుతుల, శిష్యుల, నొకరీతిఁ ♦ జూడవలయు.

మూఁడవది భర్తృభార్యాసంబంధము.

గీ. సతి కుచితగౌరవం బిచ్చి ♦ సతతకృపను
గాంచి యేకపత్నీవ్రత ♦ కలన నిల్చి,
యన్యు లామెను మన్నించు ♦ నట్లు చేసి
తగిననగ లిచ్చి పోషింపఁ ♦ దగును మగఁడు.

గీ. మగనియెడ భక్తి, గృహకృత్య ♦ మార్గమందు
శ్రద్ధ, భర్తృబాంధవమిత్ర ♦ రాజియెడల
దయయు, సౌమ్యవాదుకను బా ♦ దపతితనము
కలిగి మగనాలిగా నుండ ♦ వలయుఁ గాంత.

ఇఁక నాల్గవది మిత్రమిత్రసంబంధము.

గీ. వింతవస్తువుల్ సఖున క ♦ ర్పింపవలయు;
సాదరార్ద్రంబు లగుమాట ♦ లాడవలయుఁ;
దనకు సములుగఁ గనఁదగుఁ ♦ దానువారి
సుస్థిరయశోభివృద్ధికై ♦ చూడవలయు.

గీ. ఆతఁ డశ్రద్ధగా నుండ ♦ నతనియాస్తి
రక్షణము సేయఁ దగుఁ; గష్ట ♦ రాజినుండఁ
దోడుపడఁదగు; దుష్టులఁ ♦ గూడి యుండ
వదలిచి కుటుంబమునఁ జేర్ప ♦ వలయుఁ దిరుగ.

అయిదవది ప్రభుసేవకసంబంధము.

గీ. అర్హ మగుపనిఁ గల్పించి ♦ యర్హవేత
నంబు లిచ్చి రోగాదిక ♦ ష్టంబులందు
సాదరించి వారలక్షేమ ♦ మరయు చుండి
సెలవు లప్పుడప్పుడీయంగ ♦ వలయుఁ బ్రభుఁడు.

గీ. ప్రభునిఁ గని లేవవలయుఁ; ద ♦ త్ప్రభుఁడు నిద్రఁ
బడయుపిమ్మట నిద్రింప ♦ వలయు, నతనిఁ
గూర్చి చెడ్డగాఁ బలుకఁగఁ ♦ గూడ; దాతఁ
డొసఁగుదానితో సంతుష్టి ♦ నొందవలయు.

ఆఱవది సంసారిసన్యాససంబంధము.

గీ. చిత్తవాక్యకర్మంబుల ♦ చేతజనుఁడు
కృపను బ్రాహ్మణశ్రమణుల ♦ యెడలఁ జూపి
వారి కాతిథ్య మీయంగ ♦ వలయు మఱియు
నిద్ధసేవలచే గౌర ♦ వింపవలయు.

గీ. శ్రమణులును బ్రాహ్మణులు జన ♦ జాలమునకు
పాపసంహృతికై తోడు ♦ పడగవలయు
దయను సందేహములఁ బాపి ♦ తత్త్వమార్గ
భవ్యబోధామృతం బీయ ♦ వలయు నెపుడు.

నాయనలారా! సన్యాసులైన నేమి? సంసారులైన నేమి? అం దఱుఁగూడ నహంభావసంహారమునకై ప్రయత్నింపవలయును. అట్టిమహాకార్యమునకు సంసారికంటె సన్యాసికి సౌలభ్యము హెచ్చున్నది.

(నేపథ్యమున) అందఱు సన్యాసులగునెడలఁ బ్రపంచము వేగ నశించిపోవదా?

బుద్ధ—నాయనలారా! అట్లే కానిండు. అందఱు సన్యాసులగునెడ లఁ బ్రపంచము నశింపనిండు. పేను పుట్టినతరువాత రెండుగం టలలో వందలకొలఁదిసుతులు వేలకొలఁదిపౌత్త్రప్రపౌత్త్రులు గలమహాకుటుంబమునకు మూలప్రభు వగును. అంతకంటె సు త్తమజీవమైనపక్షి యంతస్వల్పకాలములో నంతసంతతిబహుళ త్వమును బొందదు. అంతకంటె నుత్తమజీవ మగుపంది యా

కొక్కొక్కమారు పదిపిల్లలకంటె నెక్కువ పెట్టును. అంతకంటె నుత్తమజీవ మగుగోవు పెకటికంటె నెక్కువ పెట్టను. సర్వోత్తమజీవ మగుమనుజుఁడుగూడ నొక్కశిశువునే కాంచును. తల చునంతానరహితుఁడుగఁగూడ నుండును. జ్ఞానము హెచ్చినకొలఁది సృష్టి తగ్గుట నైసర్గికముగఁ గానఁబడుచున్నది. కావునఁ బూర్ణజ్ఞాని కాఁదగినవాఁడు సన్యాసి కాక తప్పదు. మతద్వేషముల చేత, మహామారులచేత, మహాహవముల చేత, మహీకంపముల చేత,మహాక్షామములచేత, మహోత్పాతములచేత జగత్తునశించుటకంటె నట్టిపవిత్రమార్గమున నశించుట మేలుకాదా? కావలసినదే నాశనము! దేనినాశనము? అహన్నాశనము. ఇదినశించినఁగాని జన్మదుఃఖము తప్పదు; తప్పదు; తప్పదు; ఆరంభమున సత్తున్నది. ఇది కేవలము జ్ఞానశూన్య మైనది. ఈయవిద్యామహాసముద్రమున రూపము నేర్పఱుచునట్టియు నంగక్రమమున నిర్మాణము చేయునట్టియుఁ గొన్నిశక్తు లున్నవి. వీనినుండి మొదటఁ జైతన్య ముద్భవించినది. ఈచైతన్యమునుండి యంగరూపవిభేదము లగుప్రాణు లుద్భవించినవి. ఈప్రాణులు పంచేంద్రియములను మనసునుగల్పించుకొనినవి. ఈయాఱుతత్త్వములకు వస్తుసమావేశనము కల్గుసరికి వేదన లారంభము లైనవి. వేదనలవలన సర్వరక్షణాసక్తి బయలుదేరినది. అట్టియాసక్తివలన నైహికవస్తువులయెడల రాగద్వేషము లుద్భవించినవి. ఇవి బలిష్ఠమై యహంతత్త్వమును వృద్ధిఁ జేసినవి. ఈయహంతత్త్వము జన్మపరింపరను బడి మహాదుఃఖ మనుభవించుచున్నది.

అజా——మహాత్మా! ఆరంభమున నున్నది యజ్ఞానమా?

బుద్ధు——ఔను.

అజా——దీనినుండియే సృష్టి కలిగినది?

బుద్ధు.—అ.

అజా.—తనలో సృష్టి కల్గుచున్న దని యిది యెఱుఁగదు?

బుద్ధు—అజ్ఞానమే యని చెప్పితిని గాదా!

అజా—కావున, దీనికృత్యము మీ రాక్షేపించిన యున్మత్తుని కృత్యము కంటె భిన్న మెట్లు?

బుద్ధు—కొంతకాలము జ్ఞానముండి యది నశించునప్పు డున్మత్తత—లేక జ్ఞానమనుతత్త్వ మొకటి యున్నప్పు డది లేనిస్థితి యున్మాద మగునుగాని శుద్ధాజ్ఞాన మున్మాద మెట్లగును? ఈమహాజ్ఞానము నందు రూపాంగసృష్టికారకము లగుశక్తు లున్నవి. ఈశక్తు లున్నట్టు లజ్ఞాన మెఱుఁగదు. ఈశక్తులొకయుద్దేశముతోఁ బనిచేయ లేవు. ఈశక్తు లేపనిచేసినవో యెట్లుచేసినవో యది యజ్ఞాన మెఱుఁగదు. శక్తు లెఱుఁగవు.

అజా—ముం దాతత్త్వము శుద్ధాజ్ఞాన మని మీ రెట్లు చెప్పఁగలుగుదురు?

బుద్ధు—జ్ఞానతత్త్వ మగునెడల సోద్దేశకమైనగాని నిరుద్దేశక మైనగాని సవిలాస మైనగాని సృష్టి కవకాశము లేదు కాదా?

అజా—పిదపఁ జైతన్య మెట్లు కలిగెను?

బుద్ధు—పైన నుండుగాలిచే సముద్రము తరంగములక్రింద విఱిసి నీటితుంపురుల నుద్ఘోషింపఁజేయునట్లు లోనిసృష్టికారకశక్తులవలన నజ్ఞానమువివిధములగు తెలియరాని, తెలివిలేని చలనముల నొంది చైతన్యము నుద్బోధింపఁజేసినది. తుంపురులను వెదజల్లుటలో సముద్రమున కెంతయుద్దేశ మున్నదో చైతన్యసృష్టియందుఁగూడ నజ్ఞానమున కంతే.

అజా—అటుతరువాత రూపాంగవిభేదము లగువస్తుజాలము కల్గినదా?

బుద్ధు—ఔను.

అజా—తరువాత ప్రాణులు పంచేంద్రియములను, మనస్సు నెట్లు కల్పించుకొనినవి?

బుద్ధు—తమత్తప్పుకర్మమాహాత్మ్యము చేత—

అజా—నాకు బోధము కాలేదు.

బుద్ధు—సర్వావయవశూన్యమై యుల్లిపొరలవంటి రెండుచర్మములు గలియుటచేఁ జిన్నసంచివలె నున్నయొకప్రాణి యున్నదనుకొనుము.

అజా—చిత్తము.

బుద్ధు—ఆదృచ్ఛికముగ దానిశరీరమునకుఁ దాఁకినయాహారపదార్థము నేదో తనలోనికిఁ బీల్చుకొని బ్రదుకుచుండును. దానికొకచోట నోరన్ని యింక నిర్ధారణము కాలేదు. దేహమున నున్నరంధ్రము లన్నియు నోళులే. కాదాచిత్కముగఁ గాని యాహారము లభింపనియాప్రాణికి దేనినైనఁ బట్టుకొని తినవలయుననుమహావాంఛయుండదా? ఇట్టివాంఛ క్రమక్రమముగ వృద్ధికాఁగలోని చైతన్యము పైశరీరస్థానములను ముంచునకుఁ గ్రమక్రమముగ గెంట నట్టిచోటులఁ గాలక్రమమునఁ జేతు లుద్భవించినవి. చేతులుండుటవలనఁ బట్టుకొనువాంఛ గలుగలేదు: పట్టుకొనువాంఛచేతనే చేతులు గల్గినవి. అటులే నడుచువాంఛచేతనే ప్రాణులకుఁ గాళులు కలిగినవి. చూచువాంఛచేఁ గన్నులు మొదలగుపంచేంద్రియములు గలిగినవి. ఈపంచేంద్రియములవలన గలిగినవేదనాదు లన్నియు సంక్షోభవించి యొక చిన్నమనసుగఁ గ్రమక్రమముగ నేర్పాటయినది. మనస్సువలన నాలోచనములు గలుగలేదు. ఆలోచనములవలననే మన సుద్భవించినది. ఇది మిక్కిలి వింతగ నున్నది.

అజా—మహాత్మా! ఇది మిక్కిలి వింతగ నున్నది. మనసు లేనిదే యాశనదర్శనాదివాంఛ లెట్లు?

బుద్ధ—నాయనా! ఇది వింత లేదు. శిశుహాసనస్తన్యపానాదికార్యములు వాంఛారహితములు కావా? మృదుల మగునట్టియు నుష్ణమగునట్టియు నొకవస్తువు శిశువునోటికిఁ దగులఁగ నచ్చటినరముల కొకవిధమగు చలనము కలిగి కొన్నికొన్నికదలిక లారంభించును. ఇట్టివి నిర్మానసికకార్యములు.

అజా—తరువాతఁ గ్రమముగ స్వరక్షణాసక్తి, రాగద్వేషములు, తుదకహంతత్వము బయలుదేరినవి. ఇది తెలిసినది.

బుద్ధ—అహంతత్వమునకే జన్మపరంపర. అందువలననే దుఃఖము. కావున సర్వదుఃఖభూయిష్ఠ మగునీయహంతత్వ మాదియం దెందువలనఁ గలిగినది?

అజా—సర్వమూలాజ్ఞానమునుండి—

బుద్ధ—కావున నజ్ఞానము నశింపఁజేసికొనినఁ గాని యహంతత్వము క్రమముగ నశింపదు.

అజా—ఆక్రమ మేది?

బుద్ధ—ఇదిగో! పైనఁజెప్పినక్రమమే. మొదటిది నశించినవెంటనే రెండవది. అది నశించినవెంటనే మూఁడవది. ఇట్లు చివరకు రాగరాగద్వేషనాశనముతో నహంతత్వము నశించును. దానితో దుఃఖరాహిత్యము. దానితో ననుభవైకవేద్య మగుశాంతి. అట్టిస్థితిలో జన్మము లేదు; దేహము లేదు; సృష్టి లేదు; రూపము లేదు; భూమి లేదు; గాలి లేదు; నీరు లేదు; వేఁడిమి లేదు; శీతము లేదు; అవకాశము లేదు; కాలము లేదు; జ్ఞానము లేదు; అజ్ఞానము లేదు; లేకపోవుట లేదు; గ్రహణము లేదు; గ్రహణరాహిత్యము లేదు; ఈప్రపంచము లేదు; మఱియొకప్రపంచము లేదు; ఇట్టిస్థితియే నిర్వాణస్థితి. సృష్టికారక మగు శాశ్వతతత్వముతో నేకీభావమే నిర్వాణము. ఇట్టి

అజా—మహాత్మా! తాము నిర్వాణ మొందినట్లు చెప్పితిరి గదా తమ కింక నిట్టిస్థితి రాలేదేమి?

బుద్ధ—(సవ్యాజము) నాయనా! ఇది శీఘ్రముగ రానైయున్నది. మరణ మతరువాతనేకాని యిట్టిస్థితి రాదు. నిర్వాణము రెండువిధములు. సజీవనిర్వాణము, నిర్జీవనిర్వాణము. నేను మొదటి యవస్థలో నిప్పటి కున్నాను.

అజా—మహాత్ములుగూడ నింకఁ గర్మ మాచరింపవలసిన దేనా?

బుద్ధ—చేయక తప్పదు. అహంభావము నడఁచివైచి యిట్టినిర్వాణస్థితిని బొందితిమి. ఈస్థితిని మరణపర్యంతము నిలువఁబెట్టుకొనుటకుఁ బరోపకారకర్మ మత్యావశ్యకము. ఇట్టిస్థితినొందినవారయ్యును బరోపకారమును మానివేసినయెడల నడఁపఁబడినయహంతత్వము క్రమక్రమముగ సంకురింపవచ్చును. కావున సత్కర్మము చేయవలయును. సత్కర్మ మెంతచేసిన నంతనడఁగ నహంతత్వము నశించును. నాయనా! నిర్జీవనిర్వాణమునకే పరినిర్వాణమని పేరు. అట్టిస్థితిని నేను శీఘ్రముగఁ బొందనై యున్నాను.

అజా—తా మింకఁ జిరకాల మిచ్చట లోకోద్ధరణార్థమై యుండ దగినది. కాని యట్లు సెలవీయఁగూడదు.

బుద్ధ—నాయనా! నేను జేయవలసినబోధ మ్మతియుఁ బూర్తియైనది. నే నిచటఁ బుట్టినకార్య మేదియో నెఱవేఱినది. ఇఁకఁ జాలు. ఓసోదరులారా! బుద్ధమతమును—సముద్రము వంటిబుద్ధమతమును—సర్వవిధముల సముద్రమువంటి బుద్ధమతమును—

(నేపథ్యమున) సముద్రమువంటి దెట్లో మాకుఁ దెలియ లేదు.

బుద్ధ—దిగఁగ దిగఁగ సముద్రము లోతగును, అట్లులే నామతము. తరంగములు గలిగినను గాలివానలు గలిగినను మఱి యెన్ని భేద

ములుగలిగినను సముద్రము తుదకు సముద్రముగనే యుండు
ను—నామతముగూడ నట్లే.

మృతులగువారిని సముద్రము గట్టునఁ బడవైచును. నామతము
గూడ నట్లే.

అన్నినదులు సముద్రమునఁ గలసి స్వనామరూపభేదములఁ నెడఁ
బాసినట్లు సర్వజాతులవారు నాసంఘమునఁ గలిసి సోదరులై
బోధాచార్యునిబిడ్డ లగుదురు

ఎన్నినదులనీరము సముద్రమునఁ గలసిన నెంతమేఘోదకమందు
నఁ గలసినను సముద్రమునకు హెచ్చుగాని తరుగుగాని లేదు.
అట్లేధర్మమున నెందఱుగలసినను దానికి వృద్ధిగాని క్షయముగాని లేదు. సముద్రోదకమున కొక్కటే రుచి యున్నట్లు బుద్ధమతమున కొక్కముక్తిరుచి యున్నది.

సముద్రమున విలువలేనిమణు లున్నవి. బుద్ధధర్మమునఁగూడ
నట్లే.

సముద్రము మహాప్రాణులకు నిలయమే. బుద్ధధర్మముగూడ
నట్లే.

ఘనుఁడు, నీచుఁడు, ధనవంతుఁడు, ధనహీనుఁ డనుభేదము లే
కపోవుటచే బుద్ధమతము పరిశుద్ధమగునది.

వస్తువిభేదము చూడకుండ నీ రెట్లు పరిశుద్ధి నాచరించునో
నా మతముగూడ నట్లే.

రోదసీకుహరమున నుండి చిన్నపెద్దవస్తువుల నన్నిఁటిని దనయ
ధీనమగ్ని యెట్లు చేసికొనునో బుద్ధధర్మ మటులే.

ఆకాశమున నన్నిజీవము లుండుటకు స్థానమున్నట్లే బుద్ధధర్మ
మునఁగూడ నున్నది.

సోదరులారా! సర్వవిధములఁ బవిత్ర మగునీబుద్ధధర్మము నప
విత్రముకాకుండ జాగ్రత్త పెట్టికొనుభారము మీదే. అజాతశ
త్రుఁడా! మే మీగ్రామమునకు వచ్చి మూఁడుదినములు దాఁ
టి నాల్గవదినము జరుగుచున్నది. ఈదినమున నిక్కడ భిక్షము
స్వీకరింపక యన్యగ్రామమునకై పోవలయును.

అజా.—మహాత్మా! బుద్ధబోధసుధను ద్రావించి మాకు శాశ్వతపదవి
ని జేసితిరి. ఇఁక నేవాంఛలును లేవు. ఐన నిట్లు కోరెదను.

గీ. ధరణి యీతిబాధలు లేక ♦ తనరుఁగాక
ప్రజలయన్యోన్యవైరముల్ ♦ పాయుఁగాక
కవిత రాజపోషణమునఁ ♦ గ్రాలుఁగాక
నీతిపాలనమున రాజు ♦ నెగడుఁగాక!

(నేపథ్యమున జప్పటలతో) తథాస్తు! తథాస్తు!

(అందఱు నిష్క్రమింతురు.)

ఇది దశమాంకము తో సర్వము సంపూర్ణము.

శ్రీ శ్రీ శ్రీ

---